రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్
**తొలివెలుగులు**

ప్రథమ ముద్రణ
బహుధాన్య మార్గశిర కృష్ణ చతుర్దశి
మాస శివరాత్రి
**17 డిశంబర్ 1998**

ప్రచురణ
నవయుగ భారతి ప్రచురణలు
**3-4-705/4,** నారాయణగూడ
హైదరాబాద్ - **500 029**

కంపోజింగ్
**శివా కంప్యూటర్స్ & గ్రాఫిక్స్**
మల్కాజిగిరి, హైదరాబాద్.

ప్రతులకు
**సాహిత్యనికేతన్, కేశవనిలయం**
బర్కత్‌పుర, హైదరాబాద్ - **27**

సాహిత్యనికేతన్
ఏలూరు రోడ్ విజయవాడ - **2**

వెల : రూ **25/-**

# మనవి

రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ ప్రారంభించిన కొద్ది సంవత్సరాలలోనే దేశమంతటా వ్యాప్తిచెంది, జాతీయవాదుల అభిమానాన్ని సంపాదించుకోవటానికి అనేక కారణాలున్నాయి. అందులో ప్రముఖమైన కారణం ఆ సంస్థకున్న దేవ దుర్లభ కార్యకర్తల గణం. ఆ కార్యకర్తలను తీర్చిదిద్దటానికి అహరహమూ శ్రమించిన, వ్యక్తి నిర్మాణమనే మహాకార్యం కోసం తమ రక్తాన్ని స్వేద బిందువులుగా మారేటట్లు, తమ వ్యక్తిగత జీవనం గురించి ఆలోచించకుండా కర్మయోగాన్ని సాధన చేసిన మహానుభావులే కారణం. అటువంటి వారి జీవిత చరిత్రలు కార్యకర్తలకు ప్రేరణనిస్తాయి. ఇదివరలో కొందరి జీవిత చరిత్రలు పాఠకులకు అందించాం. యిప్పుడు శ్రీ బాపూరావ్‌జీ మోఘే, శ్రీ ఆబాజీథట్టే జీవిత చరిత్రలను పాఠకులకు అందించాలనెడి కోరికను శ్రీ పులుసు గోపిరెడ్డి గారి ముందు వెలిబుచ్చగానే ఆయన శ్రమకోర్చి మాకు వ్రాసి యిచ్చారు.

శ్రీ బాపూరావ్‌జీ ఆంధ్ర ప్రాంత ప్రచారక్‌గా పనిచేయటంతో ఆంధ్ర ప్రాంత స్వయంసేవకుల హృదయాలను చూరగొన్న మహానుభావులు. శ్రీ ఆబాజీ ప.పూ. శ్రీ గురూజీ వెంట ప.పూ. శ్రీ బాలాసాహెబ్‌జీ వెంట పర్యటనలలో ఉండేవారు. అందువలన ఆయనకూడ ఆంధ్రప్రాంత స్వయంసేవకుల మనస్సులలో చెరగని ముద్ర వేసినవారే. వీరిరువురి జీవిత చరిత్రలను పుస్తకరూపంలో పాఠకుల కరకమలాల యందుంచటానికి మాకు సహకరించిన శ్రీ పులుసు గోపిరెడ్డిగారికి మా కృతజ్ఞతా పూర్వక వందనాలు. మరెన్నో విధాలుగా తోడ్పడిన వారందరికీ మా కృతజ్ఞతలు.

ప్రకాశకులు

బహుధాన్య మార్గశిర కృ. చతుర్దశి
మాస శివరాత్రి
**17** డిసెంబరు **1998**
హైదరాబాదు.

# ముందుమాట

శ్రీ బాపూరావ్ మోఘే 1946 డిసెంబరులో ఆంధ్రప్రాంతానికి ప్రచారక్‌గా వచ్చారు. దాదాపుగా అప్పటినుంచి వారితో నాకు పరిచయం. నన్ను స్వయంసేవక్‌గా, వక్తగా, రచయితగా తీర్చిదిద్దింది వారే. నాకే కాదు, ఈ ప్రాంతంలో ఎందరికో ఆయనే ప్రేరణను అందించారు. సంఘ కార్య విస్తరణకు, సంఘకార్య సమర్థ నిర్వహణకు వారిదే వ్యూహ రచన. తెలుగు వారపత్రిక, జాగృతి ప్రారంభానికీ వారిదే ప్రేరణ. అయినా ఆయనకంటూ కోర్కెలు లేవు. మమకారాలు లేవు. ఆయన వీతసంగుడు.

శ్రీ ఆబాజీ థట్టే 1945 నుంచీ సర్‌సంఘ్‌చాలక్‌కు సహాయకులుగా దేశమంతటా పర్యటించారు. అయినా ఎప్పుడూ వేదిక లెక్కలేదు. దండలు వేయించుకోలేదు. ఎందరికో మార్గదర్శనం చేశారు. ఎన్నో సంస్థలను సద్వివర్శతో ముందుకు నడిపించారు. అయితే తన వ్యక్తిత్వాన్ని పెంచుకోవాలని ఆయన ఆలోచించలేదు. శ్రీ గురుజీ మాటల్లో చెప్పాలంటే ఆయనొక ఆత్మవిలోపి. శ్రీ గురూజీ స్వయం సేవకులందరూ అలా కావాలని అంటుండేవారు. శ్రీ గురుజీతో 28 సంవత్సరాలు గడపటంతో వారి ఆలోచనలను పుణికి పుచ్చుకున్నారేమో అన్నట్లుగా వీరు ఆత్మ విలోపిగా మారారు.

శ్రీ బాపూరావ్‌జీ, శ్రీ ఆబాజీలు యిద్దరూ నా జీవితాన్ని పభావితం చేసినవారే. యిప్పుడు వారిద్దరి జీవిత చరిత్రలు వ్రాయటానికి వకాశమిచ్చిన నవయుగభారతి వారికి, రచనలో తోడ్పడిన వారికి నా న్యవాదాలు.

పులుసు గోపిరెడ్డి

# ‘వీతసంగుడు’

# బాపూరావ్ మోఘే

ఇందులో

"నన్ను సంఘ శాఖకు రప్పించిన మహనీయుడు
శ్రీ బాపూరావ్ మోఘే"

– ప్రొ. రాజేంద్ర సింహాజీ
(పూజ్య రజ్జుభయ్యా)

"నాకుగాని అవకాశం చిక్కితే బాపూరావ్‌జీని
స్వతంత్ర భారత ప్రభుత్వంలో ప్లానింగ్
మినిష్టరుగా నియమిస్తాను"

– శ్రీ భావ్‌రావ్ దేవరస్

# చైతన్య ప్రభ

## కాంతి ప్రభావం

అటవి సంపదకు, ఖనిజసంపదకు నిలయమైన మధ్య ప్రదేశ్ మేధాసంపదకు, వీరగాధలకు కూడ నెలవే. నర్మదా నది జలాలతో పునీతమైన దివ్య భూమి ఇది. శంక దేవుని శిష్యుడైన గౌడపాదాచార్యుల వద్ద మహాభాష్యం,వేదాంతం నేర్చుకొన్న గోవిందపాదాచార్యుల ఆశ్రమం నర్మద ఒడ్డునగల అమరకాంతంలోనే ఉంది. జగద్గురు శంకరాచార్యులు ఈ గోవిందపాదాచార్యులు వద్దనే వేదాంత మభ్యసించి దేశమంతటా జ్ఞానదీపం వెలిగించి దిగ్దిగంతాలు వెలుగుతో ముంచెత్తాడు. ఆ వెలుగులు ప్రసరించిన 'భాను పురం' పట్టణంలో మధుసూధన వామన మోఘే( బాపూరావ్‌జీ) జన్మించారు. ( ఇది మందసోర్ జిల్లాలో ఉంది). తండ్రి పేరు శ్రీవామన్ పాండురంగ మోఘే, తల్లి పేరు అన్నపూర్ణ. ఉద్యోగరీత్యా శ్రీ వామన్ పాండు రంగ మోఘే ఇందోర్ నుంచి భాను పురాకు రావడం జరిగింది. ఈ దంపతులకు నల్గురు మొగపిల్లలు. వీరిలో పెద్దవాడైన శ్రీ మోరేశ్వర్ వామన మోఘే రెవెన్యూ శాఖలో డిప్యూటీ కలెక్టర్‌గా పనిచేసి పదవీ విరమణానంతరం ఇందోర్‌లోని తమ స్వంత గృహంలోనే ఉంటున్నారు. రెండవవారు శ్రీ మనోహర్ వామన మోఘే. వీరు 1942 నుంచి 1990 వరకు ప్రచారక్‌గా పని చేశారు. ఆ తర్వాత, కొంతకాలం గృహస్థ ప్రచారక్‌గా ఉన్నారు. ఇందోర్, ఉజ్జయిని మొదలగు ప్రాంతాలలో పనిచేశారు. మొదటి నిషేధ సమయంలో వీరు మధ్య భారత ప్రచారక్. వీరు ఇప్పుడు ఇందోర్‌లోనే ఉన్నారు. మూడవవారు శ్రీ బాపూరావ్‌జీ మోఘే. నాల్గవ వారు శ్రీ మార్కండ్ మోఘే. వీరు యల్.యం.పి చేసి రెండవ ప్రపంచయుద్ధ కాలంలో డాక్టరుగా సైన్యంలో పని చేశారు. వీరిది సంపన్న కుటుంబం.

శ్రీ బాపూరావ్‌జీ 1927లో మెట్రిక్ పరీక్ష ప్యాసయ్యారు. ఆ తర్వాత కొంతకాలం ఊరికే ఉన్నారు. ఆ పిమ్మట శ్రీ హరి విష్ణు వాకణ్‌కర్ వెంట వారణాసి వెళ్ళి అక్కడనే ఇంటర్మీడియేట్, బి. యస్. సి పరీక్షలు ప్యాసయ్యారు. ఆ తర్వాత కొంత కాలానికి లక్నోలో యం. యస్. సిలో చేరి 1937-38లో యం. యస్. సి ప్యాసయ్యారు. లక్నోలో చదువుకొనేప్పుడే వారు స్వయంసేవక్ అయ్యారు. భావ్‌రావ్‌జీకి అత్యంత సన్నిహితులైనారు. వారి ప్రేరణతోనే ప్రచారక్ అయ్యారు. వారెన్నడూ కుటుంబ విషయాలు పట్టించుకోలేదు. ప్రచారక్ అయ్యాక రాకపోకలు కూడా తగ్గాయి. ఇందోర్ వెళ్ళి కుటుంబ సభ్యులను చూచిరావడం బహుతక్కువైంది. వారిని ఇంట్లో అందరూ ముద్దుగా బాపూరావ్ అని పిలిచేవారు. బయట కూడా అదే అలవాటు అయింది. అందరికీ వారు బాపూరావ్‌జీగానే సుపరిచితులైనారు. మొదటినుండి వారికి పెద్దవాళ్ళతో సహచర్యం అంటే ఎంతో ఇష్టంగా ఉండేది. తమ పరిచయంలోకి వచ్చిన వ్యక్తులు ఎంతగొప్ప వారైనా అతి సన్నిహితంగా వెళ్ళి వారి ప్రేమాభిమానాలు చూరగొనే చొరవ పుష్కలంగా ఉండేది. ఆనాడు అఖిల భారతీయ నాయకులుగా ప్రసిద్ధి చెందిన ఆచార్య కృపలానీ, శ్రీమతి సుచేతా కృపలానీలకు వారు చాలా సన్నిహితులు. అలాగే బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం స్థాపకులైన శ్రీ మదనమోహన మాలవ్యాగారి ప్రేమాభిమానాలు కూడా పొందారు. బాల్యం నుండి హాకీ ఆట అంటే వారికి ఎంతో ఇష్టం. అలాగే ఇండోర్ గేమ్సులో కేరమ్స్ వారి అభిమాన క్రీడ. మొదటి నుండి వారిది ప్రశాంతమైన స్వభావం. మనిషి ముఖవర్చస్సు కూడ అందుకు తగినట్లే ఉండేది. వారి మూర్తిమత్వాన్ని వర్ణిస్తూ శ్రీ ఓగేటి అచ్యుత రామశాస్త్రిగారు ఇలా అంటారు- 'శ్రీ బాపూరావ్‌జీ దూరం నుండి చూస్తే [illegible] గంభీరులుగాను, దగ్గరికి వెళ్ళి మాట్లాడటం మొదలు పెడితే

గంగానదివలె పవిత్రంగాను కనిపించేవారు. చొరవ తీసుకొని సమీపిస్తే ప్రతి సమస్యకు అతి సరళంగా ఆచరణసాధ్యంగా పరిష్కారం సూచించేవారు. ప్రశాంత రమణీయంగా, మృదులంగా మాట్లాడేవారు. ప్రతిరోజు తమ బట్టలు తామే ఉతుక్కొని ధరించేవారు. పదార్పణ్నె పసిడి మేనికాంతి, సమచతుస్రాకృతిగా కనిపిస్తున్నట్లున్న సుప్రభాత సుందర శత పత్రం వంటి ముఖబింబం, కాటుక కన్నులా అన్నట్లున్న ఆకర్షణీయములైన నేత్రాంచలములు, అంత వత్తుగాను, అంత పల్చగాను కాకుండా మధ్యస్థంగా ఉన్న నల్లని క్రాపింగు, ఒంటి పేటగాగాక, రెండుపేటలుగా ఉన్నవో అన్నట్లు కాన్పించే తెల్లని అందమైన పలువరుస, కుదిమట్టంగాను, పొట్టిగాను ఉన్న విగ్రహం. ఇదీ వారి మూర్తిమత్త్వము.'

1937లో శ్రీ భావ్‌రావ్ దేవరస్ లక్నో చేరారు. ఆ సమయంలోనే శ్రీ బాపూరావ్‌జీ మోఘే ఇందోర్ నుండి యం.యస్.సి చదువుకొనేందుకు లక్నో వచ్చారు. భావ్‌రావ్‌జీ, డాక్టర్జీ వలన ప్రేరితులై చదువు ఒక మిషగా పెట్టుకొని సంఘ కార్యం నిమిత్తమే లక్నో చేరిన వ్యక్తి. బాపూరావ్‌జీ మొదటి నుండి అధ్యయనశీలి కావడం చేత ఆనాడు దేశంలోని రాజకీయాలు క్షుణ్ణంగా పరిశీలించి హిందూ జాగరణ అవసరాన్ని గుర్తించి ఆ పని ఆర్.యస్.యస్ కు మాత్రమే సాధ్యమవుతుందన్న విశ్వాసంతో సంఘానికి దగ్గరైన వ్యక్తి. ఆనాడు రాజకీయాలు పరిశీలించిన ఏ వ్యక్తికైనా రాబోయే రోజుల్లో ముస్లిం సమాజం వల్ల ముంచుకురానున్న ముప్పు ఎంత తీవ్రమైనదో ఇట్టే అర్థం అయిపోతుంది. 1937 ఎన్నికలలో ముస్లిం లీగుకు శృంగభంగం అయింది. జిన్నా తన ఆలోచనా సరళిని పూర్తిగా మార్చుకొన్నాడు. అంతకు ముందు కేంద్రశాసన సభలో 'నేను ముమ్మాటికి జాతీయవాదిని' అని ఎలుగెత్తిచాటిన వ్యక్తి ప్లేటు ఫిరాయించి, 'శతాబ్దం క్రిందట తొలి హిందువు ఇస్లాంలోనికి

మారిన రోజున పాకిస్తాన్ జన్మించింది' అంటూ గళమెత్తాడు. అంతకు ముందు మతరాజకీయాలంటేనే ఏవగించుకొంటూ మసీదు సభలలో పాల్గొనడానికి ఇచ్ఛగించని వ్యక్తి మసీదులకు వెళ్ళి ఖుత్బా వినడం మొదలు పెట్టాడు. నిరక్షరాస్యుల సాంగత్యమంటేనే ఇచ్ఛగించని వ్యక్తి మేధావి వర్గాన్ని విడిచి మతాంధతగల నిరక్షరాస్యులకు సన్నిహితుడయ్యాడు. 'జిన్నాభాంయీ' కాస్తా 'క్వాయిద్-ఏ-ఆజమ్' అయిపోయాడు. కాంగ్రెస్ బలహీనతను గుర్తించి రోజుకో డిమాండు పెంచుతూ వారి మెడలు వంచి ఒప్పించడం ప్రారంభించాడు. ఇటు హిందూ సమాజం స్థితి చూస్తే అనైక్యతతో క్రమశిక్షణ అనేది మచ్చుకు కూడా లేక ఎవరిదారి వారిది అన్న రీతిలో సాగుతున్నది. ఆ పరిస్థితిలో హిందువులలో సంఘటన నిర్మాణం చేయడం అంటే సులువైన విషయంకాదని పూర్తిగా అర్థం చేసుకొనే బాపూరావ్‌జీ సంఘకార్యం చేపట్టారు.

భావ్‌రావ్‌జీ సహచరుడుగా సంఘశాఖలు స్థాపించే ప్రయత్నంలో ఎన్నో కష్టాలు ఎదుర్కోవలసి వచ్చింది. సంఘకార్యం వ్యవస్థితరూపంలో ప్రారంభం కానప్పటికి వ్యక్తులను కలుసుకొని వారిని సంఘభావాలకు అనుకూలంగా మార్చే ప్రయత్నంలో ఎంతగానో తిరగవలసి వచ్చేది. అదనంగా ఖర్చులవుతుండేవి. ఆ ఖర్చుల మేరకైనా ఏదో విధంగా సంపాదించుకోవాలి. అందుకని బాపూరావ్‌జీ, భావ్‌రావ్‌జీ ఇద్దరూ ట్యూషన్ చెప్పాలని నిర్ణయించుకొన్నారు. వీరివద్ద మెట్రిక్యులేషన్ చదవడానికి ఇద్దరు విద్యార్థులు చేరారు. పేరుకు ఇద్దరు ట్యూషన్ చెపుతున్నారన్న మాటేగాని భావ్‌రావ్‌జీ ఎప్పుడూ వారిని కలవాలని, వీరిని కలవాలని బయటికి పోతుండేవారు. ట్యూషన్ చెప్పే భారం మొత్తం బాపూరావ్‌జీ పైనే పడేది. మధ్యమధ్యలో భావ్‌రావ్‌జీ కామ్ఠార్ కూడా పోయి వస్తుండేవారు. ఈ ట్యూషన్ల మీద వారికి

నెలకు 20,21 రూపాయలు లభించేవి. స్వల్పమొత్తమైనా ఈ ఆదాయాన్ని భద్రంగా ఖర్చు పెడుతూ సంఘ కార్యం కొనసాగిస్తూ ఉండేవారు.

ఒకప్రక్కన ఖర్చులు వెళ్ళదీసుకోవడం ఎలాగా అని వెదుక్కోవడం, రెండోప్రక్కన శాఖలు ప్రారంభించాలనే ప్రయత్నం సఫలం కావడం లేదు ఏమి చేయాలి అని ఆలోచించడం- రెండు అంశాలు మెదడును తొలిచేస్తుండేవి. శాఖ స్థాపించకుండా డాక్టర్జీకి మొఖం చూపించకూడదనేది భావ్‌రావ్‌జీ దృఢనిర్ణయం. అయితే ఎంత ప్రయత్నించినా క్రమబద్ధంగా శాఖకు రావడానికి ఎవరూ సిద్ధపడటం లేదు. పెద్దపెద్దవాళ్ల దగ్గరకు వెళ్ళి చేసిన అభ్యర్థనలు వ్యర్థమైనాయి. ఫలితం చేతికందని శ్రమతో ఒక సంవత్సరం వృధా అయింది అను కొన్నారు భావ్‌రావ్‌జీ. అది పనికాదనుకొని ఆర్యవీర్‌దళ్ యువకుల కార్యక్రమాలకు వెళుతూ వారిని పరిచయం చేసుకొన్నారు. ఆ పరిచయ ప్రభావంచేత శ్రీ దీపనారాయణ్ అనే యువకుడు నాగపూర్ శిక్షావర్గకు వెళ్ళడానికి అంగీకరించాడు. శిక్షావర్గపూర్తి చేసుకొని వస్తే అక్కడ పొందిన శిక్షణ ఫలితంగా సంఘ శాఖ స్థాపనకు అతడు ఎంతగానో తోడ్పడతాడనే విశ్వాసంతోనే భావ్‌రావ్‌జీ అతడిని శిక్షావర్గకు పంపించారు. ఆయన విశ్వాసం వమ్ము కాలేదు. శిక్షావర్గనుండి తిరిగి వచ్చిన దీపనారాయణ్ పూర్తిగా పరివర్తన చెందాడు. ఎంతో ఉత్సాహంతో సంఘశాఖ ప్రారంభించేందుకు నడుంకట్టాడు. ఆవిధంగా లక్నో నగరంలో తొలి క్రమబద్ధమైన శాఖ 1938లో ప్రారంభించబడింది. భావ్‌రావ్‌జీకి ఏనుగు ఎక్కినంత బలం వచ్చింది. ఒక సంవత్సరంపాటు బాపూరావ్‌జీ, భావ్‌రావ్‌జీ ఇద్దరూ ఎంతటి మానసిక వత్తిడికి గురియైనారో వర్ణించడం కష్టం. పిరికి గుండెగల వారైతే ఎప్పుడో వారి ప్రయత్నం విరమించుకొని ఇంటిదారి పట్టేవారు. కాని ధీరులు అలా కాదు కదా!

ధీరుల్ విఘ్న నిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థములుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్‌గావునన్
అనికదా కవి వాక్యం!

దేశంలో విచ్ఛిన్నకరశక్తుల ప్రాబల్యం పెరుగుతూపోతోంది. ఎంతటి త్యాగాలకైనా సిద్ధపడి దేశ అఖండత్వాన్ని కాపాడి తీరాలనే పట్టుదల ప్రజలలో కల్గించలేకపోయింది కాంగ్రెస్. ముస్లింలీగు తదనుయాయుల కోర్కెలన్నీ దేశవిభజన దిశగా సాగుతున్నాయి. ముఖ్యంగా తూర్పు పంజాబులో పరిస్థితి దినదినం క్షీణిస్తూవస్తోంది. అనుకోని విపత్తు ఏది సంభవించినా హిందూ సమాజాన్ని రక్షించే నాధుడు కన్పించడం లేదు. సంఘ శాఖలు ఈ ప్రాంతంలో బలపడితే కొద్ది మేరకు ఆత్మరక్షణ ప్రయత్నంలోనైనా తోడ్పడవచ్చుననే భావన సంఘ అధికారులలో ఉండేది.

ఈ ప్రాంతంలో సుశిక్షితులైన స్వయంసేవకుల సంఖ్య పెరగాలని డాక్టర్జీ ఎంతగానో కోరుకొన్నారు. 1938లో లాహోర్‌లో జరిగిన సంఘ శిక్షావర్గకు వారు స్వయంగా తరలి వెళ్ళారు. లాహోర్, సియాల్కోట్, డేరాస్మాయిల్‌ఖా, ముల్తాన్, అమృత్సర్ మొదలైన ప్రాంతాలనుంచి వచ్చిన 40 మంది స్వయంసేవకులు శిక్షావర్గలో శిక్షణపొందారు. డాక్టర్జీ ఈ శిక్షావర్గకు వెళ్ళి తిరిగి వస్తూ కాన్పూర్ మీదుగా కాశీ చేరారు. భావ్‌రావ్‌జీ ప్రయత్న ఫలితంగా 1938లోనే కాన్పూర్‌లో కూడ శాఖ ప్రారంభమైంది. విదర్భ ప్రాంతం నుంచి వచ్చిన కొందరు స్వయంసేవకులు నవాబ్‌గంజ్‌లోగల సనాతన ధర్మకళాశాలలో చదువుతుండేవారు. వారి సహకారంతో కాన్పూర్ శాఖ ప్రారంభం అయింది. లాహోరు నుండి కాశీకి తిరుగు ప్రయాణంలో కాన్పూర్ మీదుగా డాక్టర్జీ వెళుతున్నారని తెలిసి కాన్పూర్ స్వయంసేవకులు

కూడా స్టేషన్‌లో డాక్టర్జీని కలుసుకోవడానికి వచ్చారు. వారితోపాటు లక్నో నుండి వచ్చిన బాపూరావ్ మోఘే కూడా ఉన్నారు. ఆ రోజుల్లో నాగపూర్‌లో నివశించిన సంఘ కార్యకర్తలకు అనునిత్యం డాక్టర్జీ దర్శన భాగ్యం లభించేది. కాని ఇతర ప్రాంతాల వారికి అది అరుదైన అవకాశం కదా! బాపూరావ్‌జీ స్వస్థలం ఇండోర్ కావడంచేత నాగపూర్‌తోటి సాన్నిహిత్యం తక్కువ. కాబట్టి డాక్టర్జీ సన్నిధిలో ఉండే అవకాశం వారికి లేదు. అందుచేత పనిగట్టుకొని డాక్టర్జీ దర్శనార్థమై వారు కాన్పూర్ వచ్చారు. కాన్పూర్ స్వయంసేవకులకు డాక్టర్జీని కలుసుకొని మాట్లాడే అదృష్టం లభించింది. వారిదర్శన భాగ్యంచేత స్వయంసేవకులలో ఒక నూతనోత్తేజం కల్గిందనే చెప్పవచ్చు. ఆ తర్వాత కాన్పూర్ శాఖ బాగా బలపడింది. చదువుకొనేందుకని కాన్పూర్ వచ్చిన దీనదయాళ్‌జీ కూడ సంఘ సంపర్కంలోకి వచ్చారు.

లక్నోలోను, కాన్పూర్‌లోను సంఘశాఖలు వ్యవస్థితమయ్యేవరకు తాము ఎలాంటి ఒడుదుడుకులు తట్టుకొన్నదీ, ఎంతటి కష్టాలు ఎదుర్కొన్నదీ ఒక సందర్భంలో బాపూరావ్‌జీయే స్వయంగా చెప్పారు-'' నా యం.యస్.సి చదువు పూర్తి అయింది. అప్పుడే భావ్‌రావ్‌జీ కూడా బి.కాం,యల్.యల్.బి గోల్డుమెడల్‌తో కృతార్థులై చదువుకు స్వస్తి చెప్పారు. ఇద్దరం మా సంపూర్ణ సమయం సంఘ కార్యంలోనే వెచ్చించాలనే నిర్ణయానికి వచ్చాం. నిర్ణయం మంచిదేగాని గడిచేదెట్లా? అంతవరకు చదువులు సాగిస్తున్నామన్న కారణం ఒకటి ఉంది. కాబట్టి ఇంటి నుండి డబ్బు పంపిస్తూ వచ్చారు. చదువు పూర్తి అయిందని తెలిసిన వెంటనే ఇంటికి తిరిగి రమ్మని వత్తిడి చేయడం ప్రారంభించారు. మేము ఇంటికి తిరిగి వచ్చే ఆలోచనలో లేమన్న సంగతి తెలిసిపోయింది. ఇక మా సంగతి పట్టించుకోవడం మానేశారు. మా చేతిలో ఉన్న డబ్బు అయిపోయింది. ఇక లక్నోలో దినం గడవడం ఎలా అన్న ప్రశ్న ఎదురైంది''

''ఇక దుకాణాల సంగతి వదిలేసి ఫుట్‌పాత్‌ల మీద తిరుగుతూ బూరలు అమ్ముకొనేవారికి మా సరుకు అమ్మజూపాం. మాదగ్గర వాళ్ళు చాలా చౌకగా అయితేనే కొనేవాళ్ళు. అలా వాళ్ళకు అమ్మడం ద్వారా రోజుకు అర్థరూపాయి లభించేది. ఆ అర్థరూపాయతో మేమిద్దరం ఎలాగోలా ఒక పూట భోజనం పూర్తి చేసేవాళ్ళం. రెండో పూట భోజనానికి స్వస్తివాచకం పలికాం. టిఫిన్‌లు, కాఫీల సంగతి మాట్లాడేపనేముంది! ఇలానే కొంతకాలం గడిచింది. నేను ఎప్పుడైనా కొంత ఢీలా పడితే భావ్‌రావ్‌జీ ధైర్యంచెప్పేవారు. వారిని చూసి నేను కూడా మళ్ళీ ధైర్యం తెచ్చుకొనేవాడిని. మేము డాలీగంజ్‌లో నెలకు అయిదురూపాయలు కిరాయి ఇచ్చి ఒక ఇంట్లో ఉండేవాళ్ళం. మరి ఆ ఇంటి అద్దె సంగతి ఏమిటి? మేము కోర్సు పూర్తి చేసిన పాత పుస్తకాలు బజారులో అమ్మేసి అద్దె కట్టాం. మళ్ళీ ట్యూషన్లు ప్రారంభించాం. సంఘకార్యం యథావిధిగా కొనసాగిస్తూనే ఉన్నాం. 1940లో లక్నో శాఖ మొట్టమొదటి గురుదక్షిణ కార్యక్రమం జరిగింది. మొత్తం 80 రూపాయల సమర్పణ జరిగింది'' అంటూ ఆనాడు వారు ఎదుర్కొన్న కష్టాలు వివరించారు.

బాపూరావ్‌జీగాని, భావ్‌రావ్‌జీగాని కల్గిన కుటుంబాల నుండి వచ్చిన వారే. ఇంట్లో తల్లిదండ్రుల కనుసన్నలలో ఉంటే వారికిగల విద్యార్హతలకు కుటుంబానికిగల పరపతి తోడైనందున మంచి ఉద్యోగాలు సంపాదించి జీవితాన్ని ఎంతో సుఖమయం చేసుకొనే పని. అయితే వారు దానిలోగల సుఖాన్ని వెతుక్కునే ప్రయత్నం చేయలేదు. దేశమాత సేవలో ఎదురయ్యే కష్టాలలోనే ఆనందానుభూతిని పొందుతూ జీవితాన్ని ఒక సవాలుగా తీసుకొని పురోగమించారు. కాఫీ, ఫలహారాలు లేకున్నా, భోజనం కరువైనా, కటికనేలపై పరుండవలసివచ్చినా, పరులు తెలిసితక్కువవారని అపహాళన చేసినా- వేటినీ

లెక్కచేయక డాక్టర్జీ అడుగుజాడలలో మాతృసేవార్చనకై నడుంబిగించి ధైర్యంతో ముందుకు సాగారు. ఎంతటి కష్టాలు ఎదురైనా వారి ధైర్యం సడలిపోలేదు. అందుకే

కదర్థిత స్యాపి ధైర్యవృత్తే ర్నశక్యతేధైర్యగుణః ప్రమార్ష్టుమ్,

అధోముఖస్యాపి కృతస్యవహ్నేర్నాధః శిఖాయాతి కదాచిదేవ

(ధైర్యవంతునికి ఎట్టి దుఃఖము సంభవించినను అతని ధైర్యమును పోగొట్టుట అసాధ్యము. అగ్నిని తలక్రిందులుగా పెట్టినను అగ్నిజ్వాల ఊర్ధ్వముగనే ప్రసరించునుగాని అధోముఖముగ ప్రసరింపదు) అన్నది సత్యవాక్కు.

బాపూరావ్‌జీ భావ్‌రావ్‌జీకి అన్నివిధాలుగా చేదోడు, వాదోడుగా ఉంటూ ఉత్తరప్రదేశ్‌లో సంఘ విస్తరణకు తోడ్పడ్డారు. వారు ప్రచారక్‌గా అనేక ముఖ్యమైన బాధ్యతలు నిర్వహించారు. అలహాబాద్‌లో ప్రచారక్‌గా పనిచేస్తున్న తరుణంలో ప్రొ.రాజేంద్ర సింహజీని(రజ్జూభయ్యా)సంఘ పరిచయంలోకి తెచ్చినది బాపూరావ్‌జీయే. ఒక సందర్భంలో పూజ్య రజ్జూభయ్యా ఈ విషయం స్వయంగా తెలియజేశారు. మేధావి వర్గాన్ని సంఘ పరిచయంలోకి తెచ్చి వారిని స్వయంసేవకులుగా చేసే కృషిలో బాపూరావ్‌జీ అమోఘమైన ఫలితాలు సాధించారు. ఎంతో చొరవగా విశ్వవిద్యాలయాలలో ప్రొఫెసర్లతోను, లాయర్లతోను, డాక్టర్లతోను పరిచయాలు ఏర్పరచుకొని సైద్ధాంతిక విలువలను ఎరుకపరచి వారిని ఒప్పించి సంఘస్థాన్‌కు వచ్చేట్లు చేసేవారు. 1940-46 మధ్యకాలంలో ఉత్తరప్రదేశ్‌లో సంఘశాఖలు దినదిన

ప్రవర్ధమానంగా పెరిగాయి. పండిత్ దీనదయాళ్ ఉపాధ్యాయ, శ్రీ నానాజీ దేశ్‌ముఖ్, పూజ్యరజ్జూభయ్యా, శ్రీ అనంతరావ్ గోఖలే, స్వ. రాంనరేష్ సింహ్ (మజ్దూర్ సంఘ బడేభయ్యా) శ్రీ మాధవరావ్ దేవల్, స్వ. మాధవ్‌జీ దేశ్‌ముఖ్ మొదలుగాగల ప్రముఖులంతా భావ్‌రావ్‌జీ మార్గదర్శనంలో బాపూరావ్‌జీ సహచరులుగా పని చేసినవారే. వీరి తర్వాత ఉత్తరప్రదేశ్‌లో సంఘ పని చేపట్టిన ప్రముఖులలో శ్రీ అటల్‌బిహారీ వాజపేయి, శ్రీ అశోక్ సింఘాల్, శ్రీ సుందరసింగ్ భండారీ పేర్లు ప్రముఖమైనవి. వీరంతా బాపూరావ్‌జీతో కలిసి పనిచేసిన వారే. భావ్‌రావ్‌జీ ప్రాంతప్రచారక్ బాధ్యతలోను, బాపూరావ్‌జీ సహప్రాంత ప్రచారక్ బాధ్యతలోను ఉత్తరప్రదేశ్ అంతటా పరమ పవిత్రమైన జాహ్నవితోపాటుగా సంఘ గంగను ప్రవహింప చేశారు.

సంఘం ఉత్తరప్రదేశ్‌లో వ్రేళ్ళూనినట్లుగా పంజాబ్, బెంగాల్ రాష్ట్రాలలో కూడ బలం సంతరించుకొని ఉంటే భారతదేశ చరిత్ర మరోవిధంగా ఉండేది. 1946నాటికి సంఘస్థాపన జరిగి 21ఏళ్ళు మాత్రమే అయింది. అన్ని రాష్ట్రాలలోను హిందూ సమాజాన్ని సంఘటిత పరిచి శక్తిశాలినిగా తయారుచేయడానికి ఈ కొద్ది సమయం సరిపోలేదు. అప్పటికి బహు కొద్ది రాష్ట్రాలలో మాత్రమే సంఘం బలీయమైన సంస్థగా రూపొందింది. దేశవ్యాప్తంగా ప్రజలలో విస్తరించియున్న కాంగ్రెస్ పార్టీ ముస్లిం రాజకీయాలను అర్థంచేసుకోలేక ప్రజలను తప్పుదారి పట్టించింది. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనకపోవడం, సుభాష్ చంద్రుని వెన్నుపోటు పొడవడం, భారతీయుల శ్రేయస్సుకు విరుద్ధంగా రెండో ప్రపంచ యుద్ధకాలంలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని సమర్థించడం, పాకిస్తాన్ ఏర్పాటుకు సుముఖత తెలపటం ద్వారా కమ్యూనిస్టులు దేశద్రోహులని ఋజువు చేసుకొన్నారు. ఇది అదనుగా

తీసుకొని మహమ్మదాలీ జిన్నా. సుహ్రావర్దీల నాయకత్వంలో ముస్లింలు రెచ్చిపోయారు. ముస్లింలీగు ఆగష్టు16ను ప్రత్యక్ష చర్యదినంగా జరపవలసిందని ముస్లింలకు పిలుపునిచ్చింది.''భారతదేశంలో ముస్లింలు ఇక సంపూర్ణ,సర్వస్వతంత్ర,సార్వభౌమాధికారంగల పాకిస్తాన్ ఏర్పాటుకి తప్ప మరిదేనితోను సంతృప్తి చెందజాలరు...ఇప్పుడు ముస్లింజాతి ప్రత్యక్ష చర్యకు దిగే సమయం వచ్చింది'' అంటూ బాహాటంగా ముస్లింలను రెచ్చగొట్టింది.'రాజ్యాంగ పద్ధతులకు వీడ్కోలు' అంటూ జిన్నా చేసిన ప్రకటనను పత్రికా విలేకరులు ప్రశ్నిస్తూ,'రాజ్యాంగ పద్ధతులకు వీడ్కోలు' అంటే 'హింసాయుత పద్ధతులు అవలంబిస్తాం' అనే కదా అని అడిగినప్పుడు 'హింస,అహింసల నైతిక సూక్ష్మాలలోకి ప్రవేశించదలచుకోలేదు' అని నిష్కర్షగా చెప్పాడు. చేవ చచ్చిన కాంగ్రెస్ నాయకత్వంలో హిందూజాతి పౌరుషహీనంగాను, చైతన్యరహితంగాను తయారైందని,పైశాచికంగా వారు జరిపేదాడులను ఎదుర్కోగల జవసత్వాలు హిందువులకు లేవని నూటికి నూరుపాళ్ళు నమ్మడంచేతనే అంతటి నిర్లజ్జగా ప్రకటన చేసి మరీ ప్రత్యక్ష చర్యకు పూనుకొని రక్తపుటేరులు ప్రవహింపచేశారు.

ఈ అనుభవంతో దేశవ్యాప్తంగా హిందూజాతిని శీఘ్రగతిని సంఘటితపరచకపోతే మరెన్నో అనర్థాలు జరగగలవని భావించి దక్షిణ భారతదేశంలో కూడ ఆర్.యస్.యస్ శాఖలను పెంచి పటిష్టం చేయుటకు కర్నాటక రాష్ట్రంపై దృష్టి కేంద్రీకరించి పనిచేస్తున్న శ్రీ యాదవరావ్ జోషితోపాటు ఆంధ్రప్రాంతంపై దృష్టి కేంద్రీకరించేందుకు 1946 డిశంబర్ రెండవవారంలో శ్రీ బాపూరావ్ మోఘేను ప్రాంత ప్రచారక్‌గా నియుక్తంచేసి పంపించారు.

## పునాది నిర్మాతలు

1942 జూలైలో ఆంధ్రప్రాంతానికి శ్రీ నరహరి బాలాజీపార్కే ప్రాంత ప్రచారక్‌గా వచ్చారు. అప్పటివరకు విజయవాడయే కేంద్రంగా ఉండేది ప్రాంతానికి. శ్రీ పార్కేజీ ప్రాంత కేంద్రాన్ని గుంటూరుకు మార్చారు. ఆ రోజుల్లో ఆంధ్రప్రాంతానికి గుంటూరు విద్యాకేంద్రంగా ఉండేది. వివిధ కళాశాలలతోను, పాఠశాలలతోను చదువుకొనే విద్యార్థులతో పట్టణం అంతా కోలాహలంగా ఉండేది. అందుకని కేంద్రం అక్కడికి మార్చారు. కాని మళ్ళీ కొంతకాలానికి విజయవాడకే మారింది.

విజయవాడ భారతదేశంలో ప్రముఖమైన రైల్వేకూడలి కావడంచేత ఆంధ్రప్రాంతానికి మహారాష్ట్ర నుండి వచ్చిన ప్రముఖమైన ప్రచారకులంతా మొట్టమొదట విజయవాడలో కాలూని పరిసరాలు అర్థం చేసుకొన్న తర్వాత ఇతర స్థానాలకు కదిలివెళ్ళినవారే.

మొట్టమొదటి ఆంధ్రకు మహారాష్ట్ర నుండి ప్రచారక్‌గా వచ్చిన శ్రీ యాద్వాడ్కర్ రెండు సంవత్సరాలపాటు నిరంతరం కృషి సల్పి అయిదారు పట్టణాలలో శాఖలు నెలకొల్పారు. వారితోపాటు వచ్చిన శ్రీ దత్తాత్రేయ దండోపంత్ బందిష్టే 1940 సెప్టెంబరు మాసంలో ఆంధ్రలో తొలిశాఖ విజయవాడలో ప్రారంభించారు. కొద్దికాలానికి వారికి శ్రీ వినాయక్ శంకర ఆత్రే తోడయ్యారు. విజయవాడలో శ్రీ ఆత్రేకిగల అనుబంధం గొప్పది. ఆ రోజుల్లో శ్రీ చుండూరి వెంకటరెడ్డి అనే వణిక్ ప్రముఖుల దివ్యభవనం సందర్శించి వారి సహకారం పొందని ప్రచారకులు లేరంటే అతిశయోక్తికాదు. శ్రీయుత పుట్టపర్తి శ్రీనివాసాచారి, ముడుంబై రాఘవాచారి, వెందుర్తి వెంకటరత్నం, దత్తాత్రేయులు( లాయర్), హోమియో డాక్టర్ మద్దూరి

గుంటూరు ప్రచారక్‌గా ఉన్నారు. తెలుగువారిలో తొలిప్రచారక్ అయిన శ్రీ బాలకవి కుమారస్వామిగారు, శ్రీ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, శ్రీ సోమయ్యగారు కూడా గుంటూరు ప్రచారకులుగా చేశారు. శ్రీయుత ఏకాదండయ్య పంతులు, కొల్లిమర్ల వేంకటేశ్వర్లు, బోడిరమణరావు, సుబ్బసింగ్ ఇత్యాది జ్యేష్టస్వయంసేవకుల తోడ్పాటు ఉండేది. శ్రీ నారాయణరావ్ భట్వాడేకర్ ఒంగోలు ప్రచారక్‌గా ఉండి శాఖలు ఎంతగానో విస్తరింపచేశారు. 1946 అక్టోబర్‌లో ఒంగోలులోను, ఏలూరులోను ఐ.టి.సి(ప్రాథమిక శిక్షావర్గ)లు పెద్ద సంఖ్యలో నిర్వహించబడ్డాయి. గుంటూరు, ఒంగోలు, నెల్లూరు, బళ్ళారి, అనంతపూర్, హిందుపూర్‌లకు కలిపి ఒంగోలులో నిర్వహించబడింది. శ్రీ యన్.యం.దేశపాండే ముఖ్యశిక్షక్‌గా ఉన్నారు. కృష్ణా, ఉభయగోదావరి, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం కలిపి ఏలూరులో నిర్వహించబడింది. దీనికి శ్రీ పి.మహేశ్వరరావు ముఖ్యశిక్షక్‌గా ఉన్నారు.

ఒంగోలులో సంఘ కార్యవిస్తరణకై శ్రీయుత చావలి కృష్ణమూర్తి, లక్ష్మణరావ్, డా.శేషగిరి రావు, రామయ్య, చుండూరు వెంకటాద్రి ఇత్యాది జ్యేష్ట స్వయంసేవకులు బాగా తోడ్పడ్డారు.

1943లో శ్రీ నీలకంఠ మోరేశ్వర్ దేశపాండే విద్యార్థిగా నెల్లూరుకు వచ్చి ప్రచారక్ బాధ్యతలు స్వీకరించారు. అయిదారు సంవత్సరాలపాటు నెల్లూరు జిల్లాలో సంఘశాఖలు చైతన్యంతో తొణికిసలాడేట్లు చేశారు. ఆయన కంఠం నుండి మాట వెలువడితే అది సింహనాదం అనిపించేది. పోరుకు తలపడితే వేటాడుతున్న సింహకిశోరమే అనిపించేవారు. వారి శిక్షణలో హేమాహేమీలైన కార్యకర్తలు తయారైనారు. శ్రీయుత కొచ్చికృష్ణమూర్తి, ఇ.సి.రామమూర్తి, .బీమారాధయ్య, పురుషోత్తమరావు,

యన్.రంగారావు, టి.రామమూర్తి, యన్.రామమూర్తి, పరంధామరెడ్డి, రామరాఘవరెడ్డి, టి.వేణుగోపాలరెడ్డి. జె.సి.రంగారెడ్డి, నర్సయ్య, ఎ.సి.రమణయ్య ఇత్యాది ఆణిముత్యాలవంటి కార్యకర్తలు తయారైనారు. పట్టణంలో అనుభవజ్ఞులైన పెద్దలు శ్రీ పైడా సుబ్బరామయ్యతోడు ఉండేవారు.

ఏలూరులో శ్రీ బోను వేంకటేశ్వరరావు శాఖ ప్రారంభించారు. ఆ తర్వాత శ్రీపాద గజానన్ సహస్ర భోజిని కృషి కారణంగా శాఖలు విస్తరించాయి. శ్రీయుత కేశవరావు, పరాంకుశరావు (సోదరులు), వడ్లమన్నాటి నర్సింహారావు, నారాయణరావు, లక్ష్మణరావు, సుందరం, వైద్యులు రాఘవాచారి, పల్లా రాధాకృష్ణ, నర్సింహమూర్తి, బి.సూర్య నారాయణ ఇత్యాది స్వయంసేవకులు తోడ్పడ్డారు.

రాయలసీమలో తొట్టతొలుత 1946లో శ్రీ బందిష్టే అనంతపూర్ లోను, హిందుపూర్‌లోను శాఖలు స్థాపించారు. అటుపిమ్మట గుంటూరు, ఏలూరు, భీమవరం, రాజమండ్రి, కాకినాడలలో కొంతకాలం పనిచేశాక శ్రీ వి.యల్.దేశ్‌ముఖ్ గారిని రాయలసీమ ప్రాంతానికి పంపిచడం జరిగింది. రాయలసీమ జిల్లాలలో ముఖ్యంగా కర్నూలు, అనంతపురం జిల్లాలలో శ్రీ దేశముఖ్ ఎందరో ప్రముఖ కార్యకర్తలను తయారు చేసుకోగలిగారు. శ్రీయుత రాందాస్ భట్, యం.డి.వై.రామమూర్తి, నంజయ్య, సుబ్బరత్నం, రాధాకృష్ణ, విశ్వనాథయ్య, జి.పుల్లారెడ్డి, డి.సూర్యప్రకాశరెడ్డి, అలిమినేని వేంకటస్వామి ఇంకా ఎందరో కార్యకర్తలు వారినుండి స్ఫూర్తి పొందారు.

1943-44 మధ్యకాలంలో విజయనగరంలో శ్రీ జె.వి.యస్.శాస్త్రి, విశాఖపట్నంలో శ్రీ పిళ్ళా రామారావు సంఘ శాఖల

విస్తరణకు ఎంతగానో కృషి చేశారు. ప్రచారకులుగా వచ్చిన వారిలో శ్రీ వినాయక్ ఆత్రే, శ్రీ నారాయణరావు భట్వాడేకర్ మధుర గాయకులు.

1948లో సంఘుపైన నిషేధం విధించినప్పుడు జైళ్ళలో ఉన్న కార్యకర్తలను 'హెబియస్ కార్పస్' పిటిషన్ ద్వారా విడిపించడంలో శ్రీ బాలకవి కుమారస్వామి, శ్రీ ఆత్రే విశేష కృషి చేశారు. మద్రాసులోని అడ్వకేట్ శ్రీ సంజీవ కామత్ సహాయంతో 150 మంది డిటెన్యూలను విడుదల చేయించారు. ఈ ఇద్దరూ పోలీసు నిఘాను తప్పించుకొని సంఘాభిమానుల వద్దకు నిర్విరామంగా తిరుగుతూ ఆరోజుల్లోనే 9,10 వేలు సేకరించి ఈ పని విజయవంతంగా నిర్వహించగలిగారు.

1940-48 మధ్యకాలంలో ఈ కార్యకర్తలందరూ సంఘసౌధానికి పటిష్టమైన పునాదులు వేశారు. ఈ పునాదుల ఆధారంతో క్రొత్తగా ప్రాంత ప్రచారక్‌గా విచ్చేసిన శ్రీ బాపూరావ్ మోఘేకి సౌధనిర్మాణం సులువైందనే చెప్పాలి. సంఘ శాఖలు ప్రాంతమంతటా విస్తరిస్తూ హిందూ సమాజ సంఘటన ఆర్.యస్.యస్ ద్వారా మాత్రమే జరుగగలదు అనే విశ్వాసం జన సామాన్యంలో పాదుకొంటున్న సమయంలో 'నిషేధం' అశనిపాతంలా పరిణమించింది. ఆనాటి నెహ్రూ ప్రభుత్వం అనుసరించిన దమన నీతికి కమ్యూనిష్టుల కుట్ర రాజకీయాలు తోడు కాగా సంఘం ఊహించని కష్టాలనేకం ఎదుర్కోవలసివచ్చింది. ఈ కష్ట సమయంలో శ్రీ బాపూరావ్‌జీ చేసిన వ్యూహరచన, చేపట్టిన కార్యప్రణాళిక అన్నింటికంటే మిన్నగా స్వయంసేవకుల అకుంఠిత దీక్ష సంఘునావను ఆ కష్టాల కడలి నుండి తీరానికి చేర్చాయి. ఆ వివరాలు సంగ్రహంగా తెలుసుకొందాం.

# కష్టాలకడలికెదురీత

1946 డిశంబరు నెల రెండవ శనివారం మరియు ఆదివారం-ఈ రెండురోజుల్లో కృష్ణా,పశ్చిమగోదావరి జిల్లాల ప్రౌఢస్వయంసేవకుల శిబిరం భీమవరంలో జరిగింది. ఎనిమిది వందల దాకా స్వయంసేవకులు పాల్గొన్నారు. యు.యల్.సి.యమ్ క్రైస్తవ మిషనరీ హైస్కూలులో బస ఏర్పాటు చేయబడింది. త్యాగరాజ గాన సభ ఆవరణలో భోజన వ్యవస్థ, ప్రాంత అధికారుల వసతి ఏర్పాటు చేయబడింది. రెండవరోజున ప్రాంతంలోని ప్రచారకులందరి సమావేశం కూడ ఏర్పరచబడింది. ప్రాంతం మొత్తం నుండి 36 మంది ప్రచారకులు హాజరైనారు. ఆ సమావేశానికి అప్పటివరకు ప్రాంతప్రచారక్‌గా ఉన్న శ్రీ నరహరి బాలాజీ పార్థీజీ, క్రొత్తగా ప్రాంత ప్రచారక్‌గా నియమితులై వచ్చిన శ్రీ బాపూరావ్‌జీ మోఘే కూడ వచ్చారు. ఈ సమావేశంలోనే శ్రీ బాపూరావ్‌జీ మోఘే క్రొత్తగా ప్రాంతప్రచారక్ బాధ్యత తీసుకొంటున్నట్లు పరిచయం చేశారు. ఆరోజు సాయంత్రం సార్వజనికోత్సవం జరిగింది. దానికి డబ్ల్యూ.జి.బి కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ పెద్దాడ రామస్వామి అధ్యక్షత వహించారు. విజయవాడ యస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్ కళాశాలలో లెక్చరర్‌గా పనిచేస్తున్న శ్రీ ముడుంబై రాఘవాచారి ప్రధాన వక్త. అప్పుడు శ్రీ జి.సోమరాజు నగర కార్యవాహగాను, శ్రీ కోసూరి వెంకటేశ్వరరావు నగర ప్రచారక్‌గానూ పని చేస్తుండేవారు. బహిరంగ సభవేదికపై శ్రీ పార్థీజీ, శ్రీ బాపూరావ్‌జీ- ఇద్దరూ ఆసీనులైనారు. అది మొదలుకొని శ్రీ బాపూరావ్‌జీ మోఘే ఆంధ్రప్రాంతానికి శ్రీ పార్థీజీ స్థానంలో ప్రాంత ప్రచారక్‌గా బాధ్యతలు స్వీకరించారు.

భీమవరంలో రెండురోజుల బైఠక్ పూర్తి అయ్యాక బాపూరావ్‌జీ విజయవాడకు వచ్చారు. ఆయన ఆంధ్ర ప్రాంతంలో అంతకు ముందు

ఎన్నడూ ఉండలేదు. ఆంధ్ర ప్రాంతంలో తొలిసారిగా అడుగిడిన ఆ యువకునికి ఇక్కడి ఆహారం క్రొత్త. ఇక్కడ సాంఘిక జీవనం క్రొత్త. ఇక్కడి పరిసరాలు క్రొత్త. ఇక్కడి భాష క్రొత్త. కాని ఇక్కడ సంఘ కార్యం విస్తరింప చేయాలి అన్న దృఢ సంకల్పం ముందు ఈ అవరోధాలు గాలి పింజలవలె తేలిపోయాయి. సంకల్పబలం ఉన్నవారు సాధించలేనిదేముంది?

ఆనాడు విజయవాడలో సంఘంలో కాస్త ప్రౌఢ వయస్కులన్నవారు బహు కొద్ది మంది ఉండేవారు. శ్రీయుత బోను వెంకటేశ్వరరావు, ముడుంబై రాఘవాచార్య, లక్కరాజు నిరంజనరావు, పుట్టపర్తి శ్రీనివాసాచారి, చుండూరివెంకటరెడ్డి వారిలో పేర్కొనదగిన కొందరు జ్యేష్ఠ స్వయం సేవకులు. వీరిని వదిలేస్తే మిగతా వారంతా బహు పిన్న వయస్కులే. చాలామంది పదహారేళ్ళ వయస్సులోపువారే. వీరు కార్యాలయంలో చేరి పిచ్చాపాటి మాట్లాడుకొంటూ ఉంటే వాతావరణం అద్భుతంగా ఉండేది. కార్యాలయంలో బాపూరావ్‌జీ గదిలో వీరు చేరేవారు. వీళ్ళకు హిందీరాదు. ఇంగ్లీషు అంతంత మాత్రం. ఆయనకు తెలుగురాదు. హిందీ, ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడేవారు. అయినప్పటికి ఆ గదిలో సంభాషణలు గంటలతరబడి కొనసాగేవి. ఎంతసేపు కూర్చున్నా ఇంకా కూర్చోవాలని పించేది. వీళ్ళకు వచ్చిన భాషలో వీళ్ళు మాట్లాడుతుండేవారు. వీరు ఎలాంటి భాషలో మాట్లాడినా భావం ఆయనకు అర్థం అవుతుండేది. ఆయన ఏ భాషలో మాట్లాడినా భావం వీళ్ళకూ అర్థం అయ్యేది. కొందరిచేత సంఘపాటలు పాడించేవారు. నాలుకకాదు, హృదయాలు మాట్లాడుకొనే దృశ్యం అది. సంఘకార్యానికి సంబంధించిన విషయాలు ఎన్నో ఆ ముచ్చట్లలో చోటు చేసుకొనేవి. అనేక జటిలమైన సమస్యలకు సహితం ఈ ముచ్చట్లలో సమాధానం లభించేది. వ్యక్తిగత విషయాలు కూడా

బాపూరావ్‌జీకి దాపరికం లేకుండా చెప్పుకొనేవారు. చదువు సంధ్యల విషయం,ఆరోగ్యం విషయం, ఉద్యోగాల విషయం - ఒకటేమిటి ఆయన దృష్టికి తీసుకురాని విషయం ఏమీ ఉండేదికాదు. సంఘ కార్యంలో రోజుకు 8,10 గంటలు చొప్పున మునిగి పని చేస్తున్న కార్యకర్తలు సహితం ఈ పిచ్చాపాటిలో పాల్గొనే అవకాశం లభిస్తే వదులుకొనేవారు కాదు. బాపూరావ్‌జీతో మాట్లాడటం విజ్ఞానసంధాయకం. బాలకులలో బాలకుడుగా, ప్రౌఢులలో ప్రౌఢుడుగా,వృద్ధులలో జ్ఞాన వృద్ధుడుగా మెలగేవారు. సంఘ చట్రంలో విధించబడిన బైఠక్‌లు జరుగుతున్నప్పుడు తప్ప మిగతా అన్ని సమయాలలోను ఆ గదిలో హాస్యోక్తులు, నవ్వులు, కేరింతలు చోటు చేసుకొంటూ ఉండేవి. ఈ వాతావరణంలోనే స్వయం సేవకులకు అవసరమైన మార్గదర్శనం లభించేది.

ఆర్.యస్.యస్ కార్యకర్తల నిర్మాణం నిరంతరం సాగే ఒక మహత్తరమైన ప్రక్రియ. ఆ రోజులలో కార్యకర్తల నిర్మాణం ఒక మహాయజ్ఞంగా సాగేది. సంఘకార్యనిర్వహణలో కార్యకర్తల మధ్య విభేదాలు పొడసూపినప్పుడు ఒక్కోసారి తీవ్రంగా ఘర్షణపడేవారు. కాని మళ్ళీ ఆ రాత్రికే ప్రచారక్‌గారు కాని, సీనియర్ కార్యకర్తలుగాని అలా ఘర్షణపడిన కార్యకర్త ఇంటికి చేరి ఘర్షణకు కారణమైన కార్యక్రమానికి సంబంధించిన వివిధ అంశాలు గంటలతరబడి చర్చించుకొని,తప్పుదొర్లిందని భావిస్తే ఏడ్చి,ఆ కంటి నీటితో కలుషితాన్ని బయటకు నెట్టి మళ్ళీ ఫ్రెష్‌గా కార్యరంగంలోనికి దూకేవారు. ఒక సీనియర్ కార్యకర్తతో బాపూరావ్‌జీకి ఎదురైన సంఘటన నాకు బాగా గుర్తుంది. 'శర్మకు నేను చేసిన అపకారం ఏమిటో నాకు అర్థంకావడం లేదు' అంటూ ఆ సంఘటన గుర్తు తెచ్చుకొని బాపూరావ్‌జీ కంటతడి పెట్టారు. సంఘకార్యం ఏమాత్రం కుంటుపడినా హృదయం పైన ఒక

సమ్మెటపోటు పడినంతబాధ ఆయనలో వ్యక్తమయ్యేది. ఆర్థికంగాను, సామాజికంగాను వెనకబడిన వర్గాలలో సంఘకార్యం విస్తరించినప్పుడే సమాజంలో సమతౌల్యం కాపాడబడుతుందన్న అవగాహన ఆయనకు పరిపూర్ణంగా ఉండేది. ఆ గృహాలనుండి సంఘకార్యంలోనికి ఆకర్షింపబడిన వ్యక్తులపట్ల ఆయన ప్రత్యేక ఆదరణ చూపేవారు.

శ్రీబాపూరావ్‌జీ సరిగ్గా ముప్పై ఏళ్ళ వయస్సులో ఆంధ్రకు ప్రాంత ప్రచారకులుగా వచ్చారు. వారు ఆంధ్రకు వచ్చిన ఒక సంవత్సరానికే సంఘం మీద నిషేధం విధించబడింది. ఈ సంవత్సరంలో వారు ప్రాంత మంతటా పర్యటించి ఒక అవగాహనకు రాగలిగారు. ఇక్కడ ఆంధ్ర మహారాష్ట్ర భేదాలు సద్దుమణగక ముందే వారు ఇక్కడికి రావడం జరిగింది. వచ్చిన క్రొత్తలో ఈ పర్యటన చేసేప్పుడు వారిచేతిలో ఒక బెత్తం ఉండేది. ''జాగ్రత్త! ఎటువంటి భేదాలు లేకుండా స్ఫూర్తితో సంఘకార్యం నిర్వహించండి! లేకపోతేనా....ఇదిగో బెత్తం!''అని మనను హెచ్చరించడానికేమో ఆ బెత్తం అంటూ ఆనాటి జ్యేష్ఠకార్యకర్తలు సరదాగా అనుకొంటుండేవారు. ఏమైతేనేం ఆ సంవత్సరం అంతా వారు సుడిగాలిలా పర్యటించి ఒక నూతనోత్తేజం కల్గించారు. అందువల్ల సంఘశాఖలు మళ్ళీ ఊపందుకొని విపరీతంగా పెరిగిపోయాయి. 1947లో దేశవిభజన జరిగింది. విభజన సమయంలో అందుకు కారకులైన కాంగ్రెస్‌వారు తెర మీద లేకుండా కనుమరుగైపోయారు. లక్షలాది హిందువులు వర్ణించరాని కడగండ్లపాలైనారు. హిందుసమాజానికి ఆ కష్టసమయంలో దీపశిఖలా తోడ్పాటు అందించినది సంఘమే అన్న విషయం దేశ ప్రజలంతా గ్రహించారు. అందుచేత సంఘ సిద్ధాంతం ఒక్కటే శరణ్యం అన్న భావన ప్రజల అంతరాంతరాలలో చోటుచేసుకొన్నది. తత్కారణంగా సంఘశాఖలు స్వయంసేవకులతో నిండిపోతుండేవి. ఈ

దృశ్యం కమ్యూనిష్టుల కళ్ళుకుడుతుండేది. విజయవాడవంటి ముఖ్య నగరాలలో సంఘశాఖలకు అడుగడుగునా అడ్డంకులు సృష్టించేందుకు కమ్యూనిష్టులు ప్రయత్నిస్తుండే వారు. వివిధవాడలలో ఖాళీగా పడిఉన్న స్థలాలను పరిశుభ్రం చేసుకొని స్వయంసేవకులు అక్కడ శాఖ నిర్వహిస్తుండే వారు. అలా శాఖలు నిర్వహించ బడుతున్న స్థలాలలో కావాలని కాలకృత్యాలు తీర్చుకొంటూ గిల్లికజ్జాలు పెట్టుకొనేందుకు సిద్ధపడేవారు. వారు బలంగా ఉన్న వాడలలో ఇలాంటి నికృష్టమైన సంఘటనలు ఎన్నో జరుగుతుండేవి. అయినా స్వయంసేవకులు ధైర్యంగా తమ కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉండేవారు. ఒక్కోచోట కమ్యూనిష్టులు పోటీ శాఖలు పెట్టి సంఘ స్వయం సేవకులు ఏక్,దో..ఏక్,దో అంటూ సంచలన చేయడాన్ని అనుకరిస్తూ ఎడమ,కుడి...ఎడమ, కుడి అంటూ కవాతులు జరుపుతుండేవారు. అయితే ఇలాంటి పోటీ కవాతులు మఖలో పుట్టిపుబ్బలో అంతరించిన సామెతగా కొద్దిరోజులకే అంతర్ధానం అవుతుండేవి. వాళ్ళ కుళ్ళు ఆలోచనలకు ఉదాహరణగా మిగిలిపోయేవి. విజయవాడ సంఘశిబిరంపైన 1948లో జరిగిన దాడికూడా ఇలాంటి ఆలోచనలో భాగమే.

నిషేధ సమయంలో బాపూరావ్‌జీ నిర్వహించిన పాత్ర అమోఘమై . వారు ఎంతో స్తిమితంగా,చాకచక్యంగా వ్యూహరచన చేసుకొంటూ సంఘ ంత్రాంగాన్ని నడిపించారు. నిషేధ సమయంలో వారిని ఆంధ్రప్రాంతం విపెట్టివెళ్ళమని ప్రభుత్వం ఆదేశించింది. కాని వారు ప్రచ్ఛన్నంగా రుగుతూ ప్రచారకులకు,కార్యకర్తలకు మార్గనిర్దేశం చేస్తుండేవారు. వారు అజ్ఞాతంలో ఉండి కార్యనిర్వహణ చేయాలంటే ఆనాటి పోలీసుల నిఘా నుండి తప్పించుకొంటూ ఎంతో యుక్తితో మెలగాల్సివచ్చేది. వారు బసచేసేటువంటి ఇళ్ళు జాగ్రత్తగా ఎంపిక చేసుకొనేవారు. ఒకసారి పోలీసు

స్టేషన్ ఆనుకొని ఉన్న వీధిలో గల ఒక ఇంట్లో వారు దిగారు.'ఇదేమిటి? ప్రక్కనే పోలీసుస్టేషన్ ఉంది కదా?' అని అడిగితే 'మనం కాస్త జాగ్రత్తగా ఉంటే ఇది సురక్షితమైన స్థానం' అన్నారు. అదీ నిజమే అనిపించింది. వారు విరివిగా పర్యటనలు చేస్తూ కార్యకర్తలకు మార్గదర్శనం చేస్తున్నప్పటికి పోలీసులు వారి జాడ కనిపెట్టలేకపోయారు. నిషేధం ఎత్తివేయాలంటూ సంఘస్వయంసేవకులు చేసిన సత్యాగ్రహాల నిర్వహణ కూడా శ్రీ సోమయ్యగారి తోడ్పాటుతో వారు ఎంతో చాకచక్యంగా నిర్వహించారు. పోలీసుల నిఘా ఎంత తీవ్రంగా ఉన్నప్పటికి అనుకొన్నవేళకు, అనుకొన్నచోట స్వయంసేవకుల దళాలు సత్యాగ్రహం చేసేవి. సత్యాగ్రహం చేస్తూ మండలాకారంలో కూర్చున్న స్వయంసేవకులపై విరుచుకుపడి లాఠీలతో మోదేవారు. తలకాయలు చిట్లి,చేతులుకాళ్ళు విరిగి స్వయంసేవకులు అనేక బాధలకు గురి అయ్యేవారు. పోలీసులు ఎంత కిరాతకంగా వ్యవహరించినప్పటికి సత్యాగ్రహుల గుండె నిబ్బరం సడలిపోలేదు. బాపూరావ్‌జీ అందించిన స్ఫూర్తి అందుకు కారణం అని చెప్పాలి. నిషేధానికి వ్యతిరేకంగా సంఘం చేపట్టిన ఉద్యమం సఫలమైంది. ప్రభుత్వం నిషేధం ఎత్తి వేసింది.

సంఘంపైన నిషేధం తొలగించబడింది. చెదరిపోయిన సంఘశాఖల్ని మళ్ళీ కుదురుపరచే బాధ్యత స్వయంసేవకులపైన పడింది. అది బాపూరావ్‌జీ నేతృత్వంలో దిగ్విజయంగా జరిగింది. వారి హయాంలో సంఘశాఖల పునరుజ్జీవనం చాలా బాగా జరిగింది. జిల్లాలు, తాలూకాలు దాటి అనేక గ్రామాలకు కూడ శాఖలు విస్తరించాయి. ఎందరో క్రొత్త ప్రచారకులు, విస్తారకులు వచ్చారు. ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం విడివిడిగా ఓ.టి.సీ లు ప్రారంభమైనాయి. 1952 మే నెలలో ఆంధ్రప్రాంతం మొదటి ఓ.టి.సి విజయవాడలోని యస్.ఆర్.ఆర్ అండ్ సి.వి.ఆర్ కళాశాలలో జరిగింది.

నలుదిక్కుల నుండి జనవరి 30 సాయంత్రానికే ఆరువేలమంది స్వయంసేవకులు శిబిరస్థలానికి వచ్చిచేరారు. ఇంకో నాల్గువేలమంది ఆ మర్నాడు రావలసి ఉంది. మద్రాసు నుండి ప.పూ.గురూజీ కూడ 31వ తేదీన విజయవాడకు చేరవలసి ఉంది. ఐయితే 30వ తేదీనాడు గాంధీజీ హత్య వార్త విని వారు అటు నుంచి అటే నాగపూర్‌కు వెళ్ళారు. అయితే గాంధీజీ హత్యపట్ల హర్షోల్లాసం ప్రకటిస్తూ గురూజీ సమక్షంలో ఆర్.యస్.యస్ వారు స్వీట్లు పంచిపెట్టుకొన్నారని కాంగ్రెసువారు, కమ్యూనిష్టులు దుష్ప్రచారం చేశారు.

31వ తేదీన కమ్యూనిష్టుల ఆర్.యస్.యస్ శిబిరం నిర్వహించబడుతున్న యస్.ఆర్.ఆర్ కాలేజీపైన దాడి చేశారు. ఆకస్మికంగా జరిగిన దాడి ఇది. శిబిరంలోపల ఉన్న స్వయంసేవకులకు చాలా మందికి ఈ విషయం తెలియదు. వారు అలాంటి సన్నివేశాన్ని ఊహించను కూడా లేదు. శిబిరం వెలుపల,చుట్టూ రక్షకులుగా ఉన్నది కొద్ది మంది స్వయం సేవకులే. అయినా ఆత్మ విశ్వాసం గలవారు.తాము ఏ తప్పూ చేయనప్పుడు ఎవరికీ జంకవలసిన అవసరం లేదనే మనోధైర్యం వారికి ఉంది. ఆ నైతిక బలం వారిని ముందుకు నడిపింది. అవతల కమ్యూనిష్టులు వేలసంఖ్యలోనే వచ్చారు. అందులోను విజయవాడ అంటే తమ కంచికోట కాబట్టి తాము ఏమి చేసినా చెల్లుబాటు అవుతుందనే అహంకారం ఉంది. అయితే న్యాయం వారి పక్షాన లేదు. కేవలం ఆర్.యస్.యస్ పెరిగిపోతోందన్న ఉక్రోషంతో ఒక అపవాదు దానిపైన రుద్ది పగతీర్చుకోవాలన్న కోర్కెతో వచ్చినవారు. ఇది అలనాటి కురుక్షేత్రాన్ని జ్ఞప్తికి తెస్తున్నట్లుగా ధర్మానికి,అధర్మానికి మధ్యపోరాటం.

అప్పుడు బాపూరావ్‌జీ మోఘే ప్రాంతప్రచారక్‌గా ఉన్నారు. వారు శిబిరంలోనే ఉన్నారు. ఆత్మరక్షణకై పచ్చజండా ఊపారు. రక్షకులుగా ఉన్న

స్వయంసేవకులు శ్రీయుత గోపాలరావు ఠాకూర్, యన్. యమ్. దేశపాండే, విజయవాడ నగర ప్రచారక్ వినాయక శంకర్ ఆత్రీ నేతృత్వంలో లాఠీలు తీసుకొని కమ్యూనిష్టులపైన ఎదురుదాడి సాగించారు. స్థానిక కార్యకర్త గోవిందరాజులు కూడా ప్రాణాలకు లెక్కచేయక వీరోచితంగా పోరాడారు. నైతిక బలంగల వీరు కొద్దిమందే అయినా దుష్టబుద్ధితో వచ్చిన కమ్యూనిష్టు మూండగులను తరిమికొట్టారు.

ప.పూ. శ్రీ గురూజీ పాల్గొనవలసిన శిబిరంపైన జరిగిన దాడి కాబట్టి ఈ సంఘటనను అఖిలభారత స్థాయిలో ఆనాడు చర్చించుకోవడం జరిగింది. ఆనాడు విజయవాడలో కమ్యూనిష్టులకు జరిగిన పరాభవం కాబట్టి కూడా ఈ సంఘటన ప్రాముఖ్యం సంతరించుకొంది. అవసరమైనప్పుడు బాపూరావ్‌జీ మోఘే సాహసంతో కూడిన నిర్ణయాలు తీసుకోగలరనేందుకు కూడా ఇది ఒక చక్కని ఉదాహరణ.

## సేవాపరాయణత్వం

మొదటినుండి రాయలసీమ కరువు కాటకాలకు ప్రసిద్ధి. వర్షపాతం తక్కువ. నదీజలాల సౌకర్యం కూడా తక్కువే. ఆ కారణంగా వర్షాధార భూములపైన సేద్యం కొనసాగించాలి. వరుణదేవుడు కనికరించిన సంవత్సరం పంటలు బాగానే ఉంటాయి కాని వర్షాలు పడకపోయినా, పడిన వర్షాలు సమయానికి పడకపోయినా పంటలు సున్నాయే. రెండు, మూడేళ్ళు వరుసగా క్షామం సంభవిస్తే ప్రజలు కరువు కాటకాలతో బాధలకు గురి కావలసిందే. తుంగభద్ర వంటి కొన్ని ప్రాజెక్టుల పుణ్యమా అని పరిస్థితి కొంత మెరుగైంది కాని ఇప్పటికీ అక్కడ వర్షాధారభూములపై సేద్యమే ఎక్కువ.

వరుసగా రెండు, మూడేళ్ళు వర్షాలు సమయానికి కురవని కారణంగా 1952లో రాయలసీమ ప్రాంతంలో దుర్భరమైన కరువు సంభవించింది. ఆకలి చావులు సంభవించాయి. క్షామపీడితులైన జనులు అనేకులు రోగగ్రస్తులై మరణించారు. గ్రామాలకు గ్రామాలు కరువు బాధకు తాళలేక ఖాళీ చేసి బ్రతుకు తెరువు వెతుక్కుంటూ వేరే ప్రాంతాలకు వలస పోయారు. అలా ఖాళీచేసి పోయిన వారు పోగా మిగిలిన జనం క్షుద్బాధతో అలమటిస్తూ కాలం గడుపుతున్నారు. ప్రభుత్వం కొద్దిపాటి సహాయం అందించకపోలేదు. కాని అది సముద్రంలో కాకిరెట్టవంటిదే అయింది. స్వచ్ఛంద సంస్థలు కార్యరంగంలో దూకి అన్నార్తులనెందరినో ఆదుకొన్నారు. ఈ కార్యంలో ఆర్.యస్.యస్ ముందంజలోనే ఉంది. రాయలసీమ సహాయతా సమితి ఏర్పరచి అనేక చోట్ల గంజి కేంద్రాలు నెలకొల్పి బాధితులకు సహాయపడ్డారు.

బాపూరావ్‌జీ మార్గదర్శనంలో సంఘకార్యకర్తలు క్షామపీడిత ప్రాంతాలను సర్వే చేసి అందించ వలసిన సహాయానికి సంబంధించి ఒక అవగాహనకు వచ్చారు. శ్రీయుత వి.యల్.దేశ్‌ముఖ్, విశ్వనాధయ్య సోమయ్య, ఏ.ఇ.పురుషోత్తం, కొచ్చికృష్ణమూర్తి, యం.డి.వై,రామమూర్తి ఇత్యాది కార్యకర్తలతో సంప్రదించి సహాయ కార్యక్రమాలు యోజన చేశారు బాపూరావ్‌జీ. శ్రీ అనంతాచారి కార్యదర్శిగా 'రాయలసీమ సహాయతా సమితి' ఎంతో చొరవగా తన కార్యక్రమాలు ముందుకు నడిపింది. అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉన్న శ్రీమాన్ సి. రాజగోపాలాచారి గారు ఈ క్షామపీడిత ప్రాంతాలు సందర్శించిన సందర్భంలో అనంతాచారితో ఇంటర్వ్యూ జరిగింది. 'సహాయతా సమితి' చేస్తున్న పనుల వివరాలు తెలుసుకొని సి.ఆర్ చాలా సంతోషించారు. గంజి కేంద్రాల నిర్వహణలో ఎవరెవరు ఏ ప్రాంతాలలో పని చూడాలి, ఆయా ప్రాంతాలలో

ప్రజల సహాయ సహకారాలు సమకూర్చుకొనేందుకు ఏవిధంగా పని చేయాలి ఇత్యాది విషయాలన్నీ బాపూరావ్‌జీ యోజన మేరకు పకడ్బందీగా నిర్వహించబడ్డాయి.

'రాయలసీమ సహాయతా సమితి' ఆఫీసు ఇంఛార్జిగా నేను అనేక సందర్భాలలో బాపూరావ్‌జీని కలుస్తుండే వాడిని. ఎంతటి క్లిష్ట పరిస్థితిలోనైనా సంయమనం కోల్పోకుండా నిగ్రహంతో వ్యవహరించడం ఎలాగో వారిని చూచే నేర్చుకోవాలి అన్పించేది.

## సంఘ సాహిత్యం

డాక్టర్జీ కాంగ్రెస్ సంస్థలోను, అంతకు పూర్వం ఇంకా అనేక సంస్థలలోను పనిచేసి ఎంతో అనుభవం గడించారు. ప్రసంగాలు, పూలదండలు, సన్మానాలు, పదవులకై ఆరాటం, కీర్తిప్రతిష్ఠలనార్జించేందుకై పడే తపన- ఇవి చాలా సంస్థలలో తారసపడే అనుభవాలు. ఇవి చూచాక ఇలాంటి ఉద్యమాలవల్ల ప్రజలు ఉత్తేజితులవుతారేగాని శాశ్వత ప్రాతిపదిక మీద దేశసేవ జీవితంలో ఒక భాగం అని భావించి పని చేయడం జరగదని గ్రహించారు. అడపదడప అక్కడొకరు ఇక్కడొకరు ప్రాణత్యాగాలకు సహితం సిద్ధపడి భారతమాత సేవలో అసువులు బాసిన మానధనులు జన్మించకపోలేదు. కాని సామాన్య జనావళిలో కూడ దేశసేవ అనేది ఈ సమాజంలో జన్మించిన ప్రతి వ్యక్తి కర్తవ్యం, అది ఏదో ఉద్యమాలలో చేరి నాయకత్వం వహించేకొద్ది మంది వ్యక్తులకు పరిమితమైనదికాదు అనే భావన పాదుకొల్పే ప్రయత్నం జరగలేదు. ప్రతి వ్యక్తి దేశకార్యం తన కర్తవ్యం అని గుర్తించే స్థితి రావాలని అందుకు నిత్యసాధన అవసరమని డాక్టర్జీ గుర్తించారు. అందుకే సంఘ శాఖలు పెట్టారు. వ్యక్తిగత కీర్తి ప్రతిష్ఠలజోలికి, ప్రచారం జోలికి పోకుండా వ్యక్తి నిర్మాణానికి

దోహదపడే సంఘకార్యంపైననే దృష్టినంతా కేంద్రీకరించాలన్నారు. అందుకే ఆ రోజుల్లో సంఘస్థాన్‌లో ఈ పాటపాడుతుండేవారు-

''వృత్తపత్రమే నామ్ ఛపేగా, పహనూగా స్వాగతసముహార్

ఛోడ్ చలో అబ్ క్షుద్ర భావనా హిందు రాష్ట్రకే తారణహార్''

అనాటి స్వయంసేవకు మనోభావాలకు అద్దంపట్టే పాట చరణాలివి.

ఈనాడు కూడా సంఘం ఆర్భాటం, అట్టహాసం లేకుండా నిశ్చలంగా తన పని తాను చేసుకుపోతోంది. కాని 1948లో సంఘంపైన విధించబడిన మొదటి నిషేధ కాలంలోని అనుభవాలు స్వయంసేవకులలో ఆలోచనలు రేకెత్తింపజేశాయి. సంఘం స్థాపించినది మొదలు 1948 వరకు గడిచిన 23 ఏళ్ళ కాలఖండంలో ఎన్నో మంచిపనులు చేసింది. దేశవిభజన కాలంలోను, అంతకు ముందు, ఆతర్వాత కూడా అనితరసాధ్యమైన పనులు ఎన్నో చేసింది. దేశవిభజన సమయంలో తలెత్తిన హింసోన్మాదంలో లక్షలాది ప్రజలు ప్రాణాలు కోల్పోయారు, నోటితో ఉచ్చరించరాని అనర్ధాలకు గురియైనారు. అసంఖ్యాకమైన ప్రజలు నిరాశ్రయులై ప్రాణ భీతితో అలమటిస్తుంటే కాంగ్రెస్‌పార్టీ చేతులెత్తేసి ప్రక్కకు తప్పుకొంది. ఆ పరిస్థితిలో తమ ప్రాణాలు పణంగా పెట్టి ప్రజలను రక్షించింది సంఘస్వయంసేవకులే. అప్పుడుగాని, ఇప్పుడుగాని ఆత్మరక్షణకై తెగించి పోరాడిన సందర్భాలున్నాయి గాని మత విద్వేషంతో అన్యమతస్తులపై సంఘ స్వయంసేవకులు దాడి చేసిన ఉదంతాలు లేవు. ఈ వాస్తవాలు సామాన్య జనులకు తెలియకుండా పోయాయి. ఆనాడు అధికారంలో ఉన్న నెహ్రూ సంఘాన్ని 'కమ్యూనల్ ఆర్గనైజేషన్', 'ఫండమెంటలిష్టు సంస్థ', 'ఫాసిస్టు పార్టీ' అంటూ ముద్ర వేసి ప్రచారం సాగించిన కారణంగా జనసామాన్యంలో 'నిజమే కామోసు!' అనే

భావన ఏర్పడింది. దీనికి దీటుగా ఈ ప్రచారాన్ని త్రిప్పిగొట్టగల సాహిత్యంగాని, పత్రికలుగాని, అన్యసాధనాలుగాని సంఘం సమకూర్చుకోలేదు. అది లోపంగానే కన్పించింది. అనవసర ప్రచారం అక్కరలేదుగాని వాస్తవాలతో కూడిన అవసరమైన సమాచారం జనావళికి అందించడం అవసరం అని భావించడం జరిగింది.

ఆ తర్వాత క్రమంక్రమంగా దేశవ్యాప్తంగా సంఘ సాహిత్య ప్రచురణ, పత్రికలస్థాపన ప్రారంభమైంది. బెంగుళూరు, లక్నో, ఢిల్లీ, విజయవాడ మొదలైన కేంద్రాలనుండి ముఖ్యమైన సాహిత్యం వెలువరించడం ఆరంభమైంది. బెంగుళూరును సంఘసాహిత్యానికి ప్రముఖ స్థానంగా నిలిపి సిద్ధాంతపరమైన సాహిత్య స్రోతస్సును ప్రవహింపజేసిన మార్గదర్శకుడు శ్రీ యాదవరావ్ జోషి కాగా ఆంధ్రప్రాంతంలో ఆ కృషికి నాంది పలికిన వారు శ్రీ బాపూరావ్ మోఘే.

బాల్యం నుండి కూడ బాపూరావ్‌జీ సాహిత్యంపట్ల మక్కువగల్గి ఉండేవారు. విద్యార్థిగా ఉన్నప్పుడు, అలహాబాద్‌లో ప్రచారక్‌గా ఉన్నప్పుడు కూడ మంచి పుస్తకం మార్కెట్‌లోకి వచ్చిందంటే అది ఆయన అల్మారాలో ఉండేది. ఆయన స్వయంగా కొనడమేకాదు ఎంతోమంది చేత కొనిపించి చదివించేవారు. అది వారిలోగల సహజమైన అభిరుచి. ఆంధ్రప్రాంతానికి ప్రాంత ప్రచారక్‌గా నియుక్తులై వచ్చాక కూడ వారికి గల సాహిత్యాభిలాష ఏమాత్రం తగ్గలేదు. నేను వారితో మాట్లాడిన అనేక సందర్భాలలో వీరసావర్కర్ సాహిత్యంనుండో, వివేకానంద సాహిత్యం నుండో, అరవిందుని సాహిత్యంనుండో ఏదో ఒక పుస్తకం పేరు చెప్పి చదవమంటుండేవారు. ఒక సందర్భంలో శ్రీ చెంగల్వ శ్రీరామమూర్తికి 20 పుస్తకాల లిస్టు ఒకటి వ్రాసి ఇచ్చి, 'ఈ పుస్తకాలన్నీ ఎప్పుడోకప్పుడు తప్పక చదవాలి' అని చెప్పారు. అలా

ఎంతమందికో వారు సలహా ఇస్తుండేవారు. సంఘ సైద్ధాంతిక భూమికను బాగా అర్థం చేసుకొని ఇతరులకు నచ్చచెప్పాలంటే మన సంస్కృతి సభ్యతలను లోతుగా అధ్యయనం చేసి వ్రాయబడిన పుస్తకాలు మన కార్యకర్తలు తప్పక చదవాలి అంటుండేవారు. అంతటి అభిలాష ఉన్న వారు కాబట్టే విజయవాడలో 'సాహిత్య నికేతన్' పేరిట పుస్తక విక్రయశాల ప్రారంభించేట్లు చూశారు. డబ్బుకు ఎంతో ఇబ్బందిగా ఉండే రోజులు అవి. అయినా పట్టుబట్టి 'సాహిత్యనికేతన్' ప్రారంభింపజేశారు. హిందూధర్మం, భారతీయ సంస్కృతికి సంబంధించిన విలువైన పుస్తకాలన్నీ ఈ విక్రయశాలలో ఉండాలి' అన్నారు. ఆనాడు ఆయన అందించిన స్ఫూర్తితోనే ఈనాడు హైద్రాబాద్‌లో కూడ 'సాహిత్యనికేతన్' ప్రారంభమై పనిచేస్తున్నది.

సంఘ సైద్ధాంతిక భూమికను, సంఘం చేపట్టి కొనసాగిస్తున్న నిర్మాణాత్మక కార్యక్రమాలను జనసామాన్యానికి పరిచయం చేయాలనే సంకల్పంతో ఒక పత్రికను ప్రారంభించాలనుకొన్నారు బాపూరావ్‌జీ. దానికి ప్రయత్నాలు ప్రారంభించారు. అంతకు ముందు 1946లోనే లక్నో నుండి 'పాంచజన్య' హిందీ వారపత్రిక వెలువడుతోంది. ఆతర్వాత ఢిల్లీ నుండి 'ఆర్గనైజర్' ఆంగ్ల వారపత్రిక ఆరంభమైంది. ఆ తర్వాత 1948లో బాపూరావ్‌జీ మార్గదర్శనంలో 'జాగృతి' తెలుగువారపత్రిక ప్రారంభమైంది. ఈ మూడు పత్రికలు భారత్ ప్రకాశన్‌ట్రస్టు ఆధ్వర్యంలోనే వెలువడినాయి. మొదటి నిషేధకాలంలో కొంతకాలం 'జాగృతి' ప్రచురణ నిలిపివేయవలసివచ్చింది. తిరిగి 1953 అక్టోబర్‌లో విజయదశమి రోజున 'జాగృతి' పునర్ముద్రణ ప్రారంభం అయింది.

జాగృతి ఆరంభ, వికాసాలు బాపూరావ్‌జీతో ఎంతగానో ముడివడి ఉన్నాయి. 'జాగృతి' సకాలంలో ప్రింటయి క్రమం తప్పకుండా

వెలువడేందుకు గాను 'భారత ముద్రణాలయం' పేరిట ఒక ప్రింటింగ్ ప్రెస్సును కూడా ప్రారంభించడం జరిగింది. ఆర్థిక వనరుల విషయం, సంపాదకమండలికి అనువైన సభ్యులను ఎంపిక చేసుకొనే విషయం, రచన వ్యాసంగంలో అభిరుచిగల స్వయంసేవకులను గుర్తించి జాగృతికి రచనలు చేయించడం, ప్రెస్ మేనేజిమెంటు వ్యవహారాలు చూచేందుకు తగిన వ్యక్తులను నిర్ణయించడం ఇత్యాది అన్ని విషయాలు బాపూరావ్‌జీ మార్గదర్శనంలోనే సాగేవి.

1955లో నేను విజయవాడ యస్.ఆర్.ఆర్ అండ్ సి.వి.ఆర్ కళాశాలలో వాణిజ్యశాస్త్ర అధ్యాపకుడుగా పని చేశాను. హిందీ నేర్చుకోవాలని మంచి అభిలాష ఉండేది. చాలా మందికి సంస్కృతం నేర్చుకోవాలనే అభిలాష ఉంటుంది. కొందరికి తమిళం నేర్చుకోవాలనే అభిలాష ఉంటుంది. అందుకుగాను కావలసిన పుస్తకాలు కూడా కొంటారు. కాని భాష నేర్చుకోవాలన్న కోర్కె కోర్కెగానే మిగిలిపోతుంది. అలా కాకుండా పరీక్షలకు కడితే ఆ పరీక్ష ప్యాసవడానికైనా పట్టుదలగా పుస్తకాలు చదువుతారు. అటు పరీక్ష ప్యాసవడంతోపాటు భాషా పరిజ్ఞానం కూడా వస్తుంది. అందుచేత నేను దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి 'ప్రవేశిక' పరీక్షకు ఫీజుకట్టి పరీక్షకు ప్రిపేరు అయ్యాను. రేపు పరీక్ష అనగా ఏదో పని మీద కార్యాలయానికి వెళ్ళాను. బాపూరావ్‌జీ కన్పించారు.

'ఈ మధ్య కార్యాలయానికి వస్తున్నట్లు లేదే?' అడిగారు.

'హిందీ పరీక్షకు కట్టాను. ఇంట్లోనే ఉండి చదువుతున్నాను' అన్నాను.

హాయిగా కాలేజీలో ఉద్యోగం చేసుకొంటున్న వాడివి, ఈ హిందీ పరీక్ష ఎందుకు?' అన్నారు.

'హిందీ నేర్చుకోవాలనే పరీక్షకు కట్టాను' అన్నాను.

'హిందీ నేర్చుకోవడానికే అయితే మరో మంచి పని చెపుతాను. అది చేయి' అంటూ శ్రీ లాలాహరదేవ్ సహాయ్, శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి హిందీలో వ్రాసిన వ్యాసాలు నా చేతికి అందించి ' ఆర్టికల్స్ రెండూ తెలుగులోకి అనువాదం చేసి రేపు నాకు తెచ్చివ్వు. అవి జాగృతిలో ప్రచురించాలి' అన్నారు.

నా పరీక్ష అటకెక్కింది. ఆ రెండు వ్యాసాలు తర్జుమా చేసి మర్నాడు పట్టుకెళ్ళి ఇచ్చాను. నా రచనా వ్యాసంగం అలా ప్రారంభం అయింది. ఒక పని చేసేప్పుడు అది కేవలం వ్యక్తికేగాక సమాజానికి కూడ ఉపయోగపడేట్లుంటే ఆ పనిలో సార్ధకత ఉంటుంది అనే ఆలోచన బాపూరావ్‌జీ ఎంత చక్కగా అందించారు అనిపించింది. అనువాదం చేసేందుకు నేను తరచుగా డిక్షనరీ చూడాల్సివచ్చేది. అందువల్ల ఎన్నో క్రొత్త పదాలు నేర్చుకొన్నాను. హిందీ చదువుతూ అది అర్ధం చేసుకొని తెలుగులోకి అనువదించాలంటే ఒకటి రెండు సార్లు హిందీ వాక్యం చదువుకోవలసివచ్చేది. 'సాధనచేత పనులు సమకూరు ధరలోన' అన్నాడు కవి. భాష రాక ఏమి చేస్తుంది? అలా నాకు హిందీ భాష వచ్చింది, జాగృతికి ఒక అనువాదకుడూ లభించాడు. ఇలా రచనాభిలాషగల ఎందరికో స్ఫూర్తినిచ్చి చెయ్యిపట్టి వ్రాయించారు బాపూరావ్‌జీ.

ప్రపంచమంతటికి శ్రీ దీనదయాల్ ఉపాధ్యాయ ఒక రాజకీయవేత్తగా తెలుసు, ఏకాత్మమానవవాద ప్రతిపాదన ద్వారా ఒక తాత్త్వికుడుగా తెలుసు. కాని వారిలో గల సాహితీ మూర్తిని దర్శించాలంటే వారు రచించిన 'జగద్గురు శ్రీ శంకరాచార్య' చదవాలి. దానిలో 'ప్రస్తావన' రూపంలో గంగానది మహాత్మ్యాన్ని వర్ణిస్తూ ఇక్కడి జాతీయ జీవనాన్ని గంగాప్రవాహంతో పోల్చి చెప్పే అధ్యాయం హిందీ సాహిత్యంలో మణిమకుటంలా నిలిచిపోతుంది.

ఒకరోజు బాపూరావ్‌జీ నన్ను, శ్రీ కందర్ప రామచంద్రరావును,
మరొక రచయితను పిలిచి ఆ 'ప్రస్తావన' హిందీ కాపీ తలా ఒకటి ఇచ్చి '
ఈ అధ్యాయాన్ని మీరు తెలుగులో అనువదించి తెండి. దీనదయాల్‌జీ
పుస్తకం 'జగద్గురు శ్రీశంకరాచార్య' తెలుగులో తీసుకురావాలనుకొంటున్నాం.
మీ అనువాదం చూచాక ఆ పని ఎవరికి అప్పజెప్పాలో నిర్ణయిస్తాను' అన్నారు.

మేము ముగ్గురం తలా ఒక కాపీ చేతికి తీసుకొన్నాం. ఇంటికి చేరి
నేను అనువాదానికి పూనుకొంటే కలం కదలడం లేదు. హిందీ భాషలో దొర్లిన
ఆ వాక్యాలు గంగాప్రవాహంలా సాగిపోతూ నాలో మునకలు వేసి
ఆనందించాల్సిందేగాని బయటకు తీసి చూపించడం అసాధ్యం
అంటున్నాయి. మర్నాడు బాపూరావ్‌జీతో

'ఇది నా వల్ల కాదు. ఎంత ప్రయత్నించినా అనువాదం ఇంత ఎత్తుకు
ఎదగడం అసాధ్యం' అన్నాను.

శ్రీ కందర్ప, మరో రచయిత కూడా తమ అశక్తత వెలిబుచ్చారు.
అది చివరకు శ్రీ పురిపండ అప్పలస్వామిగారి చేత అనువాదం చేయించారు.
మహానుభావుడు ఆయన చాలా చక్కగా అనువదించాడు. బాపూరావ్‌జీకి
గల సాహిత్యాభిలాష హిందీ సాహిత్యం నుండి ఒక ఆణిముత్యం తెలుగులోకి
అవతరించేట్లు చేసింది.

జాగృతి ప్రారంభ దినాలలో శ్రీయుత బుద్ధవరపు వేంకటరత్నం,
బండారు సదాశివరావు, తూములూరి లక్ష్మీనారాయణ, యస్. వి
శేషగిరిరావు, కు.వెం. నారాయణ రావు, కందర్ప రామచంద్ర
రావు, జి.వి. యల్.నర్సింహారావు ప్రభృతులు ఎందరో పని చేశారు.
శ్రీకాకుమాను బాల సత్యనారాయణ అడ్వర్టైజ్‌మెంటు విభాగం పని

చూచేవారు. శ్రీ సోమరాజు, శ్రీ సత్యనారాయణ రాజుగారు ప్రెస్ నిర్వహణ చూచేవారు. కొంతకాలం శ్రీ పొన్నపల్లి రామచంద్ర మూర్తిగారు కూడా ప్రెస్ వ్యవహారం చూచారు. శ్రీ సుబ్బరాజుగారు పేరుకు ట్రెడిల్ మాన్‌గాని ప్రింటింగుకు సంబంధించిన వ్యవహారాలన్నీ ఆయనే చూచేవారు.

బాపూరావ్‌జీ చేతులమీదుగా ప్రారంభమైన జాగృతి తెలుగువారపత్రిక స్వర్ణోత్సవాలు జరుపుకొంటున్నది.

## ఉద్యమానికి ఊపు

1952 సెప్టెంబర్ 9,10 తేదీలలో ఆర్.యస్.యస్ అఖిలభారతీయ ప్రతినిధి సభ సమావేశాలు జరిగాయి. ఈ సమావేశాలలో గోహత్యానిషేధానికి సంబంధించి చారిత్రాత్మకమైన తీర్మానం చేశారు-

''అఖిలభారతీయ ప్రతినిధి సభ సమావేశం, భారతప్రభుత్వ గోవంశం పట్ల ప్రదర్శిస్తున్న అపసవ్యమైన వ్యవహారం చూచి చింతిస్తోంది. మన దేశంలో గోవంశపోషణ కేవలం ఆర్థిక దృష్టితోగాక సంస్కృతి పరంగా చేయబడుతోంది. గోరక్షణ జాతి ఏకాత్మభావానికి ప్రతీకం. గత అయిదు సంవత్సరాలుగా భారతప్రభుత్వానికి గోహత్య నిషేధించవలసినదిగా కోరుతూ యావత్ భారతదేశం నుంచి సమర్పింపబడిన విజ్ఞాపనలు త్రోసివేయు బడుతూ ఉండటం ఎంతో అనుచితం.

సంపూర్ణ భారతదేశంలో సంతకాలు సేకరణ ద్వారా ప్రజాభిప్రాయాన్ని స్వీకరించి గోసంవర్ధన ఆవశ్యకతను ప్రభుత్వాధినేతల స్మరణకు తెచ్చేందుకు ఈ సభ నిశ్చయించింది. దీనికొరకు స్వయంసేవక సోదరులందరు సభల ద్వారాను, ఊరేగింపులద్వారాను, ఇతర సమావేశాల ద్వారాను కోట్లాది భారతీయుల భావనలకు దేశవ్యాప్తంగా జాగృతి కల్గించి

దృఢతరమొనరించి శక్తిని సమీకరించి భారత ప్రజాప్రభుత్వపు దృష్టికి తెచ్చి గోహత్యను సంపూర్ణంగా నిషేధించేట్లు చేయవలసినదిగా ఈ సభ కోరుతున్నది.

గోహత్యానిరోధానికై సంఘం తీసుకొన్న ఈ నిర్ణయాన్ని భారతప్రజలంతా బలపరచవలసిందిగానూ, తను, మన, ధన పూర్వకంగా సహాయమొనర్చవలసిందిగాను ఈ సభ వినయపూర్వకంగా కోరుతోంది. భారతదేశంలోని అన్ని సంస్థలు, అన్ని పక్షాలు నిరపేక్షాభావంతో కూడిన ఈ కార్యంలో సంఘానికి సంపూర్ణ సహకారాన్ని అందించవలసినదిగా ఈ సభ ఆహ్వానిస్తున్నది''

ఈ తీర్మానాన్ని పురస్కరించకొని సంఘ స్వయంసేవకులు దేశవ్యాప్తంగా ప్రజల సంతకాలు సేకరించడానికి పూనుకొన్నారు. సభలు ...ర్వహించి గోహత్యా నిరోధానికి అనుకూలంగా తీర్మానాలు చేయించారు. ఈ బృహత్ యజ్ఞంలో దేశవ్యాప్తంగా 53,918 మంది స్వయంసేవకులు ...ల్గొన్నారు. 84,026 స్థలాల్లో సభలు నిర్వహించారు. 1,75,73,227 సంతకాలు సేకరించారు. దేశ చరిత్రలో ఏ సమస్యపైన కూడా లిఖితపూర్వకంగా ఇంతమంది ప్రజల అభిప్రాయం స్వీకరించిన దాఖలాలు లేవు.

ఒక ప్రక్కన రాయలసీమలో కరువు రక్కసి కోరలలో చిక్కుకొని ...మో రామచంద్ర అని అలమటిస్తున్న బాధితులను ఆదుకొనే ...త్నంలో తలమునకలై ఉండి కూడా బాపూరావ్‌జీ ఆంధ్రప్రాంతంలో ...త్యా నిరోధానికై ప్రజల సంతకాలు పెద్ద ఎత్తున సేకరించేందుకు ...యంసేవకులకు అన్ని విధాల మార్గదర్శనం చేశారు.

1952 డిశంబర్ 7వ తేదీన ప్రాంతప్రాంతాల నుండి సేకరించిన సంతకాల పత్రాలను దేశరాజధాని ఢిల్లీ పురవీధులలో ఊరేగింపుగా ప్రజలకు ప్రదర్శించారు. ఆరోజు రాంలీలా మైదానంలో 'నభూతో నభవిష్యతి' అన్న రీతిగా గొప్ప బహిరంగ సభ జరిగింది. దివినుండి వర్షించిన కాషాయపు జల్లు భూతలాన్ని సంపూర్ణంగా ఆక్రమించిన రీతిగా పురవీధులు కాషాయపు శోభను విరజిమ్మాయి. పూజ్య శ్రీ గురుజీ, శ్యామప్రసాద్ ముఖర్జీ వంటి ప్రముఖులు ఆ సభలో పాల్గొన్నారు. ఆ మర్నాడు ఆ పత్రాలను రాష్ట్రపతి బాబూ రాజేంద్రప్రసాద్‌కు సమర్పించారు.

ఆంధ్రప్రాంతంలో బాపూరావ్‌జీ మార్గదర్శనంలో గ్రామసీమల వరకు వ్యాపించిన ఈ సంతకాలసేకరణ ఉద్యమం ఈ ప్రాంతంలో గోహత్యా నిరోధ ఉద్యమానికి మంచి ఊపుతెచ్చింది. ఆ తర్వాత ఆంధ్రప్రభుత్వం ప్రజాభిప్రాయం సేకరించగా అది గోహత్యా నిషేధానికి అనుకూలంగా వచ్చింది. గోహత్యను సంపూర్ణంగా నిషేధిస్తున్న ఒక అనధికార బిల్లు అసెంబ్లీలో ప్రవేశపెట్టబడింది ఆంధ్రశాసన సభవారు వేసిన కమిటీ కూడా ఆ బిల్లును అంగీకరించింది.

## గోరక్షణ మన విధి

1958 జనవరి మాసంలో సంక్రాంతి సెలవులకు నేను వరంగల్లు నుండి విజయవాడకు వచ్చాను. విజయవాడ మా స్వస్థలం. అప్పటికి ఇంకా నాకు పెళ్ళి కాలేదు. రెండు, మూడు రోజులు సెలవులు దొరికినా అమ్మ, నాన్నలను చూడటానికి విజయవాడకు వస్తుండేవాడిని. విజయవాడకు వస్తే తప్పకుండా కార్యాలయానికి వెళుతుండేవాడిని. కార్యాలయంలో కూర్చుని కాసేపు అయినా బాపూరావ్‌జీతో మాట్లాడితేనేగాని సంతృప్తిగా ఉండేది కాదు.

నేను కార్యాలయానికి వెళ్ళినప్పుడు బాపూరావ్‌జీ తమ గదిలోనే ఉన్నారు. ఆయనతో ఇద్దరు స్వయంసేవకులు ఏదో మాట్లాడుతున్నారు. 'నమస్తే' అంటూ నేను గదిలో ప్రవేశించాను. 'అరె! కబ్ ఆయా?' అంటూ నన్ను పలకరించి కూర్చోమన్నారు. ఆ ఇద్దరు స్వయంసేవకులు మళ్ళీ కలుస్తాం అని చెప్పి వెళ్ళిపోయారు. కాసేపు వరంగల్లు విశేషాలు అడిగి తెలుసుకొన్నారు. పది,పదిహేను నిమిషాలు గడిచాయి. ఇంతలో తమ ప్రక్కనే ఉన్న పుస్తకాల్లోంచి ఒక పుస్తకం తీసి నాకు ఇస్తూ-

'నిన్ననే నీ గురించి అనుకొన్నాం. ఇది శ్రీ లాలాహరదేవ్ సహాయ్ వ్రాసిన పుస్తకం. ఇది అర్జంటుగా తెలుగులోకి అనువాదం చేసి ఇవ్వాలి. ఆ పుస్తకాలు ప్రాంతం అంతటా పంపించాలి' అన్నారు.

లాలా హరదేవ్ సహాయ్‌గారు అఖిలభారత గోహత్యా నిరోధ సమితి కార్యదర్శి. వారి వ్యాసాలు అంతకు ముందు చాలా తెలుగులో అనువదించాను. అవి జాగృతి పత్రికలో ప్రచురించడం జరిగింది. ఒక పుస్తకం అనువదించడం నాకూ ప్రథమమే.

'త్వరగా ఇవ్వాలంటున్నారు. మళ్ళీ ఉద్యమం ఉధృతం చేస్తున్నారా?' అడిగాను.

'గోహత్యా నిరోధ సమితి, ఆంధ్రప్రదేశ్ శాఖ తమ కార్యక్రమాలు విస్తృతం చేయాలని నిర్ణయించారు. అందుకుగాను ఈ పుస్తకం తెలుగులో అచ్చువేయించి వారికి అందించాలి' అన్నారు.

బాపూరావ్‌జీతో ఉన్న చనువు కొద్దీ సంఘకార్యంలోను, నిజ జీవితంలోను ఎదురయ్యే అనుమానాలు ఏవి ఉన్నా సంకోచం లేకుండా వారిని అడగడం బాల్యం నుండి అలవాటు.

'గోహత్యా నిరోధ ఉద్యమంలో ప్రజల వద్దకు వెళుతున్నప్పుడు చాలా ప్రశ్నలు వేస్తున్నారు. మాంసాహారులు కోళ్ళు, కుందేళ్లు, జింకలు, మేకలు, పందులు, పావురాళ్ళు, బర్రెలు, ఆవులు-మొదలైన వాటిని వారివారి ఇష్టాలను బట్టి తింటుంటారు. గోవులను తినకూడదని అడ్డుకోవడం వారి ఆహారపు అలవాట్లలో జోక్యం చేసుకోవడం కాదా? అని అడుగుతున్నారు. మనం ఏమి సమాధానం చెప్పాలి?' అడిగాను.

దానికి సమాధానంగా బాపూరావ్‌జీ ఎన్నో విషయాలు చెప్పారు-

చాలాకాలం క్రితం అంటే సుమారు 1934,35 ప్రాంతంలో నెహ్రూగారు 'మేరీ కహానీ' అనే పుస్తకం ఒకటి వ్రాశారు. ఆ పుస్తకంలో ఒక్కొక్క దేశం ఒక్కొక్క పశువునో, పక్షినో తమ చిహ్నంగా ఎంపిక చేసుకొంటూ ఉంటాయని వ్రాశారు. సుమారుగా అవి ఆయా దేశాల అభిరుచులకు ,ఆదర్శాలకు, ఇతిహాసానికి ప్రతీకగా ఉంటాయి. రాబందు అమెరికాకు, సింహం జర్మనీకి, బుల్‌డాగ్ ఇంగ్లీషువారికి, పోట్లాడుకొంటున్న కోళ్ళు ఫ్రాన్సుకు, ఎలుగుబంటు ప్రాచీన రష్యాకు చిహ్నాలు. హిందువులు మొదటినుంచి అహింసను ఆరాధిస్తున్నారు కాబట్టి గోవును తమ చిహ్నంగా ఎంచుకొన్నారు. ఇందులో ఏమాత్రం ఆశ్చర్యం లేదు అని వ్రాశారు. అప్పటికి నెహ్రూగారికి ఇంకా సోషలిష్టు రాజకీయాలు అంతగా పట్టినట్లు లేదు.

కాబట్టి మన దేశంలో గోవుకు అనాదిగా ఒక ప్రత్యేకస్థానం ఉంది.

మన వేదాలలో గోవు ప్రశస్తి ఉంది. గోవును సర్వాంతర్యామి అయిన పరమేశ్వరుని రూపంగా భావించి పూజించినట్లు మహాభారతగ్రంథంలో ఉంది-

యధాసర్వమిదం వ్యాప్తం జగత్ స్థావర జంగమమ్

తాంధేనుం శిరసావందే భూతభవిష్యమాతరం

సామ్రాట్ దిలీపుడు గోరక్షణకు ఎంతో ప్రాముఖ్యం ఇచ్చాడు. సామ్రాట్ దిలీపుడు గోరక్షణ కొరకు తన ప్రాణాలను సమర్పిచడానికి సిద్ధమయ్యాడు. చ్యవన మహర్షి తన శరీరపు విలువను గోవుతో సమానం అని చెప్పాడు. అది నహుషుని మొత్తం సామ్రాజ్యపు విలువకంటె ఎక్కువ అన్నాడు. అర్జునుడు గోరక్షణ కొరకు పన్నెండేళ్ళు వనవాసానికి వెళ్ళాడు. వసిష్ఠుడు, జమదగ్ని గోవుకు ఎంతో విలువ ఇచ్చారు. ఇటీవలి చరిత్రలో పృథ్వీరాజ్ చక్రవర్తిగోవును ఎట్టిపరిస్థితులలోను కాపాడతానని ప్రతిజ్ఞ చేసిన సంగతి మనకు తెలుసు. మహమ్మద్ ఘోరీ ఈ విషయం తెలుసుకొని తన సైన్యానికి ముందు భాగాన గోవులను నడిపించుకొంటూ పోయి పృథ్వీరాజ్‌తో యుద్ధం చేసి ఓడించాడని చరిత్ర చెపుతోంది. ఛత్రపతి శివాజీ 12 ఏళ్ళ ప్రాయంలోనే తన ప్రాణాలను లెక్కచేయక గోహంతకునితో పోరాడి వాడి చేతులు నరికి వేసిన సన్నివేశం చరిత్రలో ఉంది.

నామ్‌ధారి శిక్కులు గోరక్షణకై తుపాకి గుండ్లకు తమ గుండెలనడ్డంగా పెట్టి ఆహుతి అయ్యారు. ఆర్యసమాజ స్థాపకులు స్వామి దయానంద సరస్వతి గోహత్యా నిషేధ ఆందోళనాన్ని కొనసాగించారు. ''గోవు మొదలైన పశువులు నశిస్తే రాజ్యం, ప్రజలు కూడా నశిస్తారు'' అంటూ తమ పుస్తకం ణానిధి'లో వ్రాశారు.

భారతదేశ పరిస్థితిని దృష్టిలో ఉంచుకొని గోవధను నిషేధించడం కంటె వివేకవంతమూ, శాస్త్రీయమూ అయిన పని మరొకటి లేదని చెప్పగలను'' అన్నారు శ్రీ జైప్రకాష్ నారాయణ్.

''బజారులో అమ్మడానికి వచ్చే ఆవులన్నింటిని ఎంత ఎక్కువధర ఇచ్చి అయినా సరే ప్రభుత్వం ఖరీదు చేయాలి. ముసలి, ముతుక, రోగిష్టిపశువుల రక్షణ బాధ్యత ప్రభుత్వానిదే'' అని 1927లో 'నవజీవన్'పత్రికలో గాంధీజీ స్పష్టంగా వ్రాశారు.

''గోరక్షణ జరగకపోతే మనం మన స్వరాజ్యాన్ని, స్వరాజ్యం తెచ్చే శోభను కోల్పోయామని చెప్పాలి. నేను ఖురాను, బైబిల్ గ్రంథాలను ఎంతో నిశితంగానూ, ప్రేమ పూర్వకంగాను అధ్యయనం చేశాను. ముసల్మానుల, క్రైస్తవుల ప్రతినిధిగా ఆ రెండు మతాలలో గోహత్య జరపాలనే విషయం లేదని ఖచ్చితంగా చెప్పగలను. మన సెక్యూలర్ రాజ్యంలో గోరక్షణ జరిగి తీరాలని చెపుతున్నాను'' అని 'హరిజన'పత్రికలో స్పష్టంగా వ్రాశారు ఆచార్య వినోభాభావే.

ఈ దేశంలో గోవు అతి పవిత్రమైనది. అందుకే ఈ పెద్దలంతా గోవును రక్షించి తీరాలని ఎలుగెత్తి చాటారు. వీరంతా గోవును మిగతా జంతువులతో పోల్చరాదని స్పష్టం చేశారు. మనం కూడా గోమాతను రక్షించి తీరాలని చాలా కాలంగా పోరాటం సాగిస్తున్నాం. 'గుర్రానికీ, ఆవుకు తేడా ఏమిటి?' అని అడిగిన పెద్దమనుషులకంటె గోవును కాపాడి తీరాలని చెప్పిన పెద్దలు తెలివితక్కువ వారు కాదు అన్నారు బాపూరావ్‌జీ. బాపూరావ్‌జీతో మాట్లాడటమే ఒక ఎజుకేషన్.

## గుండె కావాలి

కొట్లాటలు కొనితెచ్చుకోకూడదు కాని ఎదురైతే ధైర్యంగా ఎదుర్కోవలసిందే అన్నది బాపూరావ్‌జీ విధానంగా ఉండేది. 1951-52 సంవత్సరాలలో నేను యస్.ఆర్.ఆర్ అండ్ సి.వి.ఆర్ కళాశాలలో

ఇంటర్మీడియేట్ చదువుతుండేవాడిని. ఉన్నట్లుండి కాలేజీ ఆవరణలో కొన్ని కరపత్రాలు ప్రత్యక్షమయినాయి. మా విద్యార్థులలోనే ఒక చిలిపి వెధవ (ఇప్పుడు ఆ పేరు వ్రాయడం బాగుండదు) ఆ కరపత్రాలు ప్రింటు చేయించి ఇంకెవరో వాటిని పంచిపెట్టేట్లు చేశాడు. ఆ కరపత్రంలో లెక్చరర్ల అమ్మాయిల పేర్లు కొన్ని, ఇతర గర్ల్ స్టూడెంట్సు పేర్లు కొన్ని వ్రాసి వారి పేర్లకెదురుగా పిచ్చిపిచ్చి పాత్రలు సృష్టించి వ్రాయడం జరిగింది. మొత్తం మీద ఆ కరపత్రం చాలా జుగుప్సాకరంగా ఉంది. విద్యార్థినీ విద్యార్థులు, లెక్చరర్లు అంతా బాధపడ్డారు. ఎలాగైనా సరే ఆ కరపత్రం ప్రింటు చేయించినవాడిని పట్టుకోవాలని ఆరా తీయడం ప్రారంభించారు. ఏమైతేనేం ఫైనల్ ఇయర్ బి.ఎ చదువుతున్న విద్యార్థి ఒకరు ఆ కరపత్రం తెనాలిలో ప్రింటు చేయబడిన సంగతి, అది ప్రింటు చేయించిన వ్యక్తి సంగతి వెలికి తీశాడు. అది విద్యార్థులకు చెప్పడంతో అటు విద్యార్థులలోని స్వయంసేవకులు, కమ్యూనిష్టువర్గాలు కూడా ఆ పిచ్చి పని చేసిన విద్యార్థిని పట్టుకొచ్చారు. బాగా చీవాట్లు పెట్టి వదిలేశారు. ఇంతలో ఏ.ఐ.యస్.యన్ విద్యార్థులు ఆ అవకాశాన్ని చేతిలోకి తీసుకొని ఆ విద్యార్థి జుట్టు గొరిగించి గాడిదపై ఊరేగించారు. ఈ పని చేసిన వారిని వదిలి పెట్టేసి మొట్టమొదట పట్టుకొన్నది ఆర్.యస్.యస్ వాళ్ళే కాబట్టి వాళ్ళ సంగతి చూస్తాను అంటూ ఆ విద్యార్థి కక్ష పూనాడు. ఆ రోజుల్లో కాశీ, యోగానంద శర్మ, నీరుకొండ గోపాలరావు ఇత్యాది విద్యార్థి కార్యకర్తలు కాలేజీలో చురుకుగా పని చేసేవారు. వారిలో కాశీ అన్న విద్యార్థిని పట్టుకొని బాగా కొట్టారు. దానికి ప్రతీకారం తీర్చుకొన్నారు స్వయంసేవకులు. కొన్ని మాసాలపాటు ఈ ఇద్దరి మధ్య కొట్లాటలు జరిగాయి. ఈ విషయం బాపూరావ్‌జీ దాకా వెళ్ళింది. 'మీ తప్పులేనప్పుడు మీరు దాసోహం అనవలసిన పనిలేదు. కాకపోతే

ఒంటరిగా ఉండకుండా సాధ్యమైనంతవరకు జట్లుజట్లుగా ఉండండి. ఆత్మరక్షణకు ముఖ్యంగా కావలసింది ధైర్యం. మీరు ఎవరికి భయపడనవసిన పని లేదు' అని ధైర్యం చెప్పారు బాపూరావ్‌జీ.

ఆ సందర్భంలోనే మొదటి నిషేధకాలంలో మధ్యప్రదేశ్‌లో జరిగిన సంఘటన ఒకటి చెప్పారు బాపూరావ్‌జీ. నిషేధం పెట్టిన తొలి రోజుల్లో కాంగ్రెస్ వారు, కమ్యూనిస్టులు సంఘ కార్యకర్తలపై దౌర్జన్యం జరిపిన సంఘటనలు కొన్ని ఉన్నాయి. వీరేంద్ర కుమార్ సకలేచా గారు ( ఆతర్వాత కాలంలో మధ్యప్రదేశ్ ఉపముఖ్యమంత్రిగానూ, ముఖ్యమంత్రిగానూ చేశారు.) బజారులో వెళుతుంటే కొందరు కమ్యూనిస్టులు ఆయనను గుర్తించి వెంటబడ్డారు. ఆయన విశ్వవిద్యాలయం హాస్టల్‌లో ఒక గదిలో జొరబడి తలుపువేసుకొన్నారు. ఇంతలో వీళ్ళంతా ఒక గుంపుగా వెళ్ళి తలుపు బద్దలు కొట్టడం ప్రారంభించారు. ఇంకాస్తసేపు అయితే తలుపు ఎలాగూ పగిలిపోతుంది ఇంతలో సక్లేచా ఆ గదిలో పాడైపోయి ఒక మూలన పడి ఉన్న ఇనప కుర్చీ చేతికి తీసుకొన్నారు. స్వయంగా ఆయనే తలుపు తీశారు. మొదట ప్రవేశించిన ఒకడి తలకాయ మొదటి దెబ్బకే పగిలిపోయింది. రెండో దెబ్బకు రెండోవాడి తలపగిలింది. రక్తం ఫౌంటెన్‌లా చిమ్ముతోంది. ఆ వెనుక గుంపుగా ఉన్న కమ్మీల కళ్ళు చెదిరాయి. పిక్కబలం చూపించారు. ఆత్మరక్షణలో సక్లేచా విజయం సాధించారు.

ఆత్మరక్షణకు ధైర్యం ప్రధానమనే విషయం మాకు బాగానే అర్థం అయింది. ఆతర్వాత మా కాలేజీ కొట్లాటలు వాటంతట అవే సద్దుమణిగాయి.

1957-58 సంవత్సరంలో ఇలాంటిదే మరొక సంఘటన జరిగింది. విజయవాడలో సూర్యారావుపేట అంటే స్టాలిన్ గ్రాడ్ అంటుండేవారు.

కమ్యూనిష్టులకు అది పెద్ద అడ్డ అన్నట్లుగా ఉండేది. ఎవరి ఇంటిమీదనైనా సరే ఉంటే ఎర్ర జండా ఉండాలేగాని మరొకటి ఉండరాదన్నంత రుబాబ్ ఉండేది. బాల్యం నుండి స్వయంసేవకునైన కారణంగా మొదటి నుండీ స్వతంత్రమైన మనఃప్రవృత్తి నాకు అలవడింది. కమ్యూనిష్టులంటే పడదు కాబట్టి మా ఇంటిపైన నేను కాంగ్రెస్ జండా పెట్టాను. మాది ఒక పూరి పాక ఇంటి ఆవరణ. ఎడ్లు,గేదెలతో నిండి ఉండేది. మాది ఏవిధంగా చూసినా పదహారణాల కార్మిక కుటుంబమే. అలాంటి ఇంటి మీద కాంగ్రెస్ జండా ఎగరడమా? కమ్యూనిష్టులు ఒకరోజు వచ్చి ఆ జండా పీకేయమన్నారు. నేను కుదరదు అన్నాను. 'మీ పని చూస్తాం' అంటూ వెళ్ళిపోయారు. ఆ తర్వాత కొద్ది రోజులకే గిల్లి కజ్జా ఒకటి పెట్టుకొని ఓ ఏభై మంది మా ఇంటి మీద దాడి చేయడానికి వచ్చారు. మా నాన్నగారు గేదెలకు కుడితి పెట్టేందుకు కర్రతో ఆ కుడితి నీరు కలుపుతున్నారు. ఆయన వెనక నుండి ఒకడు వచ్చి కర్ర ఎత్తి దెబ్బవేయబోయాడు. ఆ కర్ర మానాన్నగారి తలమీదపడే లోపుగానే మా బావమరిది ఒకడు కుడితి కలుపుతున్న కర్ర మానాన్నగారి చేతినుండి లాక్కొని ఈ కమ్యూనిష్టు సోదరుని తల మీద బాదాడు. తల పగిలింది. ఇంతలో ఈ గలాభా విని ఇంట్లో ఉన్న మేము సత్వరం ఎవరికి అందిన సాధనం వాళ్ళు తీసుకొని వెంటబడ్డాం. ఆ ఏభై మంది గుంపు కాలికి బుద్ధి చెప్పారు.

ఈ వార్త ఎలా తెలిసిందో బాపూరావ్‌జీకి తెలిసింది. వెంటనే దేశపాండేగారిని, వారితోపాటు శ్రీ సుబ్బరాజు,కవులారి సోదరులు ఇంకా కొంతమంది స్వయంసేవకులను మా ఇంటికి పంపించారు. అందరూ దండ చేతబూని కాసేపు హడావిడి చేశారు. ఆ తర్వాత మళ్ళీ మా ఇంటి మీద దాడి చేయడానికి కమ్యూనిష్టులు సాహసించలేదు. కొట్లాడవలసిన పని లేదు

కొండంత అండ ఉంది అని అవతలి వాడికి తెలిస్తే చాలు బలప్రయోగం అవసరంరాదు. అలాంటి అండను కల్పించేవారు బాపూరావ్‌జీ.

ఆ రోజుల్లో దేశపాండేగారు నెల్లూరు జిల్లాలోను, విజయవాడలోను, ఖమ్మంలోను ఆత్మగౌరవరక్షణకై అప్రకటిత యుద్ధాలు ఎన్నో చేయవలసి వచ్చింది. బాపూరావ్‌జీ ఎన్నడూ వారి సాహసంపైన చన్నీళ్ళు పోయలేదు. అందుచేతనే ఆరోజుల్లో విజయవాడలోను, ఖమ్మంలోను కమ్యూనిస్టుల నెదుర్కొని నిలబడగలిగాం. వరంగల్లులో పెడదారి పట్టిన సోషలిస్టుల ఆగడాలను ఎదిరించి నిల్వగలిగాం. కందుకూరు మొదలైన చోట్ల దుండగులైన ముస్లింలు కొందరు సాగిస్తున్న గుండాగిరిని నిలవరించగలిగాం.

## సంయమన శీలం

సంఘటన కార్యం విస్తరిస్తున్న కొద్దీ ఎంత జాగ్రత్తగా వ్యవహరించినా అంతర్గతంగా కొన్ని భేదాభిప్రాయాలు పొడసూపే అవకాశం ఉంది. మనిషి మరయంత్రం కాదుకదా? మెదడున్న మనిషి మనస్సులో అనేక ఆలోచనలు వస్తాయి. ఆలోచనలలో అంతరం తప్పదు. ఈ ఆలోచనలలోగల భేదాలు పరస్పరం చర్చించుకోవడం ద్వారా చాలావరకు పరిష్కరింపబడతాయి. కాని కొన్ని సందర్భాలలో అహం అడ్డువస్తుంది. తన ఆలోచనే సరియైనది, ఇతరుల ఆలోచనలన్నీ తప్పు అనే భావన మనస్సును ఆవరిస్తుంది. తనంతటి తెలివైనవాడు చెపుతున్నా అవతలివారు ఖాతరు చేయడంలేదన్న అసంతృప్తి బయలుదేరుతుంది. తన తెలివితేటలకు తానే మురిసిపోయి తన తెలివితేటలకు తగిన గుర్తింపు లభించడంలేదన్న బాధ బయలు దేరుతుంది. క్రోధం పెల్లుబుకుతుంది. ఆగ్రహం ఆవేశాన్ని పెంచుతుంది. ఆవేశం ఆలోచనను చంపుతుంది. నా ముందువాడెంత, వీడెంత అనిపించే భూతం

చెప్పాను. నా సమాధానం విని నన్ను ప్రపంచజ్ఞానం తెలియని అమాయకుడి క్రింద జమకట్టాడాయన. బాపూరావ్‌జీ మాత్రం ఏ దశలోనూ సంయమనాన్ని కోల్పోలేదు. ఈ ప్రచారాన్ని ఎంతో నిగ్రహంతో ఎదుర్కొన్నారు.

ఒకరోజు కార్యాలయం వాకిట్లో నిలబడి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ చూస్తుండగా దానిలో బాపూరావ్‌జీని, సంఘాన్ని నిందిస్తూ అయిదారుగురు ప్రచారకులు చేసిన ప్రకటన కంటపడింది. 'బాపూరావ్‌జీ! మీకు వ్యతిరేకంగా వాళ్ళు చేసిన ప్రకటన వచ్చింది ఈవేళ పేపర్లో' అన్నాను. 'ఏముందో ఒకసారి చదువు' అన్నారు. చదివి వినిపించాను. 'ఇంతటితో ఒక పెద్ద భారం దిగిపోయింది' అన్నారు. 'అదేమిటి? అలా అంటున్నారు?' అని అడిగితే, 'పేపరుకు ఎక్కుతాం, పేపరుకు ఎక్కుతాం అంటూ ఇంతకాలం ఒక బూచిని చూపి స్వయంసేవకులను బెదిరిస్తున్నారు. అదీ జరిగిపోయింది కాబట్టి వాళ్ళు బ్రహ్మాస్త్రం అనుకొంటున్నది వాళ్ళ చేతుల్లోంచి వెళ్ళిపోయింది' అన్నారు. ఆతర్వాత కొన్నాళ్ళకు విభేదించిన వారంతా పెళ్ళిళ్ళు ఉద్యోగాల గొడవలో పడిపోయారు. పోటీ శాఖలు అదృశ్యమయినాయి. మళ్ళీ యథాప్రకారం శాఖలు కొనసాగుతూ వచ్చాయి. బాపూరావ్‌జీ పాటించిన సంయమనం ఎంతగానో తోడ్పడింది. ఈ సంయమనం కారణంగానే ఎదురు తిరిగిన వర్గంలో చేరాలా వద్దా అని ఊగిసలాడిన సీనియర్ కార్యకర్తలు నిలబడిపోయారు.

1958లో చీరాల సమీపంలోని ఓడరేవులో సంఘ అధికారులకు పరివారక్షేత్రాల అధికారులకు బైఠక్‌లు జరిగాయి. శ్రీ ఏకనాథ్‌జీ మార్గదర్శనం చేయడంవల్లను, అనేక ముఖ్యవిషయాలు, 'ముక్తచింతన' పేరుతో నిర్మొహమాటంగా చర్చించుకొని నిర్ణయాలకు వచ్చిన కారణంగాను

ఈ బైఠక్‌లు చరిత్రాత్మకమైనవిగా గుర్తింపబడ్డాయి. 100మందికి పైగా అధికారులు పాల్గొన్న ఈ బైఠక్‌లలో ఆంధ్రప్రాంతంలో సంఘకార్యానికి సంబంధించి కూలంకషమైన చర్చ జరిగింది. పరివారక్షేత్రాలకు, సంఘానికి మధ్య ఉండవలసిన సంబంధాలను గూర్చి కూడా విపులంగా చర్చ కొనసాగింది. 1955లో తలెత్తిన విభేదాలవంటివి పునరావృతం కాకుండా ఉండేందుకు తగు సూచనలు కూడా చేయబడ్డాయి.

## ఆ రోజుల్లో తెలంగాణాలో సంఘకార్యం

1953 మేనెలలో విజయవాడలో జరిగిన ఓ.టి.సి కి తెలంగాణ ప్రాంతంనుండి కొందరు స్వయంసేవకులు వచ్చి పాల్గొన్నప్పటికి ఆ ప్రాంతంలో సంఘకార్య విస్తరణకై 1955 నుండి బాపూరావ్‌జీ మోఘే తమ దృష్టి కేంద్రీకరించినట్లు విశదమవుతుంది. ఖమ్మం, వరంగల్లు, నల్లగొండ, మహబూబ్ నగర్ జిల్లాలలో విస్తృతంగా పర్యటనలు జరిపారు. భాగ్యనగర్ విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించారు. ఆంధ్రప్రాంతం నుండి కూడా ఈ జిల్లాలకు మెరికలలాంటి ప్రచారకులను పంపించారు. ఆదిలాబాద్, మెదక్, నిజామాబాద్, కరీంనగర్ జిల్లాలో కూడా ఆర్.యస్.యస్ కార్యం బాగా పెరిగింది.

తొట్టతొలుత హైద్రాబాద్ సంస్థానంగా ఉండగా సంఘకార్యం ఆర్.యస్.యస్ పేరుతో జరగలేదు. ఆనాడు ఆ సంస్థానంలో ఉన్న వాతావరణం,రజాకార్‌ల దౌర్జన్యకాండ దృష్టిలో పెట్టుకొని ఆర్.యస్.యస్ పేరుతోకాకుండా హిందూ సమాజ జాగరణకు పనికివచ్చే భజనలు, కీర్తనలు, ఆధ్యాత్మిక ప్రసంగాలు ఇత్యాది కార్యక్రమాల ద్వారా జన సామాన్యంలో జాగృతి కలిగించే ప్రయత్నం జరిగింది. ఆ రోజుల్లో హైద్రాబాద్ సంస్థానం

మొత్తం సంఘ దృష్ట్యా కర్నాటక ప్రాంతంలో ఒక విభాగ్‌గా ఉండేది. కాబట్టి అప్పుడు కర్నాటక ప్రాంతప్రచారకులుగా ఉన్న శ్రీ యాదవరావ్ జోషియే ఇక్కడి పని చూస్తుండేవారు. శ్రీ యాదవరావ్‌జీ ప్రచారకులుగా వచ్చిన తొలిదశలో బెల్గాం పట్టణం కేంద్రంగా సంఘ విస్తరణ కార్యాన్ని ప్రారంభించారు. వారు బెల్గాంలో ఉన్నప్పుడే హైద్రాబాద్ సంస్థానం సంఘ కార్యంలో ఒక విభాగ్‌గా ఉండేది.

1946 జూన్ నెలలో శ్రీధర్ విష్ణుపంత్ కామత్ ను హైద్రాబాద్‌కు ప్రచారక్‌గా పంపించారు యాదవరావ్‌జీ. ఆయన వకీలు శ్రీ తళ్‌పలీకర్‌గారి ఇంట్లో ఉండేవారు. ఆయన హిందువులు ఎక్కువగా ఉన్న ప్రదేశాలలో గుళ్ళలో చేరి భజనలు, కీర్తనలు పాడుతున్న భక్తులతో కలుస్తూ పరిచయాలు పెంచుకొనేవారు. 1946 చివరి భాగంలో పరమపూజనీయ శ్రీ గురుజీ ఒక ధర్మ గురువుగా హైద్రాబాద్ సందర్శించారు. ఆ తర్వాత కొన్నాళ్ళకు యాదవ్‌రావ్‌జీ బెల్గాం నుండి శ్రీ గజానన్ కేశవ సాఠేని, సతారా నుండి శ్రీ సద్భావు కులకర్ణిని ప్రచారకులుగా హైద్రాబాదుకు పంపించారు. వీరిద్దరి తోడ్పాటుతో శ్రీ కామత్ నిదానంగా తమ కార్యక్రమాలు ఉధృతం చేశారు.

శ్రీధర్ కామత్ తర్వాత శ్రీ బాలకృష్ణ కాలే విభాగ్ ప్రచారక్ బాధ్యత స్వీకరించారు. హైద్రాబాద్ సంస్థానంపైన జరిగిన పోలీసు చర్య అనంతరం 1949 నుండి సంఘ కార్యక్రమాలు ఆర్.యస్.యస్ పేరుతోనే ప్రారంభం అయ్యాయి. కాలేగారి తర్వాత శ్రీ రాంశ్రీపాద సాఠే ఆ బాధ్యత స్వీకరించారు. వారు 1949లోనే బొంబాయి నుండి వచ్చారు. 1953 తర్వాత హైద్రాబాద్ సంస్థానంలోని 8 తెలుగు జిల్లాలు సంఘ దృష్ట్యా ఆంధ్రప్రాంతంలో కలపడం జరిగింది. ఇలా కలపడం జరిగిన తర్వాత తొలి

అంతమందిని పడవలలో దాటించి అక్కడకు చేర్చాలి. వారంతా ప్రాతఃకాలాన్నే లేచి కాలకృత్యాలు తీర్చుకొని సంఘస్థాన్‌లో పాల్గొనడానికి తయారైపోవాలి. ఇది ఇలా ఉండగా ప.పూ. శ్రీగురుజీని లాంచిమీద ప్రయాణం చేయించి శిబిర స్థలానికి చేర్చాలి. ఇవన్నీ రిస్కుతో కూడిన పనులు. ఊళ్ళోనే ఎక్కడో మైదానంలో పెట్టుకొంటే ఈ బాధలు అన్నీ ఉండవు అన్న అభిప్రాయమే ఎక్కువమంది వెలిబుచ్చారు. కాని బాపూరావ్‌జీ చెప్పారు-

సంఘ కార్యక్రమం ద్వారా స్వయంసేవకులకు శిక్షణ లభించాలి. ఎంతటి సవాళ్ళు ఎదురైనా పూనిక వహించి పని చేసి పరిష్కరించుకోగలం అనే మానసిక సంసిద్ధత ఏర్పడాలి. అది అనుభవం ద్వారాగాని లభ్యం కాదు. ఆ అనుభవం కల్పించాలి. మనం సంఘస్థాన్‌లో మాస్ ఫైటింగ్‌కు సంబంధించిన ఆటలు ఆడుతుంటాం. దెబ్బలు తగులుతుంటాయి, రక్తం కారుతుంటుంది- అయినా ఆడటం మానం. అంత కష్టపడి అలాంటి ఆటలు ఆడకపోతేనేం? అని అనుకొంటే ఆ మేరకు శిక్షణ కొరవడినట్లే, ఒక ఛాలెంజిగా తీసుకొని ఈ శిబిరం నిర్వహిద్దాం. ఇందువల్ల స్వయంసేవకులకు అనేక అనుభవాలు వస్తాయి. ఎంత క్లిష్టమైన పనినైనా విజయవంతంగా నిర్వహించగలమనే ఆత్మవిశ్వాసం ఏర్పడుతుంది.

కేవలం మాటలు చెప్పడమే కాదు, ఆయన ముందు నిలబడి మార్గదర్శనం చేశారు. ఏ పని ఎవరు చేయాలి అనేది ముందుగా చేసుకొన్న యోజన ప్రకారం తు.చ. తప్పక నెరవేరేట్లు పర్యవేక్షణ చేశారు. వారు స్వయంగా నిక్కరు, బనియన్ ధరించి పలుగుపార పట్టుకొని గ్రౌండులో పనికి ఉపక్రమించారు. అది చూచి స్వయంసేవకులు తమ సర్వశక్తులు ఒడ్డి పనిలో నిమగ్నమైపోయారు. ఆ మాత్రం ప్రేరణ చాలు.

ఒక్కొక్క కార్యకర్త పదిమంది పెట్టుగా రాత్రింబవళ్ళు పని చేసి అనుకొన్న సమయానికి శిబిరం నిర్మించారు. శిబిరం అంతా పూర్తి అయ్యాక దివ్యమైన ఆ దృశ్యం చూస్తుంటే కృష్ణమ్మ ఒడిలో దేదీప్యమానమైన దీపకాంతులతో ఓ భవ్యమైన శిశువు ఒదిగి కూర్చున్నదా అనిపించింది.

శిబిరంలోకి స్వయంసేవకులను చేరవేయడానికి లాంచీలు సిద్ధమైపోయాయి. పదమూడువందల మంది స్వయంసేవకులు కృష్ణమ్మ ఒడిలో ప్రకృతి రమణీయకంగా శోభిల్లుతున్న ఆ లంకలో చేరిపోయారు. పూర్తిగా తెల్లవారక ముందే కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. శారీరక కార్యక్రమాల నిర్వహణలో చండశాసనుడని పేరొందిన శ్రీరాం సాఠే శిబిర ముఖ్యశిక్షక్‌గా సంఘస్థాన్ కార్యక్రమాలు నిర్వహించారు. కష్టం అంతా మర్చిపోయి స్వయంసేవకులు ఆనందానుభూతిని పొందారు. యోజన ప్రకారం పూజ్య గురుజీ శిబిరం సందర్శించి స్వయంసేవకులకు మార్గదర్శనం చేశారు.

శిబిర సమారోపోత్సవం సువిశాలమైన పి.డబ్ల్యూ.డి మైదానంలో ఏర్పాటు చేశారు. స్వయంసేవకులంతా లాంచీలలో కృష్ణానదిని దాటి ఈవలి ఒడ్డుకి చేరి బారులు తీరి సంఘస్థాన్‌లో పొందిన శిక్షణను ప్రదర్శిస్తూ అత్యంత క్రమశిక్షణతో పూర్తి గణవేషతో కవాతు చేసుకొంటూ శోభాయాత్ర నెరపుతూ పి.డబ్ల్యూ.డి మైదానానికి చేరారు. ప.పూ శ్రీగురుజీ స్వయంసేవకులను, ఉత్సవానికి విచ్చేసిన పెద్దలను ఉద్దేశించి ఎంతో స్ఫూర్తిదాయకంగా ప్రసంగించారు. ఆ శిబిరంలో పాల్గొన్నవారిలో ఇప్పుడు కొందరు జీవించి ఉన్నారు, కొందరు లేరు. అప్పుడప్పుడు కలుసుకొన్నప్పుడు ఆ శిబిరానికి సంబంధించిన మధుర స్మృతులు నెమరు వేసుకొంటూ పులకితాంతరంగులవుతుంటారు. స్వయంసేవకులకు శిక్షణ గరపటంలోను,

యోజనా బద్ధంగా కార్యం నిర్వహించడంలోనూ బాపూరావ్‌జీకి గల నేర్పుకు ఈ శిబిరం ఒక దర్పణంలాంటిది.

కాస్తశిక్షణ ఇస్తే బౌద్ధిక్ కార్యక్రమాలు చక్కగా తీసుకోగలుగుతారు అనిపిస్తే అలాంటి కార్యకర్తలను ఎంపిక చేసుకొని వారికి కార్యక్రమాలు అప్పగించేవారు. బౌద్ధిక్ కార్యక్రమాలు క్రొత్తగా తీసుకొనేప్పుడు కాస్త బెరుకు, ఇంకాస్త వణుకు, మరికాస్త మతిమరుపు ఉండటం గమనిస్తాం. బాపూరావ్‌జీ ఎంతో జాగ్రత్తగా ఆ బెరుకు పోగొట్టి ఉత్సాహపరిచి పొరపాట్లు సరిదిద్దేవారు.

అయోగ్యః పురుషోనాస్తి

యోజకస్తత్రదుర్లభః

మనుష్యుల్లో అయోగ్యుడెవడూ ఉండడు. కాని యోజకుడు దొరకడమే దుర్లభం అని పై శ్లోకానికి అర్థం. దీనిలో మొదటి వాక్యంపైన పూర్తి విశ్వాసం ఉంచి రెండో వాక్యంలో దుర్లభం అనే మాటకు 'కాదు' అని సవరణ జోడించిన మహనీయుడు శ్రీ భావ్‌రావు దేవరస్. ఆయనకు సచివుడు, సారధి అనదగిన వారు శ్రీ బాపూరావ్ మోఘే. యోజకులు దొరకడం దుర్లభం కాదు అని వీరిద్దరూ ఋజువుచేశారు. యోజకులు, ప్రయోజకులు, విజయశీలురు అనదగిన కార్యశూరులనెందరినో నిర్మించిన మహనీయులు వీరు.

## కథ శిక్షణలో భాగం

1959 మే మాసంలో బందరులో ఓ.టి.సి జరిగింది. భారతప్రధానిగా నెహ్రూగారు భారతీయాత్మకు విరుద్ధమైన విధానాలు అనుసరిస్తున్నందున ప.పూ. శ్రీగురూజీ చాలా వ్యధ చెందారు. రాజకీయనాయకుల పేర్లు చెప్పి విమర్శించడం గురూజీకి అలవాటు లేదు.

కాని ఆ ఓ.టి.సి లో మాత్రం నెహ్రూగారి విధానాలను తీవ్రంగా విమర్శించారు. ఆ ఓ.టి.సి లో గురూజీ గావించిన మూడు బౌద్ధిక్‌లు చిరస్మరణీయాలు. మరీ మూడవ రోజునైతే బౌద్ధిక్ అంశాలు వ్రాయాలని కూర్చున్నవారు ఏమాత్రం అందుకోలేకపోయారు. హిమాలయ సానువుల నుండి జాలువారుతున్న గంగమ్మ ప్రవాహవేగాన్ని గుర్తుకు తెచ్చిన ఆ వాక్ఝురి స్వయంసేవకుల మనోభావాలను కర్తవ్యోన్ముఖంగా పరుగులు తీయించింది. బందరులో ఓ.టి.సి ఏర్పాట్లకు సంబంధించి మొదటి రెండు మూడు రోజులు కాస్త ఇబ్బంది ఎదురైనప్పటికి బాపూరావ్‌జీ మార్గదర్శనంలో ఆ ఇబ్బందులు వెంటనే సర్దుబాటు అయ్యాయి.

ఆ ఓ.టి.సి లో నేను 'వివేకానంద' కథ చెప్పాను. వివేకానందుని చరిత్ర సమగ్రంగా చదివి బాగా తయారై నేను కథ చెప్పడం ప్రారంభించాను. చికాగో సభల ఉపన్యాసాల దగ్గరికి రాకుండానే సమయం అయిపోయిందని ఈల ఊదారు. కథ అంత అసమగ్రంగా పూర్తి చేయవలసి వచ్చినందుకు బాధపడ్డాను. ఆ రోజు బాపూరావ్‌జీని కలిసినప్పుడు,'కథ అంతా బాగా చెప్పావు. కాని ఏ అంశాలకు ప్రాముఖ్యం ఇవ్వాలి అనేది ముందుగానే నిర్ణయించుకొని ఇచ్చిన సమయంలో ఆ అంశాలన్నీ స్పృశించే రీతిగా తయారుం కావాలి. బౌద్ధిక్,కథ,గోష్ఠి,చర్చ-ఏది తీసుకొన్నప్పటికి స్వయంసేవకులకందించే శిక్షణలో అది భాగం అనే సంగతి గుర్తించాలి. కనుక కథలోని అంశాలు ఎంపిక చేసుకొనేప్పుడు అనగా ఆ కథానాయకుని గుణాలు విశ్లేషించేప్పుడు ఆయా ఘట్టాలు స్వయంసేవకుని మనోబలం, ఆత్మవిశ్వాసం, కార్యదీక్ష పెంచేందుకు దోహదపడేవి చూచి ఎంపిక చేసుకోవాలి' అంటూ చక్కటి మార్గదర్శనం చేశారు. వారి మార్గదర్శనంలో

సంఘ సిద్ధాంతాన్ని విడమర్చి చెప్పగల సామర్థ్యం అలవరచుకొన్న కార్యకర్తలెందరో ఉన్నారు.

## వీడని రుగ్మత

1955 నుండే బాపూరావ్‌జీ ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. ఎన్నో రకాల వైద్యాలు చేయించారు. అయినా గుణం కన్పించలేదు. ఇక ప్రాంత ప్రచారక్ బాధ్యతలు నిర్వహించడం సాధ్యంకాదని భావించారు. తమ తర్వాత ఆ కార్యభారాన్ని ఎవరికి అప్పగించాలా అని బాగా ఆలోచించారు. సంయమనశీలి, 'సంఘటన' శాస్త్రకోవిదుడు అయిన శ్రీ సోమయ్య భుజస్కంధాలపై ఆ బాధ్యతపెట్టి 1959 మచిలీపట్నం ఓ.టి.సి అయిపోయాక నాగపూర్ వెళ్ళిపోయారు.

కొంతకాలం ఇండోర్‌లో ఉన్నారుగాని మొదటి నుండి కుటుంబంతోటి మమత్వానురాగాల కంటె సమాజంతోటి గల సమరస భావమే వారి జీవన నౌకను ముందుకు నడిపిస్తూ వచ్చింది. 1962లో ుక్నోకు చేరారు. ఆ తర్వాత ఢిల్లీ కేంద్రంగా 'రాష్ట్రధర్మ' ప్రచురణకు సంబంధించిన వ్యవహారాలు చూశారు. 1965 నుండి అఖిలభారతీయ బౌద్ధిక్ ప్రముఖ్ బాధ్యత స్వీకరించారు. అఖిలభారతీయ బౌద్ధిక్ ప్రముఖ్ బాధ్యతలో దేశవ్యాప్తంగా చురుకుగా పర్యటనలు కొనసాగించారు. 1970లో ుడివాడ ఓ.టి.సి లోకూడ వారి బౌద్ధిక్ వర్గ జరిగింది 1971,72 ుంవత్సరాలలో నాగపూర్‌లో మూడవ సంవత్సరం ఓ.టి.సి శిక్షార్థులకు ాద్ధిక్ తీసుకొన్నారు(ఈ బౌద్ధిక్‌లలోని అంశాలు అనుబంధం 1లో ూడండి.)

1980లో ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. చిన్నపాటి కుదుపు జరిగినా ముక్కు వెంట రక్తం వచ్చేది. శరీరంలో ఎక్కడైనా చర్మానికి గట్టిగా వత్తిడి తగిలితే అక్కడ రక్తం వచ్చేది. అదొక విచిత్రమైన వ్యాధిగా పరిణమించింది. పర్యటనల భారం ఏమాత్రం తట్టుకోలేని స్థితి దాపురించింది. పీడని రుగ్మతతో బాధపడుతూ ఢిల్లీ కార్యాలయంలోనే 25-1-94నాడు తుదిశ్వాస విడిచారు.

భారతమాత చరణసేవలో మొగ్గతొడిగి వికసించి నలుదిశల సుగంధాలను విరజిమ్మిన మరో కుసుమం భూమాత ఒడిలో చేరింది.

# అడుగులో అడుగేద్దాం

## సుఖాలకు అతీతంగా

50 దశకంలో ఆర్.యస్.యస్ వనరులు చాలా పరిమితంగా ఉండేవి. ప్రచారక్ జీవితం అంటే ఆదర్శమైన జీవితం కాబట్టి ఖర్చు విషయంలో బహు జాగ్రత్తగా ఉండేవారు. ఆరోజులలో ప్రచారక్‌లు ఎంత నిరాడంబరంగా జీవించేవారంటే ప్రాంతప్రచారక్ సహితం సైకిల్ మీదనే తిరిగేవారు. సంపన్న కుటుంబాలనుండి ప్రచారక్‌గా వచ్చిన వారు సహితం సుఖాలను గూర్చి ఆలోచించక ఆదర్శమే ప్రధానంగా జీవించేవారు. వారు చెప్పే మాటలను బట్టిగాక వారి ఆచరణ,నడవడిక ద్వారానే హృదయాలను జయించాలని విశ్వసించేవారు. ప్రచారక్ ఖర్చు నెలకు 30 రూపాయులని రిమితి ఉండేది. ఈ 30 రూపాయులు కూడా ఎక్కువ భాగం ప్రయాణాలకు ఖర్చు అయ్యేది. స్వయంసేవకుల గృహాలతో గల నిత్య సంపర్కం కారణంగా ఆ కుటుంబాలలో ప్రచారక్ కూడా ఒక సభ్యుడే అన్న

రీతిలో అనురాగం సంపాదించి భోజన సదుపాయానికి బాధలేకుండా చేసుకొనేవారు. వాస్తవానికి సమాజసేవకుల క్షేమం సమాజం బాధ్యతే కదా! సమాజంలో ఈ భావన పాదుకొల్పడం కూడా సంఘ కార్యంలో భాగమే. అయితే ఆదర్శవంతమైన జీవితం అందుకు అత్యంత ఆవశ్యకం.

ఆనాటి ప్రచారక్ ఖర్చుల విషయంలో ఎంత జాగ్రత్తపాటించే వారో తెలుసుకోవడానికి బాపూరావ్‌జీ జీవితం నుండి ఒక ఉదాహరణ చెపుతాను. ప్రాంతప్రచారక్‌గా ఉన్న బాపూరావ్‌జీ క్షౌరం చేయించుకోవడానికి క్షౌరశాలకు వెళ్ళేవారు. గడ్డంతో క్షౌరం చేస్తే ఎంత,గడ్డం చేయకుండా కేవలం క్షౌరానికి ఎంత అని బేరం చేసి గడ్డం చేయించుకోకుండా క్షౌరం పూర్తి చేయించుకొని కార్యాలయానికి వచ్చి కార్యాలయంలో తన రేజరుతో గడ్డం చేసుకొనేవారు. ఆకాస్త డబ్బు మిగిలినా మిగిలినట్లే. సమాజ కార్యానికి ఉపయోగపడుతుంది. ఇదీ ఆనాటి ప్రచారకుల ఆలోచన తీరు.

1958 ప్రాంతంలో గోదావరి పుష్కరాల సమయంలో గోహత్యానిరోధ ఉద్యమానికి పుష్టికూర్చడానికి తత్సంబంధిత సాహిత్యం ప్రజలకు అందించాలని 'గోమాత నెలా రక్షించాలి' అన్న పుస్తకం సంఘం ప్రింటు చేయించింది. ఆ పుస్తకాలు అక్కడి భక్తజనానికి సకాలంలో అందజేయడానికి గాను జగన్మోహనరావుకు ఆ పుస్తకాల కట్టలు ఇచ్చి రాజమండ్రికి పంపించారు. ఆయన రాజమండ్రి నుండి తిరిగి వచ్చాక ఖర్చులు వ్రాసిన కాగితం, మిగిలిన డబ్బు అప్పజెప్పాడు. ఆ ఖర్చులలో ఒకచోట 'కాఫీ ఖర్చు' అని వ్రాసి ఉంది. అది ఎత్తి చూపిస్తూ బాపూరావ్‌జీ 'సంఘ ఖర్చులో కాఫీ ఖర్చు రాకుండా ఉంటే బాగుంటుంది' అన్నారు. ఖర్చుల విషయంలో ఆనాటి జాగ్రత్త అదీ!

## ప్రచారక్‌ది గౌరవస్థానం

1958లో విజయవాడలో మూడురోజులపాటు హేమంత శిబిరం నిర్వహించబడింది. శిబిరం ఏర్పాటు అంతా యస్.కె.పి.వి. హైస్కూలులో జరిగింది. ఈ హేమంత శిబిరంలో ప.పూ. శ్రీగురూజీ పాల్గొన్నారు. ఈ సందర్భంలో జింఖానా గ్రౌండ్స్‌లో సార్వజనికోత్సవం కూడా నిర్వహించబడింది. సంఘ సైద్ధాంతిక భూమికను వివరిస్తూన్న గంభీరమైన బౌద్ధిక్ గురూజీ గళం నుండి వెలువడింది. ఈ సార్వజనికోత్సవంలో స్వయంసేవకులు వేదికను ఎంతో అందంగా తీర్చిదిద్దారు. ఏర్పాట్లు కూడా చాలా చక్కగా జరిగాయి.

సహజంగా స్వయంసేవకుల ప్రవృత్తి ఎలా ఉంటుందంటే కార్యక్రమం సజావుగా జరగడానికి కావలసిన ఏర్పాట్లన్నీ ఎంత కష్టమైనా సరే ఒళ్ళు విరుచుకు పని చేసి పూర్తి చేస్తారు. వేదిక నిర్మాణంలోగాని, ఏర్పాట్లు సరి చూసుకోవడంలోగాని అవసరం అయితే నిద్ర, ఆహారం మాని అయినా సరే సక్రమంగా జరిగేట్లు చూస్తారు. కాని కార్యక్రమం అయిపోగానే మాత్రం ఎవరికి వారు ఇంటి ముఖం పడతారు. ఒకటి రెండుగంటలు ఆలస్యమైనప్పటికి సామాన్లన్నీ సర్దిపెట్టి అప్పగించి వెళ్దామన్న ప్రశాంతమైన ఆలోచన ఉండదు. అందువల్ల కార్యకర్త లేమికొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. సామాన్లన్నీ సర్ది అప్పజెప్పవలసిన బాధ్యత ఉన్న అధికారులకు చిరాకనిపిస్తుంది. ఆరోజు సార్వజనికోత్సవం పూర్తి కాగానే అప్పుడు ప్రచారకులుగా ఉన్న డి.కృష్ణమూర్తిగారు, వై.సి.రంగారెడ్డిగారు కూడా అలిసిపోయిన కారణంగానో లేక మరో పని అందుకోవలసి ఉన్న కారణంగానో సభాస్థలి నుండి వెళ్ళిపోయారు. ఇక సామాను సర్దుకొనే పని అంతా శ్రీనివాస శర్మగారి నెత్తిన

పడింది. నిజంగానే ఆయన చాలా కష్టపడవలసి వచ్చింది. ఆ మర్నాడు బైఠక్‌లో ఈ ప్రచారకులపైన శ్రీనివాసశర్మగారు రుసరుసలాడారు. అది బాపూరావ్‌జీ చెవిన పడింది. బాపూరావ్‌జీ శ్రీనివాసశర్మగారిని పిలిచి, 'ఒక్కోసారి లోపాలు ప్రతి వారు చేస్తారు. అందువల్ల కొందరికి కష్టం కలిగేమాట కూడా వాస్తవమే. అలాంటి లోపాలు ఇక ముందు జరగకుండా చూచుకోవాలేగాని ప్రచారకులను తేలికగా మాట్లాడటం భావ్యం కాదు. ప్రచారక్ అంటే భుక్తికి లేక వచ్చిన వాడుకాదు. ఎన్నో సుఖాలు వదిలిపెట్టుకొని సమాజ పరమేశ్వరుని సేవకై తరలి వచ్చిన ఉత్తమవ్యక్తులు ప్రచారకులు. ఎట్టి పరిస్థితిలోను ప్రచారక్‌లను కించపరచరాదు. సంఘ వ్యవస్థలో వారిది చాలా గౌరవమైన స్థానం అని మర్చిపోకూడదు' అని మందలించారు. శ్రీ శర్మగారు కూడా అంతకు ముందు కొంతకాలం ప్రచారక్‌గా ఉన్నవారే కాబట్టి ఆ మాటలు త్వరగానే చెవికెక్కాయి.

## సుగ్రీవాజ్ఞ

1956 సెప్టెంబర్ 2వ తేదీన బాపూరావ్‌జీ నన్ను కార్యాలయానికి పిలిపించారు. నేను వారి గదిలోకి వెళ్ళి కలవగానే నాచేతికి టైపు చేయబడిన ఒక కాగితం అందిస్తూ, 'ఇది నీ అపాయింటుమెంటు ఆర్డరు. వరంగల్లు ఆంధ్ర విద్యాభివర్ధని బహుళార్థసాధక పాఠశాలలో నీవు టీచర్‌గా చేరాలి. వెళ్ళి ఈ ఆర్డరు హెడ్మాష్టరుగార్కి చూపించి స్కూలులో చేరు. కార్యదర్శిగారు మన స్వయంసేవకులే' అన్నారు.

'ఎప్పుడు బయలుదేరాలి?' అడిగాను

'ఈ రాత్రికే. రేపుప్రొద్దునే డ్యూటీలో చేరిపో'

'నేను కాలేజీలో రిజిగ్నేషన్ లెటర్ ఇవ్వాలి కదా?' అన్నాను.

'అది ఇప్పుడు వ్రాసి నాకివ్వు. నేను పంపిస్తాను' అన్నారు.

అప్పుడు నేను యస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్ కళాశాలలో కామర్సు డిపార్టుమెంటులో అధ్యాపకుడుగా పని చేస్తున్నాను.

ఇంటికి వెళ్ళి మా నాన్నగారితో 'ఈ రోజు రాత్రి నేను వరంగల్లుకు వెళుతున్నాను. అక్కడ హైస్కూల్లో నాకు ఉద్యోగం వచ్చింది' అని చెప్పాను. నాకున్న పెద్ద సౌలభ్యం ఏమిటంటే మా నాన్న గార్కి చదువురాదు. కాలేజీలో ఉద్యోగం మానేసి హైస్కూల్లో చేరడం ఏమిటి అన్న మీమాంస తలెత్తలేదు. అయితే 'ఉన్న ఊళ్ళో ఉద్యోగం వదిలి పెట్టుకొని పరాయి ఊరికి పోవడం ఎందుకురా?' అని మాత్రం అన్నారు.

బాపూరావ్‌జీ మాట అంటే కార్యకర్తలలో చాలామందికి సుగ్రీవాజ్ఞలా ఉండేది. నేను ఆ రాత్రికే బయలుదేరి మర్నాడు ఉదయానికి వరంగల్లు కార్యాలయం చేరాను.

1953 కు ముందు సంఘ దృష్ట్యా తెలంగాణా ప్రాంతం ఆంధ్రప్రాంతంలో కలిసి లేదు. తొలిసారిగా 1953లో విజయవాడలో జరిగిన ఒ.టి.సి కి తెలంగాణా నుండి కూడా స్వయంసేవకులు శిక్షార్థులుగా వచ్చారు. అక్కడి నుండి ప్రాంతప్రచారక్‌గా బాపూరావ్‌జీయే తెలంగాణా జిల్లాల కార్యభారం కూడా స్వీకరించారు. ఆంధ్రప్రాంతం నుండి నల్లగొండ, ఖమ్మం, వరంగల్లు, పాలమూర్ జిల్లాలకు ప్రచారకులను పంపించారు. అప్పటి నుండి ఆ జిల్లాల పైన బాపూరావ్‌జీ మనస్సు కేంద్రీకరించారు. ప్రచారకులుగా వెళ్ళగల్గితే ప్రచారకులుగాను, ఉద్యోగులుగా వెళ్ళగలిగితే ఉద్యోగులుగానూ కార్యకర్తలు తెలంగాణా జిల్లాలకు చేరి అక్కడ సంఘకార్యవిస్తరణకు తోడ్పడాలని బాపూరావ్‌జీ యోజన చేశారు. 1956లో కేవలం ఒకటి రెండు

మాసాల వ్యవధిలో అయిదారుగురు కార్యకర్తలు అలా వరంగల్లు చేరారు. కొచ్చికృష్ణమూర్తిగారు ప్రచారక్‌గాను, శ్రీ శఠగోపాచార్య, శ్రీ వీరంరాజు కృష్ణమూర్తి ఆయుర్వేద కళాశాల లెక్చరర్లుగాను, రేవా కోటేశ్వరరావు, యల్.యస్.రాజు, నేను హైస్కూలు టీచర్లుగానూ ఒకే కాలంలో అక్కడ చేరాం. అనుభవజ్ఞులైన కార్యకర్తలంతా ఒకచోట చేరిన కారణంగా సంఘ కార్యవ్యాప్తిలో సౌలభ్యం చేకూరింది. ఉద్యోగం అన్నది ఒక మిష మాత్రమే. శక్తి, యుక్తులన్నీ సంఘకార్యానికి ఉపయోగపడలెననే పట్టుదలతో ఎంతో సమయం ఇచ్చి ఈ కార్యకర్తలంతా పని చేశారు. అంతకు ముందు వరంగల్లు జిల్లా ప్రచారక్‌గా పనిచేసిన శ్రీ కె.శంకరరావుగారు సంఘకార్యానికి చక్కని పునాది వేశారు. ఆ తర్వాత అక్కడ చేరిన ఈ కార్యకర్తలంతా దివ్యమైన సౌధం నిర్మాణం చేశారు. వరంగల్లు జిల్లాలో మారుమూల గ్రామాలైన జాఫర్‌గడ్, ఇప్పగూడెం వంటి ప్రదేశాలకు కూడ సంఘకార్యం ప్రాకిందంటే ఈ కార్యకర్తలందరి సమిష్టి కృషివల్లనే. ఆరోజుల్లో కొందరు మంచిమంచి ప్రభుత్వోద్యోగాలు వదులుకొని వచ్చి ఉదరపోషణార్థం ఏదో చిన్న వ్యాపకం పెట్టుకొంటూ ఎక్కువ సమయం సంఘానికిచ్చారు. కొందరైతే సంపూర్ణంగా సంఘకార్యానికే తమ సమయం ఇచ్చిన వారున్నారు. కొచ్చికృష్ణమూర్తిగారు వరంగల్లు జిల్లాలో పర్యటించని ప్రదేశం లేదు. ఇప్పటివలె ఆనాడు మంచి ప్రయాణసాధనాలు కూడా ఉండేవికావు. వరంగల్లు పట్టణంలో తిరగడానికి ఒక సైకిలు, పల్లెలకు చేరడానికి బస్సులు, అవి లేనిచోట కాలి నడక. అయినా ఎన్ని మహత్తర కార్యాలు నిర్వహించబడ్డాయి! అందుకే 'క్రియాసిద్ధి సత్వేభవతి మహతాన్నోపకరణే' అన్నారు పెద్దలు. యోజనాబద్ధంగా తెలంగాణ జిల్లాలలో సంఘవ్యాప్తికి బాపూరావ్‌జీ కృషి చేశారు.

## వ్యక్తిగత శ్రద్ధ

శ్రీ యస్.వి. సుబ్బరాజుగారు చాలా చిన్న వయస్సు నుండి సంఘానికి వస్తున్న కార్యకర్త. సంఘం నిర్వహిస్తున్న భారత ముద్రణాలయం (ప్రింటింగ్ ప్రెస్) పని మొత్తం చాలాకాలం ఈయన భుజస్కంధాలపైన నడుస్తుండేది. ఆయన భారత ముద్రణాలయంలో చేరకముందు 1954 లో హిందీ ప్రచారసభలో పని చేస్తుండేవారు. అప్పుడు వారి భుజంపైన ఒక మెషీన్ పడి గాయం అయింది. రెండురోజులుగా ఆయన శాఖకు రావడం లేదనే విషయం బాపూరావ్‌జీకి తెలిసింది. రోజూ శాఖకు వచ్చే వ్యక్తి రెండు రోజులు వరుసగా రాకపోయేప్పటికి ఏమైందో తెలుసుకొని రమ్మని ఒక స్వయంసేవకుని సుబ్బరాజుగారి ఇంటికి పంపించారు. విషయం తెలుసుకొని స్వయంగా బాపూరావ్‌జీయే పరామర్శించడానికి వచ్చారు. రోజూ సంఘస్థాన్‌కు వచ్చే స్వయంసేవక్ ఒక్కరోజు రాకపోయినా వాళ్ళ ఇంటికి వెళ్ళి ఆ స్వయంసేవకుని కలవడం అనేది గటపద్ధతి బాగా అమలులో ఉన్న రోజుల్లో ప్రతి శాఖలోనూ జరుగుతుండేది. విషయమేమిటో తెలుసుకొని మన తోడ్పాటు ఏదైనా అవసరమైతే అందించాలి అని సంఘస్థాన్‌లో చెప్తుండేవారు. అది ఆచరణలో చూపేందుకు బాపూరావ్‌జీ మార్గదర్శనం చేసేవారు. ఇలా అనేక సందర్భాలలో జరిగింది.

1955 ఫిబ్రవరి మాసంలో నేను జబ్బు పడ్డాను. అప్పుడు నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి.కాం(ఆనర్స్) ఆఖరు సంవత్సరం చదువుతున్నాను. పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. యూనివర్శిటీ హాస్టల్‌లోనే ఉండి చదువు కొనసాగించాలంటే జబ్బుతో బాధపడుతున్న నాకు మందు అందివ్వాలన్నా, మంచినీళ్ళు అందివ్వాలన్నా పరిచర్య చేసేవారెవరూ ఉండరు. పోనీ ఆ ఏడాది

పరీక్షకు వెళ్ళకుండా మానేద్దామా అంటే మా ఇంటి ఆర్థిక పరిస్థితి అందుకు అనుకూలంగాలేదు. ఎంత అవస్థపడి అయినా సరే పరీక్షకు కూర్చుని ప్యాసయిపోయి ఏదో ఒక ఉద్యోగం చూచుకొంటేనేగాని గడిచేట్లులేదు. పరిస్థితి అదీ! అప్పుడు బాపూరావ్‌జీ విశాఖ పర్యటనకు వచ్చారు. నా విషయం అంతా విన్నాక శ్రీ వి. యల్. యన్. వెంకట్రామయ్యగారిని పిలిచి 'ఏప్రిల్‌లో పరీక్షలు అయిపోయేవరకు గోపిరెడ్డి మీ ఇంట్లో ఉండి చదువుకొంటాడు. పరీక్షలప్పుడు మీతోపాటు యూనివర్శిటీకి కారులో తీసుకుపోయి తీసుకొస్తుండండి' అని పురమాయించారు. అప్పుడు వెంకట్రామయ్యగారు ఫిలాసఫీ ఆనర్స్ చదువుతుండేవారు. డాక్టరుకు చూపించడం, దగ్గర ఉండి పరీక్షలు వ్రాయించడం వరకు స్వయంగా ఆయన సహాయపడేవారు. వారెంతో ఆస్తిపరులు. నేను కడుపేదవాడిని. స్వయంసేవకులలో ఈ తారతమ్యం లేదు. వారు నా పెద్ద అన్నయ్యవలెనే ఆదుకొన్నారు. బాపూరావ్‌జీ స్వయంసేవకులపట్ల ఎంత వ్యక్తిగత శ్రద్ధ తీసుకొనేవారో చెప్పడానికే ఈ ఉదాహరణ.

బాపూరావ్‌జీ ప్రాంతప్రచారక్ బాధ్యతలు శ్రీ సోమయ్యగార్కి అప్పగించి ఆంధ్ర ప్రదేశ్ విడిచి వెళ్ళిన తర్వాత కూడా నాబోటి కార్యకర్తలు కొందరు వారితో ఉత్తరప్రత్యుత్తరాలు నెరపుతుండేవారు. ఉత్తరం వ్రాస్తే వారు ఎక్కడ ఉన్నా సరే తప్పక సమాధానం వ్రాస్తుండేవారు. 1963 డిశంబర్ మాసంలో నాకు ఊపిరితిత్తి ఆపరేషన్ జరిగింది. ఆ సందర్భంలో వారికి ఉత్తరంవ్రాస్తే వెంటనే జవాబు వ్రాస్తూ-

'నీకు పెద్ద ఆపరేషన్ జరగబోతోందని తెలుసుకొని చాలా విచారించాను. అయితే నీవు ఈ కష్టాలనుండి శీఘ్రకాలంలోనే బయటపడి ఎప్పటివలె ఆరోగ్యవంతుడవై సహజసిద్ధంగా ఎప్పుడూ నీ మొఖాన

తొణికిసలాడే మందహాసంతో సంఘ పనికి ఉపక్రమిస్తావని, ఆవిధమైన శక్తి ఆ పరాత్పరుడు నీకు ప్రసాదించాలని మనసారా కోరుకొంటున్నాను' అంటూ ఉత్తరం వ్రాశారు. జబ్బుతో మంచంపై పడి ఉన్న నాకు ఆ ఉత్తరం ఎంతో ఊరటను, ఆత్మబలాన్ని అందించింది. పరమేశ్వరుని కృపవల్ల అనతి కాలంలోనే నేను మళ్ళీ కార్యక్షేత్రానికి తిరిగి వచ్చాను. బాపూరావ్‌జీ వ్యక్తిగత శ్రద్ధకు పాత్రులైన కార్యకర్తలెందరో ఉన్నారు.

## పుస్తకాలంటే ప్రాణం

ఆంధ్రప్రదేశ్‌కు 1947లో ప్రాంత ప్రచారక్‌గా వచ్చేముందు బాపూరావ్‌జీ ఉత్తరప్రదేశ్ సహప్రాంతప్రచారక్‌గా ఉండేవారు. అప్పుడు వారు అలహాబాద్ కేంద్రంగా పనిచేసేవారు. సమాజంలోని వివిధ జీవనరంగాలలో అత్యుత్తమ స్థాయి వ్యక్తులతో బాపూరావ్‌జీ సంపర్కం పెట్టుకొన్నారు. విద్యాధికులతోను, మేధావులతోను పరిచయాలు పెంపొందించుకొని వారిని సంఘసంపర్కంలోకి తెచ్చారు. విశ్వవిద్యాలయంలోను, వివిధ కళాశాలలోను పని చేస్తున్న అధ్యాపకులు, విద్యార్థులు ఎందరో సంఘ సంపర్కంలోకి వచ్చారు. వ్యాపార రంగంలో ఉన్నవారిలో బహుకొద్ది మందితో మాత్రమే బాపూరావ్‌జీకి పరిచయాలుండేవి. మేధావి వర్గంలో పనిచేయడం అంటేనే వారికి సరదాగా ఉండేది. అందులోనూ సాయంశాఖల పనిమీదనే ఎక్కువ శ్రద్ధ చూపేవారు. విద్యార్థులు, అధ్యాపకులు మునుముందుగా సాయం శాఖలకు వచ్చేట్లు చూచి ఆ తర్వాత వీరిద్వారా ప్రభాత్ శాఖలు ప్రారంభింపచేసేవారు. బాపూరావ్‌జీ మాత్రం ప్రభాత్ శాఖలకు ఎక్కువగా వెళ్ళేవారుకాదు.

బాపూరావ్‌జీ అధ్యయనశీలి. ఆయన అలహాబాద్ విడిచివెళ్ళాక ఆయన స్థానంలో ప్రచారక్‌గా వచ్చిన బి.యన్ వరహద్ పాండే వంటి

ప్రచారకులు బాపూరావ్‌జీ అలహాబాద్ కార్యాలయంలో సేకరించిపెట్టిన పుస్తకాలు చూచి ఆశ్చర్యపోయారు. వివిధ అంశాలపైన వందలాది పుస్తకాలు సేకరించారు. కేవలం పుస్తకాలు కొనడమేకాదు వాటిని అధ్యయనం చేయడం విశేషం. మానవ మేధకు పదును పెట్టే పుస్తకాలు ఎన్నో ఆయన అధ్యయనం చేశారు.

బాపూరావ్‌జీ ఏ పని తలపెట్టినా ఆ పనికి సంబంధించిన ప్రతి చిన్న విషయం మొదలు పెద్దవిషయం వరకు అన్ని అంశాలు నిర్దుష్టంగా ఆలోచించి యోజన చేసేవారు. అంత యోజనాబద్ధంగా పని చేయడం అనేది బహుకొద్ది మందికి మాత్రమే సాధ్యమవుతుంది. అందుకే భావ్‌రావ్‌జీ 'నాకుగాని అవకాశం చిక్కితే బాపూరావ్‌జీని స్వతంత్ర భారత ప్రభుత్వంలో ప్లానింగ్ మినిష్టర్‌గా నియమిస్తాను' అనేవారు.

## గ్రంథ పఠనంలో 'హాయి'

గవర్నర్లు, ప్రధానమంత్రులు ఇంకా పెద్దపెద్ద పదవులలో ఉన్న వాళ్ళు తమ పని వత్తిడి నుండి బయట పడటానికంటూ 'హాలీడే' మీద వెళుతుంటారు. అప్పుడు అధికార సంబంధమైన పనుల జోలికి పోకుండా తమ కుటుంబ సభ్యులతోనో లేక ఇతర ఆత్మీయులతోనో ఆటపాటలలోను, వినోదకార్యక్రమాలలోను గడిపి హాయిని అనుభవిస్తుంటారు. నెహ్రూ అలా వెళుతూ ఉండేవారు. ఆతర్వాత ఇందిరాగాంధి ప్రధానమంత్రిగా ఉండగా కూడా జరిగింది. ఆతర్వాత రాజీవ్ గాంధీ ప్రధానమంత్రిగా ఉండగా అండమాన్ దీవుల దగ్గర ఎక్కడో సముద్ర మధ్యంలో ఓడలో ఉండి ఇలా హాయిని అనుభవించారని వార్తాపత్రికలలో చదివాం. ఇలాంటి పెద్దలేకాదు మధ్య తరగతి కుటుంబాలవారు కూడా తమస్థాయిని బట్టి ఇలాంటి హాయిని

పొందటానికి ఎలిఫెంటాకేవ్స్, సిమ్లా, కులూలోయ, అరకులోయ, ఊటీ ఇత్యాది ప్రదేశాలకు పోతుంటారు.

ఒకసారి శ్రీయుత దీనదయాల్ ఉపాధ్యాయ, నానాజీదేశ్‌ముఖ్, బాపూరావ్‌జీ -ఈ ముగ్గురూ హాలీడే మీద వెళదాం అనుకొన్నారు. గంగానదీతీరంలో ఒక ప్రశాంతమైన ప్రదేశం ఎంపిక చేసుకొన్నారు. వీళ్ళ హాలీడే స్వభావం వేరు. ఎంపిక చేయబడిన పుస్తకాలు తలా పది పదిహేను పట్టుకు పోయారు. ఆ ప్రశాంతప్రదేశంలో తలా ఒక మూలన చేరి ఏకాంతంగా ఆ పుస్తక పఠనంలో నిమగ్నమైపోయి తత్సంబంధిత విషయంపైన నోట్స్ తయారు చేసుకోవాలి. రాత్రికి ముగ్గురూ ఒక చోట చేరి ఆ నోట్స్‌పైన క్షుణ్ణంగా చర్చించాలి. ఆవిధంగా సామాజిక ప్రాముఖ్యంగల కొన్ని ప్రామాణిక ఉద్గ్రంధాల పఠనం పూర్తి చేయడంవారు ఈ హాలీడే ద్వారా అనుభవించ దలచిన 'హాయి'. సంఘ ప్రచారకులుగా తమ నిత్య జీవితంలో నిర్దిష్టమైన కార్యక్రమాలకు ఉరుకులు పరుగులమీద హాజరవుతూ అధ్యయనం చేయదగిన పుస్తకాలు చూడటానికి సమయం దొరకడంలేదని వారు ముగ్గురు ఏర్పాటు చేసుకొన్న హాలీడే అది. ఆ హాయిని అనుభవిస్తూనే ఒక రాత్రి అంతా కూర్చుని శ్రీ దీనదయాల్ ఉపాధ్యాయ 'సామ్రాట్ చంద్రగుప్త' వ్రాయడం పూర్తి చేశారు. ఇలాంటి హాలీడేల ద్వారా హాయిని పొందగలవారి సంఖ్య వందలలో పెరిగితే ఎంత బావుణ్ణు!

## నిశితమైన పరిశీలన

బాపూరావ్‌జీకి నిశితమైన పరిశీలనాశక్తి ఉండేది. ఉత్తరప్రదేశ్‌లో సహప్రాంత ప్రచారక్‌గా ఉంటూ శిక్షావర్గలో ప్రవేశద్వారం వద్ద ఒక నిక్కరు, బనియను వేసుకొని కూర్చుండేవారు. వర్గలో జరుగుతున్న ప్రతి పనిని విహంగవీక్షణంతో పరిశీలిస్తుండేవారు.

ఒకసారి స్వయంసేవకులతో పెద్ద శిబిరం నిర్వహించడం జరిగింది సమారోప్ రోజున అంతా సామానులు సర్దుకోవడంలో నిమగ్నమయ్యారు. పాకశాలలో పాత్రలు కన్పించలేదు. ఆరోజు ఉదయం వంట పూర్తి చేసేంత వరకు భద్రంగా ఉన్న పాత్రలు సాయంత్రానికి ఏమవుతాయ్? నల్గురు చూస్తుండగా బయటికి తీసుకుపోయేంత చిన్న వస్తువుకూడా కాదు. బాపూరావ్‌జీ పాకశాల చుట్టూ కలియ చూశారు. వంట పనివారందరిని అక్కడనే ఉండమన్నారు. ఆప్రక్కనే ఉన్న చెరువులో పాకశాలకు సమీపంగా ఉన్న ఓ మూలలో నీళ్ళలో దిగి కార్యకర్తలను వెతకమన్నారు. పాత్రలన్నీ లభ్యమయ్యాయి. ఆ ఘన కార్యం చేసిన వంటపని వారిని ఉచితరీతిన సత్కరించడం జరిగింది. మరోసారి అలాంటి పని చేయకుండా.

## గట్టివాడు

బాపూరావ్‌జీ ప్రసంగాలు అద్భుతంగా ఉండేవి. ప్రతి ప్రసంగం ఒక ముఖ్యమైన విషయాన్ని తెలియజేయడానికి ఉద్దేశించినదై ఉండేది. ఆ విషయాన్ని వదిలిపెట్టి పొరపాటున కూడా ప్రక్కకు పోయేవారు కాదు. ఆ ప్రసంగం పూర్తి అయ్యాక ప్రసంగ పాఠాన్ని ఒక చక్కటి వ్యాసంగా ప్రచురించడానికి తగినట్లుగా ఉండేది. ఆ భాష, ఆ శైలి, ఆ భావప్రకటన ఎంతో స్పష్టంగా ఉండి ఒడుదుడుకులు లేని ప్రవాహంలా సాగేది. తమ ప్రసంగంలో ఎన్నెన్నో క్రొత్త క్రొత్తవిషయాలు చెప్పి స్వయంసేవకుల మేధకు పదును పెట్టేవారు. విశేషమైన గ్రంధ పఠనం చేతను, అంతకంటే ముఖ్యంగా జీవితాలను చదివి అర్థం చేసుకొన్న అనుభవం చేతను వారి ప్రసంగాలలో మేధో విలాసనం, విశిష్ట విశ్లేషణ కనుపట్టేవి. సంఘస్వయంసేవకులు వారి ప్రసంగాలను పసందైన విందుగా భావించేవారు. బయటినుండి క్రొత్తగా వచ్చి విన్న పెద్దలు, 'పొట్టివాడైనా చాలా గట్టివాడయ్యా' అంటూ ప్రశంసించిన

సందర్భాలున్నాయి. ప్రచారక్‌గా రాకముందు బాపూరావ్‌జీకి ఉపన్యాసాలిచ్చే అలవాటు బొత్తిగాలేదు. ఆతర్వాతనే ఆ కళ అబ్బింది.

## ప్రయాగ సమ్మేళనం

1966సం.లో ప్రయాగలో జరిగిన విశ్వహిందూపరిషత్ సాధు సమ్మేళనం చరిత్రాత్మకమైనది. దేశమంతటి నుండి పదివేలమంది సాధువులు వచ్చారు. అంత పెద్ద సమ్మేళనానికి ఏర్పాట్లు చేయడం సాధారణమైన విషయం కాదు. అందులోను సాధువులు వారివారి పీఠాల సంప్రదాయాలను చాలా గట్టిగా పాటిస్తారు. ఎవరికి వారే గొప్ప అన్నట్లుగా ఉంటుంది వ్యవహారం. వీటన్నింటిని దృష్టిలో పెట్టుకొని వారికి సంతృప్తికరంగా ఏర్పాట్లుచేయాలంటే ఎంతో ఓరిమి, సంయమము, సమయస్ఫూర్తి అవసరం అవుతాయి. బాపూరావ్‌జీ ప్రతి చిన్న విషయాన్ని యోజనాబద్ధంగా నిర్వహించారు. ముందుగా యోజన చేసేప్పుడే అన్ని వివరాలు సేకరించి తదనుగుణంగా ఏర్పాట్లు చేయడం వారికి వెన్నతో పెట్టిన విద్య. ముఖ్యంగా వేదికపైన దిగంబర సన్యాసులు కూడా ఆశీనులై ఉన్నప్పుడు ఏర్పాట్లు ఇంకా ఎంతో పకడ్బందీగా నిర్వహించవలసి ఉంటుంది. వేదికపైన వారు ఆశీనులై ఉండే స్థలంలో నడుంపైభాగం మాత్రమే కన్పించే రీతిగా దడిలాంటిది నిర్మాణం చేసి ఎవరికి అసౌకర్యం కలుగని రీతిలో ఏర్పాటు చేయవలసి వచ్చింది. అది అంతా ఎంతో నేర్పుగా ఏర్పాటుగావించారు బాపూరావ్‌జీ. ఈ సమ్మేళనంలో గోహత్యా నిరోధానికి సంబంధించి చేసిన తీర్మానం అందరి ప్రశంసలు పొందింది.

## అందరి అభిప్రాయాలు వినేవారు

బాపూరావ్‌జీ కఠినంగా వ్యవహరించవలసిన చోట వజ్ర సమానంగా ఉంటారు. అలాగే వెసులుబాటు అవసరమైన చోట తదనుగుణంగానూ

వ్యవహరించగలరు. ఎమర్జెన్సీ రోజుల్లో మారు వేషంలో ఉండి ప్రత్యక్షంగా కార్యరంగంలో దూకి పనిచేసిన కారణంగా వారికి అనేక అనుభవాలు ఎదురయ్యాయి. తత్ఫలితంగా పరిణామాలను అంచనా గట్టడంలో ఎంతో వాస్తవిక దృక్పథం కనిపించేది. ఒకానొక సందర్భంలో ఇందిరాగాంధీతో వ్యవహరించవలసిన తీరుకు సంబంధించి ఏకనాథ్‌జీతో కూడా ఎంతో వేడిగా, వాడిగా వాదించిన సందర్భాలున్నాయి. ఆమెతో రాజీధోరణి విషపరిణామాలకే దారితీస్తుందనేది వారి దృఢవిశ్వాసం.

అలాగే అనుభవజ్ఞుడైన కార్యకర్తనుండి ఏదైనా సలహా అందితే దానిని తరచి చూచే లక్షణం కూడా ఉంది. ఒక సందర్భంలో జ్యేష్ఠ కార్యకర్త శ్రీ వరహర్ పాండే ఒక సలహా ఇచ్చారు. కాలమాన పరిస్థితులకనుగుణంగా శాఖ కార్యక్రమంలో కూడా కొన్ని మార్పులు చోటుచేసుకోవాలనేది వారి సూచన. రెండు ప్రపంచయుద్ధాల నడుమ గడిచిన కాలంలో డాక్టర్జీ సంఘాన్ని స్థాపించి కాలోచితమైన రీతిలో శాఖా కార్యక్రమాలు రూపొందించారు. ఆతర్వాత కాలంలో దేశంలోను, ప్రపంచంలోను ఆలోచనా విధానాలలో అనేక మార్పులు సంభవించాయి. శాఖా కార్యక్రమంలో కూడా కాలోచితమైన మార్పులు ప్రవేశపెట్టాలి అనేది వరహద్ పాండేగారి సలహా. తన వాదాన్ని సమర్థించు కొంటూ ఎమర్జన్సీ కాలంలో సంఘంపైన నిషేధం పెట్టిన కారణంగా శాఖా పద్ధతిలో మార్పు చేసుకోవలసిన అవసరం ఏర్పడింది కాబట్టి అనేకమైన క్రొత్త కార్యక్రమాల యోజన చేసి స్వయంసేవకులతో సంపర్కానికి విఘాతం కలుగకుండా కాపాడుకోగలిగాం. అలాగే ఎమర్జన్సీ లేని సాధారణ పరిస్థితులలో కూడ సంఘ భావవ్యాప్తికి ఓ క్రొత్త దృష్టి అందించడం అవసరం అనేది ఆయన వాదన. బాపూరావ్‌జీ ఈ వాదన ప్రశాంతంగా విన్నారు. కార్య పద్ధతిలో మార్పులు ప్రవేశపెట్టడానికి భీతి చెందవలసిన అవసరంలేని మాటవాస్తవమే.

కాని ఇంతకంటె ఉత్తమమైన కార్య పద్ధతి ముందుంచగల్గిననాడు మాత్రమే అది సాధ్యమవుతుంది అని బాపూరావ్‌జీ చెప్పారు. అవతలి వారి వాదన వినడానికి బాపూరావ్‌జీ ఎన్నడూ విముఖత చూపలేదు. నిర్ణయాలు మాత్రం కూలంకషంగా ఆలోచించిన తర్వాత పదిమందిని కలిపి ముందుకు తీసుకుపోయే రీతిలో చేయాలనేవారు.

అలాంటిదే 1984-85 సం.లో ఒక ప్రతిపాదన వచ్చింది. ఎన్నికలలో ఆశించిన ఫలితాలు రాకపోవడానికి కారణాలు సమీక్షిస్తూ ఒక నివేదికలాంటిది తయారు చేయాలని, లోపాలు నిర్భయంగా బయటపెట్టాలని ఒకరు ప్రతిపాదించారు. అయితే దానివలన కార్యకర్తలలో కలతలు బయలు దేరుతాయని అది పార్టీపరంగా బి.జె.పి కి నష్టం కల్గిస్తుందని కౌశల్ కిశోర్‌జీ వాదించారు. బాపూరావ్‌జీ కూడా ఇలాంటి ప్రచురణ వ్యతిరేక ఫలితాలనే అందిస్తుందని చెప్పి ఆ ప్రతిపాదన ప్రక్కనపెట్టారు.

బాపూరావ్‌జీకి భారత్ ప్రకాశన్ కార్యం అప్పజెప్పారు. పాంచజన్య ప్రచురణ విషయం కూడా చూడవలసి వచ్చింది. వారు ఏ పని చేసినా దాని అంచులు చూసే స్వభావం కలవారు. పాంచజన్యంలోని వ్యాసాలు కొన్ని ఆంగ్లంలోకి తర్జుమా చేయమని కె.ఆర్.మల్కానీగారికి పురమాయించారు. అది కాస్త సున్నితమైన విషయం. అయినా బాపూరావ్‌జీ అదొక వివాదానికి దారితీయకుండా ఎంతో మెలకువతో వ్యవహరించి తాననుకొన్నది సాధించారు.

అప్పట్లో జనసంఘ్ మొదలైన సంస్థలెన్నో పూ. గురూజీ ప్రేరణతో నెలకొల్పబడుతుండేవి. సంఘం తన అసలు పని వదులు కొంటున్నదా? సంఘశక్తి చెల్లా చెదరవుతున్నదా? అని నాటి స్వయం సేవకులు రకరకాల

భావాలకు లోనవుతుండేవారు. ఆ అనుమానాలు తొలగిస్తూ శ్రీ మోఘేజీ ఇలా వివరించేవారు. ''సంఘం అనేది హిందూ సమాజంలోని అన్ని రంగాలను ప్రభావితం చేస్తుంది. శాఖకు వచ్చి పోవటమే పనికాదు. హిందూ సమగ్ర సమాజాన్ని హిందుత్వ భావనతో ప్రభావితం చేయటానికి మనం అన్ని రంగాలో సనిమారంగంలో పైతం, ప్రవేశిస్తున్నాం. నాడు మనం ఈ పని చేయలేదు. ఇప్పుడు తగు శక్తి వచ్చింది. చేస్తున్నాం. చిన్నప్పుడు గడ్డం చేసుకొన్నావూ? వయసు రాగానే చేసుకొనటం లేదా? ఇప్పుడెందుకు చేసుకొంటున్నారు? చిన్నప్పుడెందుకు చేసుకోలేదు? - అంటే అర్థం ఏముంది?

## విద్యావిధానం మారాలి

స్వాతంత్ర్యం సిద్ధించి ఇంతకాలం అయినప్పటికీ ఇక్కడి జాతీయ జీవనానికి అనువైన విద్యావిధానం రూపొందించుకోలేకపోవడం దురదృష్టమని భావించేవారు బాపూరావ్‌జీ.

**8.2.1979** నాడు భారతీయ శిక్షణ మండలి ఆధ్వర్యంలో అప్పటి ఉపరాష్ట్రపతి శ్రీ జట్టి, మా.కేదార్‌నాథ్ సహాని, మేయర్ శ్రీ రాజేంద్రగుప్త ఇత్యాది ప్రముఖల సమక్షంలో భారతదేశం నలుమూలల నుండి విచ్చేసిన శిక్షణ మండలి ప్రతినిధుల సమావేశంలో శ్రీ బాపూరావ్‌జీ మోఘే ప్రసంగించారు.

బ్రిటిష్ పాలనలో ఈ దేశంలో ప్రవేశపెట్టబడిన విద్యావిధానం ఈ జాతి జీవన విలువలకు పూర్తిగా భిన్నమైనదన్నారు. విద్యావంతులను తమ భావాలకు అనుగుణంగా మలచుకొని తమకు అవసరమైన గుమాస్తాలను తయారుచేసుకొనేందుకు ప్రవేశపెట్టబడిన విద్యావిధానం అన్నారు. బ్రిటిష్

ప్రభుత్వం రాక ముందు దేశంలో ఉన్న పరిస్థితిని సింహావలోకనం చేసుకొంటూ ఆ రోజుల్లో ఇళ్ళకు తాళాలు వేసేవారు కాదని, అతిథి మర్యాదలకు పెట్టింది పేరుగా ఉండేదని చెప్పారు. శీలసంపన్నులకు నెలవుగా ఉండేదన్నారు. కాని బ్రిటీష్ విద్యావిధానం ప్రవేశపెట్టబడ్డాక స్వార్ధపరత్వం, సంకుచితత్వం, చౌర్యం, మోసం, హింసాత్మక ధోరణి సమాజంలో చోటు చేసుకొన్నాయి అన్నారు. కళాశాలలోనూ, విశ్వవిద్యాలయంలోనూ చదువుకొంటున్నవారు దొంగతనాలకు పాల్పడు తున్నారు. సరదా కోసం హత్యలు చేశాం అని చెప్పుకొంటున్న కిరాతకులు తయారవుతున్నారు. ఆ మధ్య అమెరికాలో ఒక పిల్లవాడు అవతలి వ్యక్తిని అకారణంగా తుపాకీతో కాల్చి చంపాడు. ఎందుకు చంపావయ్యా అని కోర్టు వారు అడిగితే చంపడంలో ఉన్న మజా ఏమిటో అనుభవించి చూడటానికి అని సమాధానం ఇచ్చాడట. శీలనిర్మాణానికి తోడ్పడని పాశ్చాత్య విద్య ఇలాంటి వికృతులను సమాజంలో సృష్టిస్తోంది అన్నారు బాపూరావ్‌జీ.

ప్రతిదేశానికి తనదైన జీవన విలువలు కొన్ని ఉంటాయి. వాటిని కాపాడుకోకపోతే ఆ దేశ ఆత్మ నశిస్తుంది. మన జీవన మూల్యాలు ఈనాడు దెబ్బతిని పోతున్నాయి. ఫలానా చోట ప్రొఫెసర్లను కొట్టారని, ఇంకోచోట ప్రిన్సిపాల్‌ను కొట్టారని వార్తా పత్రికలలో వార్తలు వస్తుంటాయి. ఏమిటి ఇదంతా? పాశ్చాత్య విద్యలో నిజమైన ఆనందం, మానసిక శాంతి కొరవడిన కారణంగా ఆ సమాజాలు ఈనాడు అతలాకుతలం అవుతున్నాయి. ఆ విద్య మన సమాజాన్ని పౌరుషహీనంగా తయారు చేస్తోంది. ఈ జాతి చరిత్ర అంతా పరాజయాల పరంపరే అంటూ నేర్పబడుతోంది ఇది మారాలి అన్నారు. ఈవేళ పాశ్చాత్యదేశాలలోని విద్యావిధానాన్ని, పరిశోధనలను మక్కీకి మక్కీ నకలు చేయడం విద్యార్థినేర్చుకొంటున్నాడు. ఈ దేశ

ప్రయోజనాలకు తోడ్పడే అంశాలు మాత్రమే ఇతరులనుండి మనం స్వీకరించాలి. అతేగాని అంధానుకరణ పనికి రాదు.

ఈనాడు విద్య 'ఇన్‌ఫార్మేటివ్' అయిందేగాని 'ఫార్మేటివ్' కాలేదు. మనకు 'ఫార్మేటివ్' విద్యావిధానం అవసరం. విద్యార్థిలోని ఆలోచనాశక్తిని పెంచి వానిలో అంతర్నిహితంగా ఉన్న ప్రతిభను వెలికి తెచ్చే విద్యావిదానం కావాలన్నారు బాపూరావ్‌జీ.

విద్యావిధానం వ్యక్తి నిర్మాణానికి తోడ్పడేదిగా ఉండాలి. ఏ రకమైన వ్యక్తి నిర్మాణం? సమాజంతో సమరసత పెంచి ఆత్మీయతను అనుభవించగల వ్యక్తుల నిర్మాణం జరగాలి. ధ్యేయ పరిపూర్తికి అవసరమయితే ప్రాణత్యాగం చేయగల పట్టుదలగల సర్వగుణ సంపన్నుల నిర్మాణం జరగాలి. మహాపురుషుల జీవితాలను ఆదర్శంగా తీసుకొని జీవించే వ్యక్తుల నిర్మాణం మన విద్య ద్వారా జరగాలి అన్నారు బాపూరావ్‌జీ.

# నిర్యాణ

## దీర్ఘకాలిక వైద్యం

1955-56 సంవత్సరాలలో బాపూరావ్‌జీకి బాగా సుస్తీ చేసింది. ప్రకృతి వైద్యం బాగా పని చేస్తుందని, శ్రీయుత ప్రయాగ సుబ్రహ్మణం, జి.సోమరాజు గట్టిగా చెప్పారు. ఆ రోజుల్లో ఈ ప్రాంతంలో భీమవరం ప్రకృతి ఆశ్రమం చాలా ప్రసిద్ధి. అందుచేత బాపూరావ్‌జీ భీమవరం ప్రకృతి ఆశ్రమంలో నిర్దిష్ట చికిత్సాకాలం 108 రోజులు ఉన్నారు. రోజూ 3గంటల స్నానం వంటినిండా ఒండ్రు మట్టి పట్టించి అది ఆరాక ముందు నదిలో,

ఆతర్వాత తొట్టిలో స్నానం చేయాలి. విద్యార్థిగా, నేతగా, అనుయాయిగా, బోధకుడుగా, సామాజిక కార్యకర్తగా వారికిగల పరిశీలనాశక్తి అమోఘం. ఆఖరికి రోగిగా ఉన్నప్పుడు కూడ ఆ పరిశీలనా దృష్టి వారిని వీడలేదు. ప్రకృతి వైద్యం చేయించుకొంటూ ప్రకృతి వైద్యానికి సంబంధించిన పుస్తకాలు ఎన్నో చదివారు. దానిలోని మంచి.చెడ్డలు ఎంతమందితోనో చర్చించేవారు. ఒక్కోసారి వారు అడిగే ప్రశ్నలకు డాక్టర్లుగారే సమాధానాలు వెతుక్కోవలసి వచ్చేది. తు.చ. తప్పక నియమాలు పాటించేవారు. అయితే జీవితాంతం అలా పచ్చికూరలు,పచ్చికాయలు తినడం సాధ్యపడుతుందా? అందులోను సామాజిక కార్యకర్త అయి ఉండి అనునిత్యం పర్యటనలలో ఉండవలసి ఉన్నప్పుడు అది సాధ్యమా అన్న అనుమానం వస్తుండేది. భీమవరం ఆశ్రమం నుండి తిరిగి రాగానే పథ్యం పాటించడం సాధ్యమయ్యేది కాదు. యథాప్రకారం ఆహార పానీయాలు స్వీకరించేవారు. మొత్తం మీద వారికి ఆ వైద్యం మేలు చేయలేదు.

ఆ తర్వాత వరంగల్లులో శఠగోపాచారిగారి వద్దనే వైద్య చేయించుకొన్నారు. శఠగోపాచారిగారు జీర్ణకోశానికి సంబంధించిన వ్యాధులు నయం చేయడంలోనిపుణులు. పర్‌పెట్టి అనే ఆయుర్వేదప్రక్రియ ఒకటి ఆయన వద్ద చాలా ప్రశస్తమైంది. ఒకటి రెండురోజుల కడుపు శుద్ధి చేయడం,ఆతర్వాత కేవలం కొబ్బరిబొండాల నీరు త్రాగడం అలా 20 రోజులపాటు వైద్యం సాగుతుండేది. దానివలన కొందరికి మంచి ఫలితాలు కనిపించాయి. ఒకరకంగా చెప్పాలంటే శఠకోపాచారిగారి వైద్యం అఖిలభారతీయ స్థాయిలో ప్రశస్తి పొందడానికి బాపూరావ్‌జీయే కారణం. 1960 ప్రాంతంలో పూజ్య బాలాసాహెబ్‌జీ, శ్రీ దీనదయాల్ ఉపాధ్యాయ, శ్రీరాం సాఠే, శ్రీ యజ్ఞ్యదత్తశర్మ ఇత్యాది సంఘ ప్రముఖులు శఠకోపాచారిగారి వద్ద వైద్యం

చేయించుకోవడానికి కారణం బాపూరావ్‌జీయే. ఆయన శఠకోపాచారిగారి వద్ద వైద్యం ప్రారంభించాక ఆయుర్వేదానికి సంబంధించి చాలా పుస్తకాలు చదివారు.

1959లో ఆంధ్రప్రదేశ్‌ను విడిచి వెళ్ళాక కూడా బాపూరావ్‌జీ,వైద్యం నిమిత్తం వరంగల్లు వచ్చారు. ఆయనకు భోజనంలో పుల్కాలు ఉండాలి. మా ఇంట్లోనేమో పుల్కాలు చేయడం చేతగాదు. ఇటీవలి కాలం వరకు కోస్తా జిల్లాల వారికి పుల్కాలు చేయడం అలవాటు ఉండేది కాదు. అప్పటికి నాకు వివాహమై రెండు,మూడు ఏళ్ళు అయింది. బాపూరావ్‌జీ నా భార్య వద్ద కూర్చుని పిండి కలపడం దగ్గనుండి వాటిని కాల్చడం వరకు శ్రద్ధగా నేర్పారు. రెండుమూడు రోజులలోనే ఈమె బాగా చేయడం నేర్చుకొంది. బాపూరావ్‌జీకి తెలుగు అర్థం అయ్యేదికాని మాట్లాడలేరు, మా ఇంట్లో ఈమెకు హిందీ,ఇంగ్లీషు భాషలు రావు. మొత్తం మీద సౌంజ్ఞల ద్వారానే రొట్టెలు చేయడం నేర్పారు. ఎంతో ఆత్మీయుడుగా మారిపోయారు. అంతకు ముందు విజయవాడలో ఉండగా కూడ శ్రీ బోను వెంకటేశ్వర రావుగారి శ్రీమతి చిట్టెమ్మగారు బాపూరావ్‌జీకి, ఠాకూర్‌గార్కి, ఇంకా చాలా మంది ప్రచారకులుకు భోజనం వడ్డిస్తుండేది. వీరంతా ఆ ఇంట్లో మనుషులుగానే ఉన్నారు తప్ప పరాయి వారన్న భావన వచ్చేది కాదు. ప్రచారకులు ఏ ఇంటికి వెళ్ళినా ఆ కుటుంబ సభ్యులలో ఒకరైపోవడం అనేది డాక్టర్జీ నుండి లభించిన పుణ్య సంస్కారం. బాపూరావ్‌జీ ఆ ఆదర్శానికి సిసలైన ప్రతినిధిగానే ఉండేవారు.

ఎంత జాగ్రత్తగా ఉన్నప్పటికి వారి ఆరోగ్యం కుదుటపడలేదు. అదొక విచిత్రమైన వ్యాధిగా పరిణమించింది. శరీరంలో ఏ భాగంలోనైనా చర్మం వత్తిడికి గురియైనా సరే రక్తం వచ్చేది. మనిషి బలహీనమై ఏ పని చేయాలన్నా

ఉత్సాహం లేకుండా తయారైంది. ఇంకా ఇతరరోగాలు కూడా శరీరాన్ని తొలిచివేశాయి. మొత్తం మీద 1960 తర్వాత వారు సంపూర్ణంగా ఆరోగ్యవంతులై ఉన్న సమయం లేదనే చెప్పవచ్చు.

## వీతసంగుడు

మా పెద్దబ్బాయి ఢిల్లీలో పని చేస్తూండగా అతడిని చూడటానికి నేను ఢిల్లీ వెళ్ళాను. అంతకు ముందు చాలా కాలంగా దీర్ఘరోగంతో బాధపడుతూ బాపూరావ్‌జీ ఢిల్లీ కార్యాలయంలోనే ఉంటున్నారు. 1993 జూలై 16వ తేదీన బాపూరావ్‌జీని చూడటానికి ఝుండేవాలాలోని సంఘ కార్యాలయానికి వెళ్ళాను. కార్యాలయ ప్రముఖ్‌గా ఉన్న భోలానాథ్‌గారిని 'నేను విజయవాడ నుంచి వచ్చాను. బాపూరావ్‌జీని కలుసుకోవాలను కొంటున్నాను. వారు ఎక్కడ ఉంటారు?' అని అడిగాను.

పై అంతస్తులో ఉన్న ఒక గదిని చూపిస్తూ 'ఆ గదిలో ఉంటారు. సాధారణంగా ఎవరితోనూ మాట్లాడటం లేదు' అన్నారు.

'నేను వారిని తప్పకుండా చూడాలని వచ్చాను. ఆంధ్రలో వారు ప్రాంతప్రచారక్‌గా పని చేసినప్పుడు ఎంతో సన్నిహితంగా ఉండేవాడిని. నాతో మాట్లాడతారనే అనుకొంటున్నాను. మాట్లాడకపోతే దూరంగా నిలబడి వారి దర్శనం చేసుకొని ఒక నమస్కారంపెట్టి వచ్చేస్తాను' అన్నాను.

గతంలో జరిగిన కొన్ని అనుభవాలకారణంగా భోలానాథ్‌గారి మనస్సులో అనుమానంగానే ఉంది.

'ట్రైయువర్ లక్' అన్నారు.

అప్పటికే బాపూరావ్‌జీ ఆరోగ్యం బాగా క్షీణించింది. ఒక విచిత్రమైన మానసికస్థితి చోటు చేసుకొంది. ఒక్కోసారి ఒంటిమీద గుడ్డ ఉన్నదా లేదా

అన్నది కూడా వారికి తెలిసేది కాదు. ఎంత సన్నిహితులు వెళ్ళినా మాట్లాడతారని నమ్మకం లేదు. ఒక్కోసారి మొఖం మీదనే తలుపు మూసేసిన సందర్భాలున్నాయి. ఇదంతా దృష్టిలో ఉంచికొని, 'నీ అదృష్టం పరీక్షించుకో' అన్నారు భోలానాథ్‌జీ.

నేను వెళ్ళే సరికి గది తలుపులు తెరిచే ఉన్నాయి. వారు మంచం మీద కూర్చుని ఉన్నారు. ఒక సాధువుకు మల్లే గడ్డం బాగా దట్టంగా పెరిగి ఉంది. కేవలం చిన్న నిక్కరు ధరించి ఉన్నారు. అంతకు ముందు భోలానాథ్‌గారు ఆ గది చూపించి అక్కడ బాపూరావ్‌జీ ఉన్నారని చెప్పి ఉండబట్టి వారు బాపూరావ్‌జీయే అని గుర్తు పట్టానుగాని లేకుంటే గుర్తించడం అసాధ్యం.

'మాది విజయవాడ. నా పేరు గోపిరెడ్డి. మిమ్మల్ని చూడాలని వచ్చాను' అన్నాను హిందీలో.

'ఇక్కడ ఏమి పని మీద వచ్చావు?' అడిగారు.

'మా పెద్దబ్బాయి ఇక్కడ బ్యాంకులో పని చేస్తున్నాడు. వాడి దగ్గరకు వచ్చాను. మీ ఆరోగ్యం ఎలా ఉంది?' అన్నాను.

'బాగానే ఉంది' అన్నారు.

'ఆహారం ఏమి తీసుకొంటున్నారు?' అడిగాను

'అన్నీ తింటున్నాను' అన్నారు.

విజయవాడలో వారెరిగిన రెండుమూడు పేర్లు గుర్తుకు తెచ్చాను. అంతలో ఆయనే 'ప్రాన్నపల్లి రామచంద్రమూర్తి ఎలా ఉన్నారు?' అడిగారు. వారి కుటుంబం విషయాలు కొన్ని చెప్పాను. అంతటితో సంభాషణ ఆగిపోయింది. కాసేపు మౌనం. ఇక వారు మాట్లాడటం అయిపోయింది అని అర్థం చేసుకొన్నాను.

'నమస్కారం. మళ్ళీ కలుస్తాను' అన్నాను.

దీనికి వారి మొఖంలో ఎలాంటి ప్రతిస్పందన కన్పించలేదు. నేను మెట్లు దిగి క్రిందికి వచ్చేశాను. ఇంటికి తిరిగి వచ్చి నా డైరీలో 'హి ఈజ్ వైటింగ్ ఫర్ ది కాల్(కాలుని పిలుపుకై ఎదురుచూస్తున్నారు) అని వ్రాసుకొన్నాను.

ఎంతో కాలంగా అనారోగ్యంతో బాధ పడుతూ జీవితం పైన ఒక నిరాసక్త భావన జనించి ఉంటుంది. మనస్సును లౌకిక విషయాలనుండి మరల్చి పారలౌకిక దృష్టిని పెంచుకొన్నారు. ప్రాపంచిక విషయాలపై నిర్మలత్వం పెంచుకొన్న స్థితిలో నిజంగానే వారి ప్రవర్తన విచిత్రంగా మారింది. శ్రీరామకృష్ణ పరమహంస జీవిత విశేషాలు చదువుతున్నప్పుడు తోతాపురి అనే సన్యాసి వారిని కలుసుకొన్నప్పటి దృశ్య వర్ణన తగులుతుంది. మలినమైన దుస్తులు, పెంచుకొన్న గడ్డం, ఆగ్రహంతో నిర్లక్ష్యంగా మాట్లాడే తీరు చూచిన రామకృష్ణుని శిష్యగణం ఆ సన్యాసి చెంతకు రాకుండా దూరంగా తొలిగి పోతారు. కాసేపు రామకృష్ణునితో మాట్లాడి ఆ సన్యాసి వెళ్ళిపోతాడు. ఆతర్వాత రామకృష్ణుడు తన శిష్యులతో,'సర్వసంగ పరిత్యాగి అయిన సాధు పురుషుడాయన. అలాంటి వారి దర్శన భాగ్యం అరుదుగా లభిస్తుంది' అంటారు. వీతసంగుల ప్రవర్తన మన ఊహకందకపోవడం సహజం. జీవిత చరమాంకంలో బాపూరావ్‌జీ ఆ స్థితిని అందుకొన్నారు.

# అనుబంధం-1

## ప్రఖరమైన దేశ భక్తి కావాలి

దేశవ్యాప్తంగా జరిగే సంఘ శిక్షావర్గలలో మా.బాపూరావ్‌జీ మోఘే బౌద్ధిక్‌లుండేవి. 21.5.71నాడు 3వ సంవత్సరం ఓ.టి.సి శిక్షార్థులనుద్దేశించి ఇచ్చిన బౌద్ధిక్‌లోని అంశాలు.

సంఘకార్యం ఒక ఆజీవన వ్రతమనే నిష్ఠ హృదయంలో నింపుకొన్నప్పుడు ఇతరులకు కూడా ఆ ప్రేరణనందిచగల్గుతాం. ఇలాంటి నిష్ఠగల అసంఖ్యాకమైన కార్యకర్తలు సంఘకార్య నిర్వహణకు పూనుకొన్నప్పుడు తప్పకుండా ఈ దేశంలో పరివర్తిన తీసుకురాగల్గుతాం.

హిందూ సమాజాన్ని సంఘటితం చేయడమే మన ఉద్దేశ్యం. బయటి వారు మన ఈ ఉద్దేశ్యాన్ని అర్థం చేసుకోలేకపోతున్నారు. దేశవిభజనకు పూర్వం బ్రిటిషు ప్రభుత్వంవారు ముస్లింలను హిందువులకు వ్యతిరేకంగా రెచ్చగొడు తుండేవారు. కాబట్టి, అప్పటి పరిస్థితిలో ముస్లింలను ఎదుర్కోవడానికి హిందువులు సంఘటితం కావాలనడం సబబుగానే ఉంది కాని దేశవిభజన తర్వాత ఆ పరిస్థతి మారిపోయింది. ఇప్పుడు సంఘటన అవసరం లేదు అనేవారున్నారు. ఎల్లప్పుడూ సమాజం అంతా సంఘటితంగా ఉండాలి అంటే వారు దానిని అర్థం చేసుకోలేకపోతున్నారు.

కొన్ని రకమైన సామాజిక మార్పులు మాత్రమే నిర్మాణాత్మకమైనవని నమ్ముతూ,నృత్యగీతాది వినోదాలు మాత్రమే సాంస్కృతిక కార్యకలాపాలని విశ్వసించేవారు సంఘకార్యంలో ఇమిడి ఉన్న సాంస్కృతిక భావన, నిర్మాణాత్మక ధోరణి అర్థం చేసుకోలేరు.

స్వార్థచిత్తులైన వ్యక్తులతో నిండి ఉన్న సమాజాన్ని ఒక్క రోజులో మార్చి పారేయాలనుకోవడం జరగని పని. 'యధారాజా తధాప్రజా' అన్న సూక్తి మనమెరిగినదే. కాని ప్రజాస్వామ్యంలో ప్రజలను బట్టే పాలకులుంటారు.

సంఘటన కార్యం ద్వారా సముపార్జించిన శక్తితో అధికారాన్ని హస్తగతం చేసుకోవాలనే, రహస్య ఆలోచనలు సంఘానికి ఉన్నాయి అని ఆరోపించేవారున్నారు.

తమకు చుట్టూ కనిపిస్తున్న దాన్ని బట్టే ప్రజలు క్రొత్త వాటిని అంచనాలు కడుతుంటారు. అలా అంచనాలు కట్టేవారు సంఘకార్య వాస్తవ రూపాన్ని తెలుసుకోలేరు. సంఘకార్య భూమిక లిఖిత పూర్వకంగా కూడా లేదు. కాబట్టి సంఘకార్య స్వరూపం శాఖకు వచ్చి చూస్తేనే అర్థం అవుతుంది. అందుకే అలాంటి వారిని సంఘ శాఖకు వచ్చి ఓసారి ప్రత్యక్షంగా మేము ఏమి చేస్తున్నామో చూడండి అని చెపుతుంటాం.

మన సమాజం అసంఘటితమై ఉండటమే మన దురవస్థకు మూలకారణం. ప్రతి వ్యక్తి హృదయంలోను, ప్రఖరమైన దేశభక్తి స్థిరంగా పాదుకొనేందుకు అవసరమైన గుణాల నిర్మాణం చేయాలి. అలాంటి వ్యక్తులందరిని సంఘటన సూత్రంలో గుదిగుచ్చి, ప్రచండమైన సామర్థ్యం నిర్మాణం చేయాలి. అప్పుడే ఈ దురవస్థ తొలిగిపోతుంది.

సోషలిజం పేరుతో ఇప్పుడు జరుగుతున్న కోలాహలం ద్వారా సమాజ జీవనంలో పరివర్తనరాదు. సోషలిజం, కమ్యూనిజం అనే నినాదాలు లేకుండానే పశ్చిమజర్మనీ, ఇజ్రాయిల్, ఇంగ్లాండు మొదలైన దేశాలు సమృద్ధిని సాధించి సుఖంగా మనగల్గుతున్నాయన్న సత్యం గ్రహించాలి. ప్రజలలో ప్రఖరమైన దేశభక్తి ఉన్నందునే ఈ దేశాలు ప్రగతిని సాధించాయి.

స్వతంత్ర జీవనం సాగిస్తున్న దేశం ఏదైనా వ్యక్తి స్వేచ్ఛను కోల్పోకుండా ఆర్థిక ప్రగతి సాధించాలి. ఈ గీటురాయిపై పరీక్షించినప్పుడు సోషలిష్టు దేశాలు నిలబడలేకున్నాయి.

ప్రఖరమైన దేశభక్తి కల్గిఉండి సంఘటిత రూపంలో ఉన్న సమాజమే విజయపథాన సాగుతుంది.

# భారతజాతీయతకు ఆధారం హిందుత్వమే

## 22.5.71నాటి బౌద్ధిక్ అంశాలు

హిందుత్వమే జాతీయభావన అనేది మనం ప్రతిపాదిస్తున్న విషయం. ఒకే ఆదర్శం, ఒకే తాత్విక చింతన, ఒకే వారసత్వం, ఇక్కడి మహాపురుషులపట్ల ఒకే విధమైన ఆదరభావం, ఒకే విధమైన ఆశ, ఆకాంక్షలు, ఒకే విధమైన శత్రు-మిత్ర భావన, సమాజంపట్ల సమరస భావన కల్గిఉండి మాతృభూమి పట్ల మాతా-పుత్ర సంబంధం కల్గి ఉన్న సమాజాన్ని ఆ దేశపు జాతీయులు అంటాం.

ఈ కొలబద్దతో చూస్తే ఈ దేశపు జాతీయులు హిందూ సమాజమే అని అర్థం అవుతుంది. ఈ జాతీయ జీవనం ఇక్కడ సహజ సిద్ధంగా వికసించింది. ఈ గడ్డపై జనించిన మహాపురుషులు, మనకు జీవితంలో ఎదురయ్యే సమస్యలు పరిష్కరించుకొనేందుకుగాను ఒక విశిష్టమైన తత్వజ్ఞానం ప్రసాదించారు. అంతేకాదు, తదనుకూలంగా సంస్కారాలు కల్గించే వ్యవస్థను నిర్మాణం చేసి ఒక విశిష్టమైన సంస్కృతిని నిర్మించారు. నరుడు నారాయణుడుగా మారడమే జీవన లక్ష్యంగా భావించి ఆ స్థితి పొందేందుకు తగిన జీవన విధాన రచన చేశారు.

జాతి జీవనానికి సంస్కృతి ఆత్మవంటిది. ఈ సంస్కృతితో తాదాత్మ్యం చెందిన వారే జాతీయులు. హిందూ సంస్కృతి అన్ని ధర్మాలపట్ల సమాదర భావం కల్గి ఉండటాన్ని నేర్పుతుంది. క్రైస్తవులు, ముస్లింలు ఇతర మతాలపట్ల అసహిష్ణుతా భావం కల్గి ఉంటారు. ఇలాంటి భావాలు కల్గి ఉన్నంత కాలం విజాతీయులే అవుతారు.

హిందు అనేది జాతిని తెలియజేసే పదం. ఒక ఆరాధనా పద్ధతి (సంప్రదాయం)కి సంబంధించినది కాదు. హిందూ సంస్కృతి ఆరాధనా స్వేచ్ఛను ఆదరిస్తుంది. అందుకే మన దేశంలో విభిన్నమైన ఆరాధనా సంప్రదాయాలున్నాయి. కణాదుడు, బృహస్పతి,చారవాకుని వంటి నాస్తిక తత్వవేత్తలు కూడా ఇక్కడ మనగలిగారు.

వివాహితయైన నవవధువు అత్తగారింట అడుగిడగానే అటు పుట్టినిల్లు, ఇటు మెట్టిన ఇల్లు- రెండు కుటుంబాలతో తాదాత్మ్యభావన కల్గి ప్రవర్తిస్తుంది. అలాగే క్రొత్త వ్యక్తులెవరైనా ఈ సంస్కృతితో తాదాత్మ్యత చెందే అవకాశం కల్పించబడింది. తనదైన సంస్కృతిని కాపాడుకోవాలనుకోవడం నకారాత్మకభావన కాజాలదు. అన్ని దేశాలు ఈ నియమాన్ని పాటిస్తున్నాయి. ఆంగ్లో-శాగ్జన్ సంస్కృతిలో పాలు పంచుకోకుండా క్రొత్తవ్యక్తి ఎవరైనా అమెరికా జాతీయుడు కాజాలడు. ఈ క్రొత్తవ్యక్తిపైన అమెరికా సంస్కృతి, జీవనపద్ధతికి సంబంధించిన సంస్కారంపడేట్లు చేస్తారు.

టర్కీ, ఈజిప్టు, ఇండోనేసియా దేశాలు ఇస్లాం మతానుయాయులైనప్పటికి వారివారి సాంస్కృతిక విశిష్టతను ఉపాసిస్తూనే ఉన్నారు. వారు అరబ్బు సంస్కృతికి బానిసలుగా మారలేదు.

భారతజాతీయతకు ఆధారం హిందుత్వమే అనే విషయం అరవింద మహర్షి, అనిబిసెంట్, రవీంద్రనాద ఠాకూర్ వంటి మహనీయులు కూడా అంగీకరించారు.

ముస్లింలను హిందువులనుండి దూరంగా ఉంచేందుకు ఆంగ్లేయులు ఈ దేశం అంటే హిందూస్థానమే అన్న విషయాన్ని త్రొక్కి పెట్టి ఉంచారు.

స్వాతంత్ర్యం వచ్చాక కూడా ఈ దేశంలో జాతీయులు ఎవరు అనే విషయంపై సరియైన అవగాహన కల్గించని కారణంగా ఈ సమాజం

బలహీనంగా కనిపిస్తోంది. ఇలాంటి బలహీనత కారణంగానే దేశవిభజన జరిగింది. ఈ సమాజంలో జాతీయ భావ సాక్షాత్కారం జరిగినప్పుడే శక్తివంతమైన జాతి జీవనం మన కనులముందు ప్రత్యక్షమవుతుంది.

# అనుబంధం-2

## ఎమర్జెన్సీ పూర్వాపరాలు

1975లో ఎమర్జన్సీ ప్రకటించగానే బాపూరావ్‌జీ వెరాఘె అజ్ఞాతంలోకి వెళ్ళిపోయారు. ప్యాంటు, షర్టు, బూటు, జుట్టుకు రంగు- అచ్చు యూనివర్శిటీ ప్రొఫెసర్‌లా తయారై బాగా పరిచయమున్నవారు కూడా గుర్తుపట్టలేనంతగా మారిపోయారు. ఆ మారువేషంలో భారతదేశం అంతా పర్యటించారు. విజయవాడ కూడా సందర్శించారు. దేశంలో లోక్ సంఘర్ష సమితి కార్యకలాపాలు సాధ్యమైనంత వరకు పొరపొచ్చాలు లేకుండా సామరస్యపూరితంగా సాగడానికి ఎంతగానో తోడ్పడ్డారు. శ్రీ మాధవరావ్ మూలే, ఒక ప్రక్కన, బాపూరావ్‌జీ మరోప్రక్కన విభిన్న రాజకీయపక్షాల నాయకులతో నిరంతరం సంపర్కం పెట్టుకొంటూ, జైళ్ళలో ఉన్న సంఘ అధికారులకు ఎప్పటికప్పుడు తాజా సమాచారం చేరవేస్తూ వారి సూచనలు అందుకొంటూ వ్యూహరచనలో ఎలాంటి లోపాలు లేకుండా చూచుకొంటూ ఎమర్జన్సీకి వ్యతిరేకంగా సాగిన పోరాటాన్ని అవిచ్ఛిన్నంగాను, సమర్థవంతంగాను నిర్వహించడంలో ప్రముఖ పాత్ర వహించారు. అందుకే శ్రీమతి గాంధి తన సన్నిహిత అనుయాయులలో ఒకరిని బాపూరావ్‌జీ వద్దకు పంపించి రాజీకి సంప్రతింపులు జరిపినట్లు చెపుతారు.

ఎమర్జన్సీ ఎత్తేశాక 1977 జూలై మాసంలో వారిని కలుసుకొని ఎమర్జన్సీకి సంబంధించి అడిగిన ప్రశ్నలకు కొన్ని సమాధానంగా కొన్ని ఆసక్తికరమైన విషయాలు వెల్లడించారు. చదవండి-

ప్ర. గుజరాత్, బీహార్ రాష్ట్రాలలో సాగుతున్న ఆందోళనలు బలపడి ఇతర రాష్ట్రాలకు కూడా ప్రాకుతున్నాయన్న భయంతోను సంఘస్వయంసేవకులు ఆందోళనలలో వ్యక్తిగతంగా పాల్గొని వీటిని ( )తర( )గన్న భావనతోను శ్రీమతి గాంధి దేశంలో ఎమర్జన్సీ విధించి సంఘ(-)న్ని నిషేధించింది అంటారు. అది ఎంత వరకు నిజం?

స. అసలు విషయం అదికాదు. సర్వాధికారాలు తన చేతుల్లోకి తీసుకోవాలనే కోర్కె ఆమెకు అంతకు ముందునుంచే ఉంది. ఎమర్జన్సీ ముందు రెండేళ్ళుగా ప్రధానమంత్రికి తిరుగులేని అధికారం సమకూర్చేందుకు తగిన విధంగా చట్టాలు రూపొందుతూ వచ్చాయి. న్యాయస్థానాల అధికార పరిధిని కుదించడం జరిగింది. సమాజంలో ఒక వర్గానికి వత్తాసుపలుకుతూ, ఆ వర్గ స్వార్థపూరిత ప్రయోజనాలు నెరవేరేందుకు అవసరమైన అధికారాలు, శక్తిసామర్థ్యాలు గుప్పిచడం ప్రారంభమైంది. అప్పటి సుప్రీం కోర్టు ఛీఫ్ జస్టిస్ స్వ. శ్రీ కోకా సుబ్బారావుగోలక్‌నాధకేసు తీర్పు విషయంలో ఈ అనుమానం బయటపెట్టారు. ఆయన పదవీవీరమణ చేశాక వ్రాసిన వ్యాసాలలో కూడా జరగబోయా అనర్థాన్ని బట్టబయలు చేశారు.

కాబట్టి గుజరాత్, బాహార్ ఆందోళనలు మాత్రమే ఎమర్జన్సీకి దారి తీశాయనుకోవడం సరికాదు.

ప్ర. ఈ ఆందోళనల కంటే ప్రబలమైన కారణాలు ఉన్నాయంటారా?

స. పెరుగుతున్న ధరలు, ప్రభుత్వంలోను మంత్రులలోను పాతుకుపోయిన అవినీతి, బంధుప్రీతి, వగైరాల కారణంగా ప్రజలలో పూర్తిగా అసంతృప్తి

నెలకొంది. దీనికి అలహాబాద్ హైకోర్టు ఇందిరాగాంధీ ఎన్నిక చెల్లదని ఇచ్చిన తీర్పుతోడు అయింది. అంతేగాక గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల ఫలితాలు ఆమెకు పూర్తిగా వ్యతిరేకంగా ఉండటంతో ఆశలన్నీ నీరుగారి పోయాయి. తత్ఫలితంగా అధికారాలన్నీ గుప్పెటలో పెట్టుకొనే మాట అటుంచి ఉన్న అధికారం ఊడిపోయే పరిస్థితి ఎదురైంది. కాబట్టి తన గద్దెను కాపాడుకోవడాని మార్గాంతరం లేక ఎమర్జన్సీ ప్రకటించింది.

ప్ర. సంఘంపైన విధించబడిన నిషేధం తొలగించమని ఆందోళనసాగించే బదులు ఎమర్జన్సీ ఎత్తివేయాలని సంఘం ఆందోళనకు దిగడంలో ఔచిత్యమేమిటి?

స. సంఘపెద్దలు కూడా ఈ విషయమై తీవ్రంగా ఆలోచించారు. కేవలం సంఘంపైన విధించిన నిషేధం ఎత్తివేయమని డిమాండు చేస్తూ పోరాడటమా లేక దేశంలో ప్రజాస్వామిక విలువలు పునఃస్థాపన కొరకై వివిధ రాజకీయపక్షాల నాయకులతో ఏర్పడిన లోకసంఘర్ష సమితితో కలిసి పోరాడటమా అనే ప్రశ్న ఎదురైంది. రాజకీయపార్టీలన్నా, రాజకీయాలన్నా ప్రజలు అసహ్యించ కొంటున్నారు. కాబట్టి సంఘం రాజకీయాలతో ఏ రకమైన సంబంధమూ పెట్టుకోరాదనేది చాలామంది స్వయంసేవకుల అభిమతం. సంఘం ఒక సంస్థ. దేశహితం సంసంస్థహితం కంటే గొప్పది అన్న అంశము అందరి ఆమోదం పొందింది.

సంఘనేతలు దేశం ఎదుర్కొంటున్న ప్రమాదం ఎంత తీవ్రమైనదో ఆలోచన చేశాక ఇంతటి తీవ్ర ప్రమాదాన్నుంచి అధిగమించాలంటే దేశంలో చిన్న. పెద్ద సంస్థలన్నింటి శక్తిని సమీకరించుకోవలసిన అవసరం ఎంతైనా ఉందన్న సంగతి గ్రహించారు. శ్రీమతి ఇందిరాగాంధీ సాగిస్తున్న

దురంతాలకు వ్యతిరేకిస్తూ దేశం యావత్తు ఒక్కత్రాటిపైన నిలబడింది అన్న అవగాహన విదేశాలలో వ్యాప్తి చేయడానికి ఇది బాగాతోడ్పడుతుంది అనికూడా భావించారు. అయితే ఈ చిన్నచితక సంస్థలనుండి బలమైన సమర్ధన,తోడ్పాటు లభిస్తాయన్న ఆశ సంఘనేతలకు లేదు. అయితే అసంఖ్యాకమైన సంస్థల సమర్థన ఉద్యమానికి లభిస్తోందన్న నైతికబలం ఉద్యమానికి బాగ తోడ్పడుతుంది. దేశం యావత్తు ఎమర్జన్సీని వ్యతిరేసిస్తున్నది అన్న భావన బలపడుతుంది. దేశదేశాలలో ఈ భావవ్యాప్తి జరగడం ద్వారా మేలు జరుగుతుందని కూడా సంఘనేతలు భావించారు. కేవలం సంఘంతనపైన విధించబడిన నిషేధంతొలగించుకోవడానికి కాకుండా దేశం మళ్ళీ బానిసత్వపు కోరలలో చిక్కుకోకుండా చూచేందుకు సాగిస్తున్న ఉద్యమం అనే భావన వ్యాపిస్తుంది. అందుచేత దేశంలో పనిచేస్తున్న అత్యధిక సంఖ్యాకమైన శక్తులను ఈ పోరాటంలో భాగస్వాములుగా చేసే అవకాశం ఏర్పడుతుంది అని కూడా ఆలోచించారు.

ప్ర. ఈ కారణంగా ఇంతవరకు రాజకీయాలతో ప్రత్యక్షసంబంధం పెట్టుకోనంటూ వచ్చిన సంఘం రాజకీయాలతో తలమునగ జొరబడినట్లు కావడం లేదా?

స. స్వయంసేవకులలో కూడా కొంతమంది మనం ఈ రాజకీయం ఝంఝాటంలో పడటం మంచిది కాదని వాదించారు. కాని సంఘ నేతృత్వం,గాంధీగారి నేతృత్వంలో ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగిన పోరాటంవలెనే ఈ పోరాటం కూడా ఒక జాతీయ పోరాటం అనే విషయం గ్రహింపచేశారు. సంఘం ప్రారంభ దినాలనుండి కూడ సంస్థకంటే దేశానికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చే సంస్కారాలు కల్గిస్తూ వచ్చిన కారణంగా

స్వయంసేవకులను ఒప్పించడంలో అంత శ్రమపడవలసిన పనిలేగుండా పోయింది.

వాస్తవానికి సంఘ ప్రారంభకులు డాక్టర్జీ ఈ సమాజం యొక్క, హీనమైన స్థితి చూచి ఎంతో హృదయావేదన చెందారు. కొన్ని రాత్రులు నిద్రపోకుండా అదే పనిగా ఆలోచిస్తుండేవారు. ఈ పరిస్థితిని మార్చివేయాలన్న స్థిరసంకల్పంతోనే సంఘస్థాపన చేశారు. ఎమర్జెన్సీరూపంలో దేశప్రజలపైన భీకరమైన ఆపద ముంచికొచ్చింది డాక్టర్జీని ప్రేమించే స్వయంసేవకులు చూస్తూ ఊరకుండగలరా? దేశ సుఖదుఃఖాలతో సంబంధం లేదనుకొనే సంస్థను గూర్చి ప్రజలు మాత్రం ఎందుకు పట్టించుకొంటారు? కాబట్టి ఈ పోరాటంలో జయిస్తే ప్రజలమన్ననకు పాత్రులవుతాం. దేశసౌభాగ్యం పెరగడంతోపాటు మనం లక్ష్యాన్ని సాధించేందుకు మార్గం సుగమం అవుతుంది. ఈ ఆలోచనలతోనే లోక సంఘర్షసమితి సభ్యత్వం పుచ్చుకోకుండానే అన్ని విధాల సమితి కార్యకలాపాలకు తోడ్పడాలని సంఘ నేతృత్వం నిర్ణయించుకొంది.

ప్ర. ఇన్ని పార్టీల సమర్ధన లభించడం చేత మీ పని సులువైందంటారా?

స. పార్టీల సమర్ధన వరకు బాగానే ఉందిగాని ప్రమాద తీవ్రత అంతకంటె ఉధృతంగా ఉంది. గృహనిర్బంధాలు, చిత్రహింసలకు గురిచేయడాలు, అర్ధరాత్రివేళ అరెస్టులు, వార్తాపత్రికలపైన సెన్సార్ ఇత్యాది చర్యలద్వారా ప్రభుత్వం సాగించిన దమనకాండ చూచి ప్రజలు భయభీతులైపోయారు. ప్రజాస్వామ్యంలో పత్రికలు ప్రముఖపాత్ర వహిస్తాయి. ముఖ్యంగా ఉద్యమంసాగుతున్న కాలంలో దాని మంచి,చెడులు తెలుసుకోవడానికి పత్రికలు ఎంతగానో ఉపయోగపడతాయి. కాని సెన్సార్ పేరుతో పత్రికల

నోళ్ళు నొక్కేశారు. అగ్రశ్రేణి నాయకులు సహితం ఎప్పుడు అరెస్టు అయ్యారు, వారిని ఎక్కడకు తీసుకుపోయారు అనే విషయం కూడా కూడా ప్రజలకు తెలియకుండాపోయింది ఆ రోజుల్లో వారు చేసిన ఘనకార్యాలు పొగుడుకొంటూ విద్యాచరణశుక్లా అన్న మాటలు గుర్తుకు వస్తున్నాయి-

'1857 తర్వాత సాగిన ప్రజాందోళనకు సంబంధించి దేశంలోని జనావళికి ఎప్పటికప్పుడు తాజా సమాచారం అందుతుండేది పత్రికలద్వారా. మారుమూలన ఉన్న గ్రామాలకు కూడా సమాచారం చేరుతుండేది. ఇప్పుడు మేము ఆ అవకాశం లేకుండా చేశాం. ఇప్పుడు దేశంలో ఇక ఎలాంటి ఆందోళనకొనసాగే అవకాశమే లేదు'

కోర్టు ద్వారాలు మూసేశారు. దేశం నలుమూలలకారు చీకట్లు క్రమ్ముకొన్న వాతావరణం నెలకొంది. ప్రజలు కూడా నైరాశ్యానికి లోనై 'ఇక ఎవరూ మాట్లాడటానికి అవకాశమేలేదు. ఆందోళనలకు చరమ గీతం పాడారు' అనుకొనేవారు. 'ఇప్పుడు సత్యాగ్రహాలు ఇత్యాది అహింసాత్మక ఆందోళనలవల్ల ప్రయోజనం లేనేలేదు. ఏదైనా చేయగల్గితే తుపాకి చేతబట్టి ఎమర్జన్సీకి కారకులైన వారిని హతమార్చడమే మార్గం' అని కూడా అనుకొనేవారు. నిరాశా, నిస్పృహలు అలుముకొన్న కారణంగా జనించిన భావాలు ఇవి. అంతేగాని దాని మంచిచెడ్డలు లోతుగా ఆలోచించి వెలిబుచ్చిన మాటలు కావు. సంఘం హింసాయుతపోరాటాన్ని సమర్థించే ప్రశ్నే లేదని స్పష్టం చేసింది హింసాకాండ ద్వారా దేశ కళ్యాణం అసంభవం అనేది మా దృఢ విశ్వాసం అని సంఘనేతృత్వం ప్రకటించింది. మేము ఏది చేసినా శాంతి, అహింసల ఆధారంగానే ప్రజలను జాగృత పరుస్తాం అని సంఘ నేతలు చెప్తారు. దీర్ఘకాలిక పోరాటానికి సన్నద్ధులు కావాలని, ప్రజాస్వామిక పద్ధతిలో ఏ ఆధారం

లభించినా దానిని ఊతంగా కొని ముందుకు సాగడానికి సర్వశక్తులు ఒడ్డి పని చేయాలని కార్యకర్తలకు మార్గదర్శనం చేశారు.

ప్ర. ప్రజలను ఈ దిశలో నడిపించడానికి మీరు తీసుకొన్న కార్యక్రమాలు కొన్ని వివరిస్తారా?

స. ఆచార్య సమ్మేళనాలు, కామన్‌వెల్త్ పార్లమెంటరీ కాన్ఫరెన్సు జరిగిన సందర్భంలో చేపట్టిన కార్యక్రమం ఈ కోవకు చెందినవే.

పూజ్య వినోబాభావే సమక్షంలో జరిగిన ఆచార్య సమ్మేళనంలాంటి కార్యక్రమాలు సమయాన్ని వృధా చేసుకొనేందుకేగాని దానివల్ల ప్రయోజనం ఏముంటుంది అన్న వాళ్ళున్నారు. కాని ఆచార్య సమ్మేళనం సందర్భంగా వారందరికి ఎమర్జన్సీ దురంతాలకు సంబంధించి వెలువడిన సాహిత్యం, కరపత్రాలు, పుస్తకాలు ప్యాకెట్లరూపంలో అందించడం జరిగింది. దానిద్వారా ఎంతో ప్రచారం జరిగింది. అనుకొన్న దానికంటె మంచి ఫలితాలే కనపడ్డాయి. అసలు ఇలాంటి కార్యక్రమాల ద్వారా ఏదో అద్భుతం జరిగిపోతుందనికాదు, విషయం పదిమందికి తెలియపర్చడమే ఉద్దేశ్యం. ఆ ఉద్దేశ్యం నెరవేరింది. అలాగే కామన్‌వెల్త్ పార్లమెంటరీ కాన్ఫరెన్స్ సందర్భంలో కూడ అనేక దేశాలనుంచి వచ్చిన ప్రతినిధుల సమక్షంలో స్వయంసేవకులు ఎమర్జన్సీ దురంతాలు తెలియజెప్పే అవకాశం తీసుకొన్నారు. అలా సాహసించిన స్వయంసేవకులను ప్రభుత్వం చిత్రహింసలకు గురిచేసింది. అయినా మొక్కవోని ధైర్యసాహసాలతో కార్యకర్తలు ఇలాంటి కార్యక్రమాలు అనేకం చేపట్టారు. ఢిల్లీలో వేలాది మంది ప్రైమరీ టీచర్ల సమావేశాలు జరుగుతున్నప్పుడు కూడా కార్యకర్తలు ప్రదర్శన చేసి సాహిత్యం పంచిపెట్టారు. ఇది సాక్షాత్తు ఇందిరాగాంధీ సమక్షంలోనే జరిగింది. ఇలాంటి కార్యక్రమాల

ద్వారా ఓ చిన్న అడుగు ముందుకు సాగినా జన జాగరణ కార్యానికి ఆమేరకు ప్రయోజనం చేకూరినట్లే.

ప్ర. ఎమర్జన్సీ సందర్భంలో మీరు సత్యాగ్రహాలు నిర్వహించడంలో గల ఉద్దేశ్యం ఏమిటి? అది ఎంతవరకు నెరవేరింది?

స. ప్రభుత్వం తన దమన కాండను కొనసాగించడం ద్వారా ప్రజల నోళ్ళు నొక్కి భయభీతులుగా చేసింది. ఎక్కడా అలజడి లేకపోయేప్పటికి ఉద్యమం చల్లారిపోయిందని ప్రభుత్వం ప్రచారం చేయసాగింది. మొట్టమొదట ఉద్యమం ప్రారంభించిన ఆ కొద్ది మందికి తప్ప మిగతా ప్రజలెవ్వరికీ ఉద్యమంపట్ల ఆసక్తిలేదని, ఎమర్జన్సీ వల్ల కలిగే లాభాలు ఆస్వాదిస్తున్నారని ప్రచారం ప్రారంభించారు. ఎమర్జన్సీ ప్రకటించిన తొలిరోజుల్లో నియంతృత్వ ధోరణిని నిరశిస్తూ విదేశాలలో ఎన్నో పత్రికలు విమర్శలు గుప్పించాయి. కాని అంతా సద్దుమణిగినట్లు అయ్యేప్పటికి వారు కూడా దీనిని పట్టించుకోవడం మానేశారు. వాస్తవానికి ప్రజలలో నూటికి తొంభైమందికి ఎమర్జన్సీ అంటే రోత. కాని అది ప్రకటితం కావడం లేదు. అందుచేత 1975 నవంబర్ 24 నుండి 1976 జనవరి 26 వరకు సమితి ఆధ్వర్యంలో దేశవ్యాప్తంగా సత్యాగ్రహాలు నిర్వహించాలని నిర్ణయించడం జరిగింది.

సత్యాగ్రహాలు మొదలయ్యాక మళ్ళీ ఉద్యమ సమాచారం ఉత్కంఠ కల్గించనారంభించింది. సత్యాగ్రహులపై జరపబడుతున్న దౌర్జన్యం, లాఠీచార్జీలు, జైళ్ళలో పెట్టే హింసలు, నాయకులు అనుభవిస్తున్న కష్టాలు ఇత్యాది వివరాలు పత్రికలలో రాకపోయినా బులెటిన్ల ద్వారా ప్రజల వద్దకు చేరవేయడం జరిగింది. అలాగే అరెస్టు కావించబడి జైళ్ళలో బంధించబడిన కార్యకర్తల బంధుమిత్రుల ద్వారా కూడా సమాచారం వ్యాపించేది. విదేశీ

పత్రికలు కూడా ఈ సమాచారం అందించడంలో ఉత్సుకత చూపనారంభించాయి. ఉద్యమం సద్దుమణిగిపోలేదని, ప్రజలంతా ఎమర్జన్సీని ఏవగించుకొంటున్నారని విదేశాలవారు బాగా గ్రహించగలిగారు. విదేశీ ప్రభుత్వాలు కొన్ని ఎమర్జన్సీ విధించడాన్ని వ్యతిరేకిస్తూ భారతప్రభుత్వానికి నిరసన కూడా తెలిపాయి. లక్షమందికి పైగా సత్యాగ్రహులు అరెస్టు అయినారు. వీరిలో 85-90 శాతం మంది స్వయంసేవకులే. అలా అరెస్టు అయిన వారిలో టీచర్లు, డాక్టర్లు, లాయర్లు, ఇంజనీర్లు, కార్మికులు, విద్యార్థులు, కర్షకులు, వ్యాపారులు- అన్ని వర్గాల ప్రజలు ఉన్నారు.

ప్ర. రాజకీయనాయకులపైన ఉన్నవి, లేనివి ఎన్నెన్నో కేసులు పెట్టి వాటిలో ఇరికించాలని ప్రయత్నిస్తుంటుంది ప్రభుత్వం. అలా ఆర్.యస్.యస్ మీద కేసులు బనాయించ లేదా?

స. అబద్ధపు ప్రచారం చాలా చేసింది ప్రభుత్వం. హింసను ప్రేరేపిస్తున్నదని, విదేశాలనుంచి డబ్బు వస్తోందని, విదేశీ సంస్థలతో సంబంధాలున్నాయని ఎన్నో అబద్ధాలు ప్రచారం చేసింది. అయితే ఈ దుష్ప్రచారాన్ని సమర్థించేందుకు కొన్ని సాక్ష్యాధారాలను సేకరించమని ప్రభుత్వ ఇంటలిజెన్స్ డిపార్ట్‌మెంటు వారిని కోరితే వారు కొంత ప్రయత్నం చేసి ఆర్.యస్.యస్ పైన అలాంటి కేసులు బనాయించడానికి కూడా తగిన ఆధారాలు లేవని స్పష్టపరిచారు. ఇక ముందు అలాంటి విద్రోహక చర్యలు చేపడతారేమో అని సూచనప్రాయంగా చెప్పడానికి కూడా ఆధారాలు లేవు అన్నారు. చేసేదిలేక ప్రభుత్వం ఈ ప్రచారం మానుకొంది.

ప్ర. ఎమర్జన్సీకి వ్యతిరేకంగా సాగిన ఉద్యమానికి ప్రవాసభారతీయులు ఏవిధంగా ఉపయోగపడ్డారు?

స. వివిధ దేశాలలో నివసిస్తున్న భారతీయులు ఫ్రెండ్స్ ఆఫ్ ఇండియా సొసైటీ ఇంటర్నేషనల్, లండన్, ఇండియన్స్ ఫర్ డెమోక్రసీ, అమెరికా, వంటి సంస్థలు అలయన్స్ ఎగైనెస్ట్ డిక్టేటర్‌షిప్, మరియు అకాలీదల్‌లతో ఏర్పాటుతో భారతదేశ ప్రజాస్వామ్యపునరుద్ధరణ ఫ్రంట్‌ను నిర్మాణం చేసుకొని వార్తాపత్రికల ద్వారా, టి.వి., రేడియోల ద్వారా, చర్చ గోష్ఠుల ద్వారా ఎమర్జన్సీ గుట్టును రట్టుచేశారు. విదేశాలలో పత్రికా విలేకరులు, రాజకీయ ప్రముఖులు అడుగుతుండే ప్రశ్నలకు సమాధానం చెప్పలేక భారత ప్రభుత్వాధికారులు, మంత్రులు సతమతమవుతుండేవారు. విదేశాలలో పర్యటనలు చేసి తిరిగి వచ్చిన మంత్రులు, రాయబారులు ఇందిరాగాంధీ పేరు విదేశాలలో మట్టిగొట్టుకుపోయిందని, ప్రభుత్వం విశ్వసనీయత కోల్పోయిందని చెప్పేవారు. ఈ రకమైన వాతావరణం నిర్మాణం స్వయంసేవకుల కృషి వల్లనే సాధ్యమైంది.

ప్ర. సత్యాగ్రహాల పర్వం పూర్తి అయ్యాక కూడా ఇందిరాగాంధి ఎమర్జన్సీ కొనసాగిస్తే మీరేమి చేయాలనుకొన్నారు.

స. సత్యాగ్రహాలు పూర్తికాగానే సంఘ కార్యకర్తలను సమావేశపరచి భావి కార్యక్రమాన్ని గూర్చి చర్చించడం జరిగింది. ఈ చర్చలలో దేశం ముందు రెండేరెండు ప్రత్యామ్నాయాలున్నట్లు గుర్తించనైంది- 1.ఇందిరాగాంధీ ఎన్నికలుగనుక ప్రకటిస్తే దేశంలో పని చేస్తున్న చిన్న, పెద్ద రాజకీయ పక్షాలన్నింటిని ఒక్కత్రాటిమీదకు తెచ్చి ఒక పెద్ద రాజకీయ పార్టీగా ఏర్పరచి అలా ఏర్పడిన రాజకీయపార్టీ విజయానికి, ఇందిరాగాంధీని ఓడించేందుకు, సంఘస్వయంసేవకులంతా తమ సంపూర్ణ శక్తిని ఉపయోగించి కార్యరంగంలోకి దూకడం.

దేశం ఒక అసాధారణమైన పరిస్థితిని ఎదుర్కొంటున్నప్పుడు దానినుండి అధిగమించేందుకు అపారమైన ధైర్య,సాహసాలు, కఠోరమైన పరిశ్రమ, సమయమిచ్చి పనిచేసే మానసికత ప్రజల హృదయాలలో రగల్చగలగాలి. కృషిచేస్తూపోతే ప్రజాస్వామ్యవ్యవస్థలో ఇది నిర్మాణం అవుతుందికాని బహునిదానంగా అవుతుంది. అయినా తప్పదని అందుకు స్వయంసేవకులు సిద్ధం కావాలి.

2. ఒకవేళ శ్రీమతి ఇందిర ఎన్నికలు నిర్వహించకపోతే ప్రజాస్వామ్యవిలువల పునఃస్థాపనకుగాను దీర్ఘకాలిక పోరాటానికి ప్రజలను సన్నద్ధులుగా చేయాలి. అందుకుగాను దేశవ్యాప్తంగా శాంతియుతమైన అహింసాపోరాటం సాగించాలి- ఇది మరో ప్రత్యామ్నాయం.

ఈ ఉద్దేశ్య పరిపూర్తికి కార్మిక వర్గాలను, రైతాంగాన్ని బలహీన వర్గాలను, విద్యార్థులను, విద్యాధికులను, ఉపేక్షితవర్గాలైన హరిజనులు ఇత్యాది ప్రజలను ఆత్మీయంగా దగ్గరకు తీసుకొని వారిని దీర్ఘకాలిక పోరాటానికి సంసిద్ధులుగా చేయడం.

ప్ర. ప్రజాస్వామ్యమైనా, నియంతృత్వపాలనైనా ప్రజలకు మేలు చేయడమన్నది ప్రధానం. అలాంటప్పుడు ఇందిరాగాంధీ నియంతృత్వ విధానాలను మీరెందుకు అంతగా వ్యతిరేకించారు?

స. 1971 పాకిస్థాన్ భారత దేశంపైన దాడి చేసినప్పుడు మన సైనికులు వీరోచితంగా పోరాడి మన దేశ పశ్చిమ సరిహద్దులలో ఉన్న పాక్ ప్రదేశాలు కొన్నింటిని పట్టుకొన్నారు. అక్కడి ప్రజల పరిస్థితి చూస్తే దీనాతిదీనంగా ఉంది. పాకిస్థాన్ ఏర్పడి 24 ఏళ్ళు అయినప్పటికి ప్రజల దురవస్థ పెరిగిందేగాని తగ్గలేదు. పాకిస్తాన్‌లోగల నియంతృత్వ ప్రభుత్వాలు ప్రజలకు ఏమాత్రం

మేలు చేయలేదని ఆ ఆక్రమిత ప్రాంతాలు దర్శించిన భారతప్రజలు గ్రహించారు.

నియంతృత్వంకొనసాగితే మన పరిస్థితి అంతే అవుతుంది. నియంతృత్వ పాలనలో కొన్ని కుటుంబాలు అమితంగా లాభపడటం మిగతా ప్రజలంతా అవస్థల పాలు కావడం జరుగుతుంది. ఇందిర పాలనలో అదే జరుగుతోంది. దేశ ఆర్థిక స్థితి దినదినం దిగజారుతోంది. ప్రభుత్వం చెప్పే లెక్కల ప్రకారం చూచినా తలసరి వస్తు,సేవల వినియోగం తగ్గిపోయి జీవన ప్రమాణం తగ్గిపోతోంది, పేదరికం పెరిపోతోంది. పరిశ్రమలు మూతబడుతున్నాయి. నిరుద్యోగం పెరిగిపోతోంది. వివిధ వర్గాల ప్రజలలో అసంతృప్తి పెరిగిపోతోంది. అసంతుష్టిలో రగిలిపోతున్న ప్రజలు సులభంగానే ప్రభుత్వ వ్యతిరేకపోరాటానికి సన్నద్ధులవుతారు. ప్రజలలో అలముకొనియున్న ఈ అసంతుష్టిని, ఆక్రోశాన్ని యోజనాబద్ధంగా పోరాట దిశలో మలుచు కొంటే దేశవ్యాప్తంగా శాంతియుతమైన అహింసాయుత పోరాటానికి భూమిక ఏర్పడుతుంది. ఇది గుర్తించిన సంఘం ఈ దిశలో తన ప్రయత్నాలు ముమ్మరంగా కొనసాగించింది. నియంతృత్వపాలనలో ప్రజలకు మేలు జరగదనేది సాక్ష్యాధారాలతో ప్రజలముందు పెట్టింది.

ప్ర. ఆ సమయంలో ఇందిరాగాంధి ఎన్నికలు ప్రకటించడంలోని ఆంతర్యం ఏమిటంటారు? అది ఆమె చేసిన పెద్దపొరపాటు కాదంటారా?

స. తాను విధించిన ఎమర్జన్సీకి ఒక సైద్ధాతిక రూపమివ్వడానికై శ్రీమతి ఇందిర మొదటి నుంచీ తంటాలు పడుతు వచ్చింది. కాబట్టి పరిస్థితులు తనకు అనుకూలంగా ఉన్నాయని భావించిన తక్షణం ఎన్నికలు ప్రకటిస్తుందని చాలామంది భావించారు. ఆమెగారు ఎన్నికలు ప్రకటించడానికిగల కారణాల

ఖచ్చితంగా వివరించలేకపోయినప్పటికి అమెరికా అధ్యక్షుడు జిమ్మీ కార్టర్ విధించిన ఆర్థిక దిగ్బంధాలు, దేశంలో దినదినం దిగజారిపోతున్న ఆర్థిక పరిస్థితి, ఎమర్జన్సీకి వ్యతిరేకంగా అజ్ఞాతంగా సాగుతున్న ఉద్యమం ప్రజలలో రగుల్కొల్పిన అసంతృప్తి ముఖ్యకారణాలుగా పేర్కొనవచ్చు.

దేశం ఎదుర్కొంటున్న ఆర్థిక పరిస్థితి రానురాను ఇంకా దిగజారిపోయే సూచనలు ఉన్నాయి కాబట్టి ఎన్నికలు అంటూ పెడితే ఇప్పుడే పెట్టాలని తన ఆర్థిక సలహాదారుల సలహా కూడా ఆమెపైన పని చేసి ఉంటుంది. అంతేగాక నియంతృత్వంలో ఎక్కడైనా నియంత చుట్టూ భజనపరులు చేరుతారు. వారు ప్రయోజనకరమైన సలహాలకంటె నియంతకు ఇష్టమైన సలహాలే చెపుతుంటారు. 21 మాసాల ఎమర్జన్సీపాలనలో సాగిన దమనకాండ చూచాక ఇందిరాగాంధీకి వ్యతిరేకంగా ఓటు చేసే సాహసం సామాన్య ప్రజలెవ్వరూ చేయజాలరనే భ్రమ కూడా ఉండి ఉండవచ్చు. ఈ కాలంలో ఇందిరాగాంధి వ్యవహరించిన తీరు విదేశాలలో ఆమెను అప్రతిష్టపాలు చేసింది. వీటన్నింటి నుండి బయటపడాలంటే ఎన్నికలు నిర్వహించి ఘన విజయం సాధించడం ద్వారా మాత్రమే అది సాధ్యమవుతుంది అని ఆమె భావించి ఉంటుంది.

ఆమె సమర్థకుల అభిప్రాయంలో ఆమె చేసిన మొదటి పొరపాటు సంఘంపైన నిషేధం పెట్టడం అయితే రెండో పొరపాటు ఎన్నికలు ప్రకటించడం.

ఎన్నికలు ప్రకటించాక రోజురోజుకు పరిస్థితులు ఆమెకు ప్రతికూలం అవుతూపోయాయి. ప్రజలు తమ అసంతృప్తిని గట్టిగా వ్యక్తీకరించడం ప్రారంభించారు. ఇందిరాగాంధీ పాలనకు మంగళం పాడందే సంఘంపైన నిషేధం తొలిగిపోదు, దేశ భవిష్యత్తుకూడా బాగుపడదు అని సంపూర్ణంగా

గ్రహించిన స్వయంసేవకులు ఎన్నికలలో ఇందిరను ఓడించడానికి తమ స్వశక్తిని ఒడ్డి పని చేశారు. విజయం సాధించారు.

ప్ర. లోకసంగర్ష సమితి కార్యకలాపాలనుంచి ఆర్.యస్.యస్‌ను తప్పించేందుకు శ్రీమతి ఇందిర ప్రయత్నించలేదా?

స. తలకొకదారిగా పయనిస్తున్న రాజకీయ పక్షాలన్నింటిని ఏకత్రాటిపైకి తెచ్చి కలిసికట్టుగా తనకు పోటీగా ఎన్నికలలో నిలిపే సత్తా ఒక ఆర్.యస్.యస్‌కే ఉన్నదన్న విషయం ఇందిరాగాంధీకి తెలుసు. అది వాస్తవం కూడా. లోక సంగర్ష సమితి నిర్వహించిన పోరాటంలో ముఖ్యసూత్రధారిగా నిలిచి కథ నడిపిన సంస్థ ఆర్.యస్.యస్ అని అందరికి తెలుసు.

అందుచేత తన ముఖ్య తాబేదారులలో ఒకరిని పంపించి ముఖ్యమైన సంఘ అధికారులతో శ్రీమతి గాంధి సంభాషణలు జరపాలని కోరుకొంటోంది అనే వర్తమానం అందించింది. సంఘలోని ఉన్నతాధికారులు ఎక్కడ దొరుకుతారో ఆమెకు తెలియదుగాని వర్తమానం ఎక్కడకు పంపిస్తే వారికి చేరుతుందో అది మాత్రం తెలుసు. ఆమె పంపిన అధికారితో సంఘంలోని ముఖ్యులు ఒకరు ఒక గంట,గంటన్నరపాటు మాట్లాడారు. ఆ సంభాషణలో చోటు చేసుకొన్న ముఖ్య విషయం ఒక్కటే - సంఘస్వయంసేవకులు తమ యావచ్ఛక్తిని ఉపయోగించి శ్రీమతి ఇందిర ప్రభుత్వాన్ని ఎన్నికలలో ఓడించే కార్యంలో నిమగ్నులై ఉన్నారు. వారు ఈ ప్రయత్నం విరమించాలి. వారు ఆ విధంగా చేయడానికి ఒప్పుకొంటే సంఘంపైన నిషేధం ఎత్తివేయడం, జైళ్ళలో ఉన్న స్వయంసేవకులందరిని విడుదల చేయడం జరుగుతుంది.'రాజీ అంటూ కుదిరితే కొంత మీరు తగ్గడం, కొంతమేము తగ్గడం అనేది ఎలాగూ ఉంటుంది' అని కూడా స్పష్టంచేశాడు మధ్యవర్తిత్వానికి వచ్చిన అధికారి.

దానికి జవాబుగా సంఘ అధికారులు 'పూజ్యబాలాసాహెబ్ రాసిన ఉత్తరాలు కూడా ఆమెకు అందకుండా చూశారు. ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగితే అప్పటిమాట ఎలావుండేదో, కానీ ఇప్పుడు మాత్రం మీ ప్రస్తావనను అంగీకరించే అవకాశం లేదు. ఇప్పుడిక ఈ సమస్య పరిష్కారం ఎన్నికల ద్వారా తేల్చుకోవలసిందే అన్న నిర్ణయానికి వచ్చారు స్వయంసేవకులు. కాబట్టి వారు తమ యావచ్ఛక్తిని వినియోగించి ఎన్నికల రణరంగంలో జొరబడ్డారనేది సత్యం. ఇప్పుడిక ఆ పోరాటం నుండి వారిని విరమింపచేసే ప్రశ్న ఉత్పన్నంకాదు' అని స్పష్టం చేశారు.

'ఇప్పుడు జైళ్ళలో ఉన్న స్వయంసేవకులను విడుదల చేస్తూ సంఘంపైన నిషేధం ఎత్తివేయడం వలన మీకు సమకూరే ప్రయోజనం కూడా ఏమీ వుండదు. మీ చర్యల వల్ల వేలాది కుటుంబాలుచితికిపోయాయి. అనేకులకు జీవనోపాధి పోయింది. లక్షలాది మంది ఎన్నో యాతనలకు గురిచేయబడ్డారు. మీరిప్పుడు ఖైదీ చేయబడినవారిని వదలిపెట్టినంత మాత్రాన పరిస్థితిలో పెద్దగా మార్పేమీ వుండదు. కాకపోతే కోపతాపాలు కొంత తగ్గుతాయేమో' అని కూడా సంఘ అధికారులు చెప్పారు.

అప్పుడు అధికారి '21 మాసాలు జైళ్ళలో మ్రగ్గిపోయిన కారణంగా ఖైదీలలో ఆత్మబలం నశించి వుంటుంది ఇంకెంతకాలం వారు పట్టు సడలకుండా వుండగలరు? అని అడిగాడు.

'జైళ్ళలో ఉన్న స్వయంసేవకుల కుటుంబాల యోగక్షేమాలు మేము నిరంతరం విచారిస్తూనే వున్నాం. వారందరితో మాకు సన్నిహిత సంబంధాలున్నాయి. వారి మనో నిశ్చయం, నైతికశక్తి ఏమాత్రం సడలిపోలేదు. ఇంకా రెండుమూడేళ్ళు జైళ్ళలో ఉండవలసి వచ్చినా వారి మానసిక స్థితిలో ఎలాంటి మార్పు రాదు. మేము అలసిపోయాము అనుకుంటున్నారేమో

ఇంకా రెండు మూడేళ్ళు పోరాటంసాగినా అందుకు సిద్ధంగానే వున్నాం మీరు మీ వైపునుంచే ఆలోచిస్తున్నారు. మా ఆలోచనలో తద్భిన్నంగా వుంటాయి. స్వయంసేవకులు జైళ్ళనుండి విడుదలై వచ్చాక సమాజంలో కలిసిపనిచేయాలి. వారు ధర్మపోరాటం సాగించారనే ఆత్మవిశ్వాసంతో సగర్వంగా తలెత్తుకు తిరిగే రీతిగా ఈ పోరాటం ముగియాలి. మీ దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి కాదు. మీ మాటలు నమ్మి ఇప్పుడు పోరాటం ఆపేస్తే సమాజాన్ని మోసం చేసినట్లు, ప్రజల నమ్మకాన్ని వమ్ముచేసినట్లు అవుతుంది. వీరి మొఖాన ప్రజలు కళ్ళాపుజల్లుతారు. ఇందుకు మా స్వయంసేవకులు సిద్ధపడతారని మీరు అనుకుంటున్నారా! నిషేధం ఎత్తివేయడం , జైళ్ళలో వున్న స్వయంసేవకులను విడిచిపెట్టడం అనేది మీరు తీసుకోవలసిన నిర్ణయాలు. మీ ప్రకటనలో సంఘాన్ని అవమానపరిచే ప్రయత్నం ఇసుమంత ఉన్నా మా ఆగ్రహాన్ని చవిచూస్తారు. స్వయంసేవకులను తిరిగి ఉద్యోగాలలో చేర్చుకోవాలి. మా కార్యాలయాలకు వేసిన సీళ్ళు తీయించి మా ఆస్తులు మాకు అప్పగించా' లని సంఘ అధికారులు స్పష్టంగా చెప్పారు.

అప్పుడు ఆ అధికారి 'మీ సమాధానం ఇలా వుంటుందని నేను ముందే ఊహించాను. ఏదో కొద్దిమంది వృద్ధకార్యకర్తలు జైళ్ళళో ఉన్నారు. బాగా పనిచేసే కార్యకర్తలంతా బైటే ఉన్నారు. మేము బహు కొద్దిమందిని మాత్రం అరెస్టు చేయగలిగాం. ఇకపోతే మీసా క్రింద అరెస్టయిన కార్యకర్తల కుటుంబాల సంగతి మీరు బాగా పట్టించుకుంటున్నారు. వారికి పెద్ద బాధలేదు. మీ సంఘటన చెక్కుచెదరకుండా వుంది. ఉన్నతాధికారులు దేశమంతా పర్యటన చేస్తూనే వున్నారు. ఇక మీరు నష్టపోయిందేముంది' అంటూ సెలవుతీసుకున్నారు.

ప్ర: శ్రీమతి గాంధీ పంపిన రాజీవర్తమానం మీరు ఆమోదించకుండా తిరస్కరించడానికి కారణమేమిటి?

స: అందువలన సమాజానికికానీ , సంఘానికికానీ ఎలాంటి ప్రయోజనం లేకపోవడం మొదటి కారణం. ఇకపోతే ఇందిరమ్మ రాజకీయాలు తెలిసినవాడెవడైనా ఆమెను సంపూర్ణంగా విశ్వసించడం జరగదు. ఇంత రాజీ ప్రతిపాదన పంపిన పెద్దమనిషి అది తిరస్కరించబడినట్లు వర్తమానం చేరిన మర్నాడే సంఘాన్ని తిట్టినతిట్టుతిట్టకుండా తిట్టింది. సంఘం నెత్తిన అనేకమైన అభాండాలు వేసింది. 

అయితే ప్రజలు ఆమె చెప్పిన అబద్ధాలను ససేమిరా నమ్మలేదు. అందుకే ఎన్నికలలో ఆమెను చిత్తుగా ఓడించారు. ప్రజాస్వామ్యానికి పట్టంకట్టారు. చీకటి రాత్రులు తొలగిపోయి కొత్త ఆశల వెలుగులు దేశమంతటా ప్రసరించాయి. ప్రజలపైన సంఘానికి, సంఘంపైన ప్రజలకు ఉన్న విశ్వాసం దృఢతరమైంది. 

# అనుబంధం - 3



## పత్రిక ఎలా వుండాలి.



శ్రీ అశోక్ సింఘాల్ గారు ఒక వారపత్రిక ప్రారంభించదలచి ఆ పత్రిక ఎలా వుండాలో తెలియజేయమని శ్రీ బాపూరావ్‌జీని అడిగితే వారు 12-8-77నాడు ఈ క్రింది సూచనలు వ్రాసి పంపించారు.

1. పత్రిక జాతీయ ప్రయోజనాలు కాపాడటంలో కావలి కుక్కవలె పనిచేయాలి. జనతా పార్టీ చేసిన మంచి పనిని తప్పకుండా సమర్ధించాలి. కానీ తప్పుడు పనులుంటే మాత్రం నిర్భయంగా విమర్శించాలి. పార్టీ

గ్రూపులు గ్రూపులుగా చీలి జాతీయ ప్రయోజనాలు దెబ్బతీస్తున్నప్పుడు నిర్మొహమాటంగా విమర్శించాలి.

2 సమస్యను అన్ని కోణాలనుండి పరిశీలించిన తరువాతనే విమర్శించాలి. ఆ విమర్శ నిర్మాణాత్మకమైనదిగానూ, ఒప్పించేందుకే చేస్తున్న కృషిగానూ కనిపించాలి. బురద చల్లేందుకు కాకూడదు.

3. పత్రిక తన స్వతంత్ర్య విధానాలకు కట్టుబడి సాధారణ ప్రజానీకం ఉత్సాహంతో చదివేందుకు అనువైన విషయాలు అందించాలి. పత్రిక జీవన రంగంలో వివిధ అంశాలను స్పృశించాలి. వివిధ రంగాలలో లబ్ధప్రతిష్ఠులైన వ్యక్తులను గూర్చి వ్రాయాలి. ఆర్.ఎస్.ఎస్. నిర్వహిస్తున్న బులిటిన్ లాగా వుండకూడదు.

4. వ్యక్తులపై విరుచుకుపడడం కానీ వ్యక్తిగత విమర్శలు కానీ చేయరాదు.

5. శ్రీమతి ఇందిరకు సంబంధించిన వార్తలు సాధ్యమైనంతవరకు పతాకశీర్షికలలో కనిపించకూడదు.

6. శ్రీమతి గాంధీకి లేక, నెహ్రూ కుటుంబానికి సంబంధించిన వార్తలు ప్రచురించకపోవడమే మంచిది.

7. విధాన నిర్ణయాలకు సంబంధించిన విమర్శలకు మాత్రమే చోటు కల్పించాలి.

8. అవినీతి, బంధుపక్షపాతం, డబ్బుకు సంబంధించిన కుంభకోణాలు మొత్తం పత్రికను ఆక్రమించరాదు. ఎంతో ముఖ్యమనుకుంటే అలాంటివి ఒకటి మాత్రం పత్రికలో కనిపించవచ్చు.

9. ఎమర్జెన్సీ కాలంలోని వికృతులకు సంబంధించి పుస్తకాల రూపంలోను, షా కమీషన్ రిపోర్టు రూపంలోనూ వెలువడుతున్నాయి కాబట్టి అవి పత్రికలో చోటుచేసుకోరాదు.

10. ప్రాంతీయ వార్తలు ఆయా ప్రాంతాల వార్తా పత్రికలలో అప్పటికే వెలుగుచూసి వుంటాయికాబట్టి అవి తిరిగి ఈ పత్రికలో ప్రచురిస్తే పాఠకుడు విసుగుచెందుతాడు.

కొన్ని ముఖ్యమైన అంశాలు ఎంపికచేసుకొని వివిధ ప్రాంతాల వార్తలు శీర్షికన సంక్షిప్తంగా ప్రచురించవచ్చు.

11. ఏదో చేతికి అందిన వార్త ప్రచురించడం కాదు. యోజనా బద్ధంగా పత్రిక విధానం నిర్ణయించుకొని వివిధ అంశాలపై వ్రాయగల వ్యక్తులను కాలమిస్టులుగా ఎంపికచేసుకొని వారిచేత వ్రాయించే ఏర్పాటు జరగాలి.

12. జాతీయ అంతర్జాతీయ ప్రాముఖ్యంగల సమాచారం ఏదీ తప్పిపోకుండా పాఠకునికి అందించే ప్రయత్నం జరగాలి. ఆ సంఘటనల పరిణామం కూడా పాఠకులకు తెలియజెప్పాలి.

వివిధత్వం గల అంశాలు పత్రికలో కనపడాలి.

13. మన జాతి ప్రతిష్ఠను పెంచేది మన సాంస్కృతిక విలువలను ప్రస్ఫుటీకరించేది అయిన అంశానికి సంబంధించి కనీసం ఒక్క వ్యాసమైనా పత్రికలో వుండాలి. అది పాఠకుని మనస్సులో మన జాతిపట్ల స్వాభిమానాన్ని , మన విజయాలపట్ల ఆనందాన్ని నింపుతుంది.

14. చారిత్రక కథల పట్ల అభిరుచి సన్నగిల్లిందికాబట్టి ప్రముఖ వ్యక్తుల జీవిత చరిత్రలనుండి స్ఫూర్తినిచ్చే ఘట్టాలు ఎంపికచేసుకొని ప్రచురించడం మంచిది. కేవలం సాహసకృత్యాలేకాదు. ఇతరత్రా మానవ జీవితాన్ని ఉన్నత శిఖరాలకు చేర్చగల ఘట్టాలు ఏవైనా ఎంపిక చేసుకోవచ్చు. ఆ వ్యక్తి జాతి ప్రగతికై ఏవిధంగా తోడ్పడిందీ ఒక పేరాలో సంక్షిప్తంగా తెలియజేయవచ్చు. ''మన జీవితాలను కూడా ఉత్తమంగా తీర్చిదిద్దుకోవచ్చు'' అనే సందేశం గొప్ప వ్యక్తుల జీవితాలు మనకు అందిస్తాయి. ''

15. శ్రీ జయప్రకాశ్ నారాయణ్ ఆలోచనలు అలాగే ఇతర గొప్ప వ్యక్తుల ఆలోచనలు ఈ తరానికి ప్రయోజనం కలిగించేవి ఏవైనా అందించవచ్చు.

16. రాజకీయ రంగంలో కాకుండా ఇతర క్షేత్రాలలో సుప్రసిద్ధులైన వ్యక్తులెందరో వున్నారు. జాతి జీవితాన్ని ఉన్నత శిఖరాలకు కొనిపోయే అంశాలపై వారిని ఇంటర్వ్యూ చేసి అది ప్రచురించవచ్చు.

17. సేవా కార్యక్రమాలు చేపట్టి వివిధ రంగాలలో పనిచేసిన సంఘ కార్యకర్తలుకానీ, ఇతర స్వచ్ఛంద సంస్థలు కానీ సాధించిన విజయాలు పత్రిక ద్వారా తెలియజెప్పవచ్చు. ఆయా వ్యక్తుల వ్యక్తిత్వాన్ని గూర్చి చాటిచెప్పవచ్చు.

18. మన వారపత్రికలో సహజంగానే రాజకీయాలకు సంబంధించిన అంశాలు ఎక్కువగా చోటు చేసుకుంటాయి కానీ వాటితోబాటు ఇతర అంశాలకు కూడా ప్రాధాన్యం ఇచ్చినప్పుడే పాఠకుని జ్ఞానతంత్రులు స్పందించి జాతీయ సమస్యలపైన, అంతర్జాతీయ సంఘటనలపైన సరైన అవగాహన కల్పించుకొనే వీలవుతుంది.

పైనుదహరించిన సూచనలు పరిశీలిస్తే పత్రికారంగంలో బాపూరావ్‌జీకి గల అనుభవం ఎంత విలువైనదో, వారిపరిశీలనా శక్తి ఎంత నిశితమైనదో బోధపడుతుంది.


భావూరావ్‌జీ, బాపూరావ్ మోఘేజీ

‘‘ఆబాజీ మరణం మన సంఘం అనుభవం,
దూరదృష్టి గల ఒక జ్యేష్ఠ కార్యకర్తను
పోగొట్టుకొన్నది. వారు జగన్మిత్రులు’’

– శ్రీ బాలాసాహెబ్ దేవరస్

‘‘విషయాన్ని అర్థం చేసుకొనడంలో,
సమస్యలకు సరియైన పరిష్కారాలు
సూచించడంలో ఆబాజీకి గల బహుముఖ ప్రజ్ఞ,
ఓరిమి మనం ఏనాడూ మరువజాలం’’

– శ్రీ రజ్జూ భయ్యా

# జీవనరాగం

## చదువులలోని మర్మమెరిగిన వాడు

బాల్యంలోనే తల్లి మరణించిన కారణంగా ఆబాజీ తమ అన్నగారైన అప్పాధట్టే సంరక్షణలో పెరిగారు. అప్పాధట్టేగారి భార్య ఆబాజీని తల్లికంటె ఎక్కువ ప్రేమతో పెంచింది. అప్పాధట్టే సాధుస్వభావుడు. పరోపకార బుద్ధిగలవాడు. బ్యాంకు ఉద్యోగుల సంఘంలో కూడా నేతృత్వంవహించి ఎందరికో మేలు జేసిన వ్యక్తి. అప్పాధట్టే ప్రోత్సాహం లేకపోతే ఈనాడు నేను ఈ ఉన్నత స్థితిలో ఉండేవాడిని కాదు. నేను నిరాశా నిస్పృహలతో అలమటిస్తున్న రోజులలో వెన్ను చరిచి అభయమిచ్చి ముందుకు నడిపి నాలో ధైర్యం,విశ్వాసం నెలకొనేట్లు చేసిన మహానుభావుడాయన అంటూ కొనియాడే స్టేట్ బ్యాంకు ఉద్యోగులు ఎందరో ఉన్నారు. ఇక అప్పాధట్టే అదృష్టం కొద్దీ ఆయనకు అన్ని విధాల తగిన పత్ని లభించింది. ఆమె దయామయి. మాతృత్వానికి అర్థం చెప్పే ప్రవర్తనగల స్త్రీ మూర్తి. దైవభక్తి,పరోపకార బుద్ధి ఆమెకు పుట్టుకతో లభించిన వరాలు. కాబట్టి ఆ ఆదర్శ దంపతుల పాలన పోషణలో పెరిగిన ఆబాజీకి పరోపకారబుద్ధి,ఆధ్యాత్మిక చింతన,సంఘసంపర్కం సహజంగా లభించాయి.

## గృహ వికాసం

1918 నవంబర్ 24నాడు ఆబాజీ ముంబైలో జన్మించారు. స్కూలులో చదువుకొంటున్న రోజుల్లో అన్నగారు శ్రీ అప్పాధట్టే సంఘనిక్కరు,తెల్లచొక్కా,నడుముకు బెల్టు,తలకు నల్లటోపీ ధరించి సంఘ శాఖకు వెళుతుంటే ఆసక్తిగా చూస్తుండేవాడు.

చెప్పారు. డాక్టర్జీ ఉన్న రోజుల నుండి కూడా ఆ కుటుంబం సంఘకుటుంబంగానే ఉంటూవచ్చింది. బాలాసాహెబ్ చిన్నప్పుడు వాళ్ళ అమ్మగారితో నాతోపాటు ఎవరు వచ్చినా కులము,మతము అంటూ అడగకుండా భోజనం వడ్డించు లేదా నేను ఎవరినీ తీసుకురాను అని చెప్పినట్లు మనం విన్నాం. కాని ఆబాజీకి వాళ్ళ ఇంట్లో ఆ విధంగా చెప్పవలసిన అవసరమే రాలేదు. మొదటినుండి సంఘ వాతావరణం ఉన్న కారణంగా ఆబాజీతోగాని,వారి అన్నగారితోగాని,వాళ్ళ సోదరి సింధు తాయీతోగా స్వయంసేవకులుగాని,సేవికలుగాని భోజనానికి వస్తే ఆబాజీ వాళ్ళ వదినగారు ఈ వివరాలు ఎన్నడూ అడిగేవారు కాదు. కుటుంబ సభ్యులతో పాటు కూర్చుని స్వయంసేవకులు భోజనం చేసేవారు.

ఆబాజీ ప్రచారక్‌గా వచ్చేశాక ఒక సంవత్సరం మాత్రం బయట ఉన్నారు. ఇక ఆ తర్వాత అంతా గురూజీతోను,బాలాసాహెబ్‌జీతోను వారి ఆంతరంగికుడుగా ఉంటూవచ్చారు. గురూజీతోపాటు 28 సంవత్సరాలు, బాలాసాహెబ్‌జీతోపాటు 14 సంవత్సరాలపాటు కలిసి యావద్భారతం పర్యటించారు.

గురూజీకి సహాయకుడుగా చేరే ముందు ఒక సంవత్సరంపాటు బెంగాల్‌లో ప్రచారక్‌గా పనిచేశారు. క్రొత్తగా ప్రచారక్‌గా వచ్చిన వ్యక్తి ఎవరైనా సంఘంలో ఉన్న కార్యపద్ధతిలో రాటుతేలి తన శక్తియుక్తులు ఏమేరకు ఉపయోగపడతాయో ఋజువు చేసుకోవలసి. ఉంటుంది. అయితే ఇది ఒక పరీక్షకాదు, పరిశీలన మాత్రమే. క్రొత్త శాఖలు పెట్టడం, పాతశాఖల పటిష్టంగా తయారయ్యేట్లు చూడటం, పెద్దలతో సంపర్కం, కార్యక హృదయాలలో చోటు చేసుకోవడం, తోటికార్యకర్తలను త కలిసికట్టుగా ముందుకు తీసుకుపోవడం, స్వయంసేవకులకు సైద్ధా

అవగాహన కలిగించడం ఇత్యాది విషయాలలో ఆవ్యక్తికి గల చొరవ ఎలాంటిదో పరిశీలించడం జరుగుతుంది. బెంగాల్‌కు ఒక ప్రత్యేకత కూడా ఉంది. పూజ్య శ్రీగురూజీ,పూజ్యబాలాసాహెబ్‌జీ కూడా ప్రచారక్‌గా పనిచేసిన ప్రాంతం అది.క్రొత్తగా ప్రచారక్‌గా వచ్చిన వ్యక్తిసామర్థ్యాన్ని మూల్యాంకనం చేయడంలో ఆ ప్రాంత ప్రచారక్ అభిప్రాయం ప్రముఖంగా స్వీకరించబడుతుంది. అలాగే ఈ క్రొత్తాయన అక్కడికి వెళ్ళక ముందు నుండి ఆ ప్రాంతంలో పని చేస్తున్న పాత ప్రచారకులు ఈయనను ఎలాంటి సంకోచంలేకుండా తమలో ఒకడుగా స్వీకరించగల్గుతున్నారా అన్న అంశం పరిశీలించడం జరుగుతుంది. అలాగే ఈ క్రొత్త ప్రచారక్ పని చేస్తున్న కార్యక్షేత్రంలో అంతకుముందు నుండే పనికొనసాగుతూ వస్తున్నట్లయితే అక్కడి స్వయంసేవకులు ఈయన్ను తమ ఆత్మీయుడుగా స్వీకరించ గల్గుతున్నారా అన్న అంశం కూడా పరిశీలించబడుతుంది.

ఆబాజీకి పాత కార్యక్షేత్రమే లభించింది. పైన పేర్కొన్న మూడు అంశాలలోను ఆబాజీ అనతికాలంలోనే తమ సామర్థ్యాన్ని ఋజువు చేసుకొన్నారు. ఆయన అక్కడి సంఘ పెద్దల మరియు స్వయంసేవకుల ఆదరణను,ఆమోదాన్ని, ఆత్మీయతను అతిసహజమైన రీతిలో అందుకోగలిగారు. అక్కడి ప్రాంత ప్రచారక్‌గారు కూడా ఆబాజీని క్రొత్తగా వచ్చిన కుర్రప్రచారక్ అనే భావంతోగాక తన సమానుడుగానే భావించి కార్యవిస్తరణ యోజనలో కూడ ఆబాజీని సంప్రదించేవారు.

ఆ రోజుల్లో బెంగాల్‌లో సంఘకార్యం అల్ప మాత్రంగానే ఉండేది. కాని శివపూర్,బరహాంపూర్,నవదీప్,మాలదా వంటి ప్రదేశాలలో సంఘశాఖలు బాగా జరుగుతుండేవి. ఆబాజీని శివపూర్‌లో నియమించారు. ఈ క్షేత్రంలో అప్పటివరకు సంఘకార్యాన్ని చేయడానికి

వచ్చిన వారంతా బయటివారే. ముఖ్యంగా మహారాష్ట్రనుండి వచ్చినవారే. కాని ఆబాజీ సహజ ప్రవృత్తి,గుణసంపద,కార్యశైలి స్థానిక కార్యకర్తలను ఎంతగానో ఆకర్షించాయి. వారిలో కొంతమంది ప్రచారకులుగా కూడ వచ్చారు. అవతలి వ్యక్తిని అంచనా కట్టడం,నిత్యసంపర్కం ద్వారా అతడిని సంఘ కార్యలో జొప్పించటం ఆబాజీకి గల ప్రత్యేకత. అలా ఆబాజీ సంపర్కంలోకి వచ్చిన ప్రముఖులలో కేశవదేవ్ చక్రవర్తిగార్ని ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఆయన ఒక పాఠశాల ప్రధానోపాధ్యాయులుగా ఉండేవారు. అబాజీ సంపర్కంలోకి వచ్చాక సంఘకార్యకర్తగా మారారు. ఆతర్వాత జిల్లా సంఘచాలక్,ఆ పిమ్మట ప్రాంతసంఘచాలక్ బాధ్యత కూడా ఎంతో సమర్థవంతంగా నిర్వహించారు. క్రొత్తగా ప్రచారక్‌గా వచ్చిన వారెవరైనా సరే ప్రత్యక్షంగా కార్యరంగంలో దూకి అక్కడి ఆటుపోట్లకు తట్టుకుని తన యోగ్యతను ఋజువు చేసుకోవాలనేది బాలాసాహెబ్‌జీ అభిమతం.ఆబాజీ తమ యోగ్యతను ఎలాంటి సందేహానికి తావులేకుండా ఋజువుచేసుకొన్నారు. ఆతర్వాతనే సర్‌సంఘచాలక్‌గారికి సహాయకులుగా నియుక్తులయ్యారు.

## సర్‌సంఘచాలక్‌గారి సహాయకులుగా

సర్‌సంఘచాలక్‌గార్కి సహాయకులుగా ఉండటం అంటే వారికి ఎప్పుడు ఏమికావాలో చూచుకొంటూ అందించడమేకదా అనిపిస్తుంది. 'సర్‌సంఘచాలక్‌గారి సహాయకుడు' అనే బాధ్యత సంఘనియమావళిలో ఎక్కడా వ్రాసిపెట్టబడలేదు. అందుచేత తత్సంబంధిత విధులు,బాధ్యతలు ఏవిటో ఎవరికీ తెలియదు. కాని ఇదొక పెద్ద బాధ్యత అనేది మాత్రం నిజం. కాబట్టి తమ విధి నిర్వహణలో ఎదురయ్యే అంశాలు ఏవిటో ఆబాజీ తనంతటతానుగా ఆలోచించి నిర్ణయించుకో

వలసి వచ్చింది. పనిచేస్తూచేస్తూ గడించిన అనుభవం తనకెన్నో విషయాలు నేర్పుతుంది అనే విశ్వాసం మాత్రం ఉంది. ఆ విశ్వాసంతోనే ఆయన ఆ బాధ్యత చేపట్టారు. గురూజీతోపాటు యాత్ర ప్రారంభించారు. తనకు మార్గం చూపడానికి అంతకుముందు ఈ పయనం సాగించినవారు లేరు. కాబట్టి తనకు తానే దిశ,మార్గం-రెండూ నిర్ధారించకోవలసిన అవసరం ఏర్పడింది. ఇందులో ఆయన పరిపూర్ణంగా కృతకృత్యులైనారనడంలో సందేహం లేదు.

ఆబాజీవారి కుటుంబసభ్యులతోపాటు ఒంటరిగా గడిపిన రోజులు బహుకొద్ది మాత్రమే. ఎప్పుడు ముంబాయి వచ్చినా గురూజీతో కలిసి వచ్చేవారు. ఇంట్లో ఏదైనా కష్టం వచ్చినా,శుభకార్యం జరిగినా గురూజీతో పాటే వచ్చేవారు. ఆబాజీ సోదరి సింధుతాయి, 'కుటుంబసభ్యులతోపాటు వారం, పదిరోజులు గడపడానికి మీరు ఆబాజీకి అనుమతినివ్వాలి' అని గురూజీని అడిగితే,'ఆబాజీకి ఇష్టమైతే నాకు అభ్యంతరం లేదు'అని సమాధానం చెప్పేవారు. ఆబాజీ గురూజీని విడిచి ఉండటానికి ఒప్పుకునేవారుకాదు.

ఆబాజీ గురూజీతోపాటు భారతదేశం అంతా పర్యటిస్తూ వచ్చినప్పటికి ఎప్పుడూ వేదిక మీద ఆశీనులు కావడానికి ఇష్టపడేవారు కాదు. సమయందొరికినప్పుడల్లా స్వయంసేవకులను కలవడానికి, వారి ఇళ్ళకు వెళ్ళి కుటుంబసభ్యులతో సంపర్కం పెంచుకోవడానికి కృషి చేసేవారు. వారికి ఓసారి ఏక్సిడెంటులో కాలువిరిగి నాగపూర్‌లో ఉండవలసివచ్చింది. కాస్త నయంకాగానే లూనా మీద ఊరంతా తిరిగేవారు కారు తీసుకొని వెళ్ళవచ్చుకదా అని అడిగితే 'ఒక్క మనిషి కోసం కారు వేసుకువెళ్ళడం అంటే పెట్రోలుకు ఎంత ఖర్చు అవుతుంది

ఆలోచించారా' అని ఎదురు ప్రశ్నించేవారు. ఢిల్లీ స్వయంసేవకులు మాత్రం, 'నాగపూర్‌లో లూనాపైన తిరిగితే తిరిగారేమోగాని ఢిల్లీలో మాత్రం ఆబాజీని లూనాపైన తిరగనీయం' అంటుండేవారు. ఆబాజీ దినచర్య సూర్యోదయానికి పూర్వమే ప్రారంభం అయ్యేది. సరిగ్గా ఉదయం 6.00గం.కు లూనా ఎక్కి బయలుదేరితే నాగపూర్‌లో ఎక్కడెక్కడో తిరిగి ఒక్కోసారి స్వయంసేవకుల ఇళ్ళలోనే భోజనం ముగించి రాత్రి ఏ పదిగంటలకో కార్యాలయం చేరేవారు.

ఆబాజీ అక్కగారు సింధుతాయి కూడా సమాజసేవలోనే జీవితం అంతా గడుపుతూవచ్చారు. ఆమె భర్త చనిపోయాక 'స్త్రీ సంక్షేమ గృహ' సూపర్నెంటుగా ఉద్యోగం చేసేవారు. కాని భయ్యాజీదాణి ఇంకా ఇతర సంఘపెద్దలు, 'ఆ ఉద్యోగం చేయడం కంటె సమాజకార్యంలో నిమగ్నమై పనిచేయడం బాగుంటుంది' అని సలహా ఇచ్చారు. ఆతర్వాత ఆమె 1937లోనే రాష్ట్రసేవికా సమితి ప్రచారికగా చేరిపోయారు. వాస్తవానికి రాష్ట్రసేవికా సమితి కార్యం 1936లోనే ప్రారంభమైంది. తొలి దినాలలోనే సింధుతాయి సేవికాసమితి కార్యభారం వహించారు. సాధారణంగా మహారాష్ట్ర నుండి హిందీతో యం.ఏ చదివే స్త్రీలు బహు తక్కువమంది ఉంటారు. చాలామంది మరాఠీతో యం.ఏ చేస్తుంటారు. కాని సింధుతాయి భవిష్యత్కార్యానికి తోడ్పడేందుకా అన్నట్లు హిందీ తీసుకొని యం.ఏ ప్యాసయ్యారు. అందుచేత ఆమెగారు రాజస్థాన్, పంజాబ్, జమ్మూకాశ్మీర్, హిమాచలప్రదేశ్ మొదలైన ఉత్తరభారత రాష్ట్రాలలో సేవికా సమితి పని చేసినప్పుడు హిందీ పరిజ్ఞానం ఆమెకు ఎంతగానో తోడ్పడింది.

స్త్రీలు ఇల్లువిడిచి సమాజ కార్యం నిమిత్తం పర్యటనం సాగించడం అంటే 50వ దశకంలో కాస్త ఎబ్బెట్టుగానే చూచేది సమాజం. అందుచేత సింధుతాయి కొన్ని సందర్భాలలో కష్టాలు ఎదుర్కోవలసి వచ్చింది కూడా. అదేగాక పంజాబ్, రాజస్థాన్,హిమాచల్‌ప్రదేశ్ ప్రాంతాలలో కొన్ని గృహాలలో పర్దా కూడా ఉండేది. అలాంటి చోట గృహపరిచయాలు ఇంకా ఇబ్బందిగా ఉండేవి. కాని భయ్యాజీ దాణి సింధుతాయిని పెద్దన్నయ్యవలె ప్రోత్సహించేవారు. చాలా మంది సింధుతాయి మాధవరావ్ మూలేగారి సోదరి అనుకునేవారు. ఆబాజీకి అక్కగారు అని తెలియదు. ఎమర్జన్సీ కాలంలో సింధుతాయి పైన అరెస్టు వారెంటు జారీ చేసినప్పుడు కూడా 'మాధవరావ్ మూలే సోదరి' అనే వ్రాశారు. రాష్ట్రసేవికా సమితి కార్యం కొందరు స్వయంసేవకులకు కూడా నచ్చేదికాదు. సంఘం పురుషులకొరకు పనిచేస్తున్నది,తద్వారా కుటుంబాలలో పని జరుగుతుంది. మళ్ళీ ఆడవాళ్ళకు ప్రత్యేకంగా సేవికాసమితి ఎందుకు అనేవారు కూడా ఉండేవారు. అందులో దేశవిభజనానంతరం ఏర్పడిన కొన్ని పరిణామాల కారణంగా సంఘస్వయంసేవకులలోనే చిన్నపాటి అసంతుష్టి వర్గం ఏర్పడింది. వారు సేవికాసమితిని విమర్శించేవారు. ఒక్కొసారి కష్టమనిపించి భయ్యాజీదాణితో 'సంఘస్వయంసేవకులకు మీరు చెప్పకపోతే నేను పని చేయడం కష్టం' అని చెప్పుకోవలసిన స్థితి కూడా ఏర్పడింది. ఆబాజీ మాత్రం ఏమీ జోక్యం చేసుకొనేవారు కాదు.

## వివాహ ప్రసక్తి

ఆబాజీ జీవన లక్ష్యం ఏమిటో మొదటి నుంచి చెపుతూ వచ్చిన కారణంగా ఇంట్లో వాళ్ళందరికి తెలుసుకాని బయటి బంధువులు ఊరకుండరు కదా. చక్కని రూపం,గౌరవంగల కుటుంబం, గోల్డు మెడల్

సంపాదించిన డాక్టరు-ఇంతకంటె గొప్పఅర్హతలు ఏమికావాలి, మంచి పెళ్ళికొడుకు గావడానికి. వాళ్ళువీళ్ళు వచ్చి ఆబాజీ పెళ్ళి ప్రస్తావన తెస్తుండేవారు. ఒకసారి వాళ్ళ ఇంట్లో ఈ ప్రస్తావన [illegible] గురూజీ,'అన్నయ్యకు పెళ్ళి కాకుండా తమ్ముడు పెళ్ళి చేసుకోవడం మన సంప్రదాయం కాదు కదా. అలాంటప్పుడు ఆబాజీ వివాహం ఎలా చేసుకొంటారు' అని ప్రశ్నించారు. ఆ ప్రస్తావన తెచ్చినవారు 'అదేమిటండీ వారి పెద్దన్నయ్యగారికి ఎప్పుడో పెళ్ళి అయింది,ఆబాజీ పెరిగింది కూడా వారి వదినెగారి పోషణలోనే. వారి అన్నగారికి పెళ్ళి కాలేదంటారేమిటి' అన్నారు. 'అవును నేను ఉన్నాను. ఆబాజీకంటె పెద్దవాడిని. అన్ననుకూడా. మరి నేను వివాహం చేసుకోకుండా ఆబాజీ ఎలా వివాహం చేసుకొంటాడు' అని ఎదురు ప్రశ్న వేయగా అవతలి వాళ్ళ నోళ్ళు మూతబడ్డాయి. ఆతర్వాత ఇక ఆబాజీ వివాహ ప్రసక్తి రాలేదు. గురూజీ అంతరంగంలో ఆబాజీ పట్లగల అనురాగం ఎంతటిదో కూడా ఈ ఉదంతం తెలియజేస్తుంది.

## జన్మదినం ఎందుకు

ఒకసారి బంధుమిత్రులు పట్టుబట్టి ఆబాజీ జన్మదినం [illegible] చక్కగా జరిపారు. అప్పుడు అస్సాంలో ప్రచారక్‌గా ఉన్న ఒక [illegible] ఆ విషయం 'వివేక'పత్రికలో చదివి తెలుసుకొన్నారు. వెంటనే ఆబాజీకి అభినందిస్తూ 'మీరు జన్మదినం జరుపుకొంటున్న సంగతి కూడా తెలియజేయను కూడా లేదే' అని వ్రాశాడు. దానికి సమాధానం వ్రాస్తూ,'అది నేను ఏర్పాటు చేసుకొన్న ఉత్సవం కాదు. అందుకే మీఅందరికీ ఆహ్వానాలు పంపలేదు. దగ్గర బంధువులు, కొందరు మిత్రులు దాదాపు బలవంతంగా ఆ వేడుక ఏర్పాటు వేశారు. [illegible]

అలాంటివి ఇష్టం లేదు కూడా. అయినా అందులో గొప్ప విశేషం ఏముంది. భగవంతుడిచ్చిన ఆయువు ఉన్నంతకాలం ఒక్కో సంవత్సరం ఆయువు పెరుగుతూనే ఉంటుంది. మనం ఆలోచించ వలసింది గతించిన సంవత్సరకాలంలో'నేను ఈ సమాజానికి ఎంత వరకు తోడ్పడ్డాను,నావలన పదిమందికి జరిగిన మేలు ఏమిటి' అని ఆలోచించాలి. ఏ మేలు జరగకపోతే ఒక సంవత్సరం వృధా అయినట్లే లెక్కవేసుకోవాలి. అంటే జన్మదినం అనేది 'స్టాక్ టేకింగ్'గా మనకు ఉపయోగపడాలి అని వ్రాశారు. ప్రతి చిన్న విషయంలోనూ తమదైన ధోరణిలో ఒకానొక తాత్త్వికమైన ఆలోచన వెలువరించే వారు. సమాజంలో ఈ దృష్టిగలవారు మనకు చాలా కొద్దిమంది మాత్రమే కనిపిస్తారు.

## పిల్లలకు ఆకర్షణ

ఆబాజీ చిన్న పిల్లలను ఎంతగానో ఆకర్షించేవారు. ఆయన ఏ ఇంటికి వెళ్ళినా ఆ ఇంట్లో చిన్న పిల్లలంతా 'ఆబాజీ వచ్చారు,ఆబాజీ వచ్చారు' అంటూ ఆయన చుట్టూ చేరేవారు. ఆ పిల్లలతో ఆ కబుర్లు,ఈ కబుర్లు చెపుతూ వారితో ఒకరుగా కలిసిపోయేవారు. ఆయన ఏ ఇంటికి వెళ్ళినా ఒక నూతన వ్యక్తి లేక నూతన అతిధి తమ ఇంటికి వచ్చారనే భావన ఉండేది కాదు. తమ కుటుంబంలో ఒక సభ్యుడు ఏదో పని మీద బయటికి వెళ్ళి ఇంటికి వచ్చి చేరినట్లే కుటుంబ సభ్యులంతా భావించేవారు. అంతటి ఆత్మీయత వారికి ప్రతి ఇంట్లోనూ లభించేది. ఈ విషయాన్ని గూర్చి వారి సోదరి శ్రీమతి సింధూతాయి మాట్లాడుతూ 'ఆబాజీనాతో ఎప్పుడూ ఇదే చెప్పేవారు.ప్రచారక్ ఏ ఇంటికి వెళ్ళినా ఆ ఇంటిమనిషే అన్న భావన ఆ కుటుంబ సభ్యులలో కలగాలి. ప్రచారక్ ప్రవర్తన అలా ఉండాలి అనేవారు' అన్నారు. సింధుతాయి

ఉత్తర భారతదేశంలో సేవికాసమితి కార్యభారం వహించి పనిచేస్తున్నప్పుడు ఈమాటలు సదా గుర్తుంచుకొని వివిధ కుటుంబాల వారి ఆప్యాయత పొందగల్గినట్లు చెప్పారు.

## ఇంటింట తానై

పూజ్య గురూజీతోపాటు పర్యటన జరిపిన సందర్భంలోను, బాలాసాహెబ్‌జీతోపాటు పర్యటనలు సాగించిన సందర్భంలోనూ, మధ్యలో ఒకటి,రెండు రోజులపాటు నాగపూర్‌లో కార్యాలయంలో ఉండటం తటస్థపడితే రాత్రిపూట పడుకోవడానికి తప్పితే ఆబాజీ కార్యాలయంలో ఎప్పుడూ ఉండేవారుకాదు. పొద్దున బయలుదేరితే రాత్రి 10,11గంటలకుగాని కార్యాలయానికి చేరేవారు కాదు. రోజంతా జ్యేష్ఠకార్యకర్తల ఇళ్ళకు, క్రొత్తగా సంఘంలో చేరిన వ్యక్తుల ఇళ్ళకు తిరుగుతూనే ఉండేవారు. ఆ విధంగా తిరగడం కేవలం ఆ వ్యక్తులతో పరిచయంపెట్టుకోవడానికి మాత్రమేకాదు ఆ కుటుంబం మొత్తంతో సంపర్కం ఏర్పరచుకొనేవారు.

కేవలం నాగపూర్‌లో ఆగినప్పుడు మాత్రమేకాదు భారతదేశం మొత్తం పర్యటన చేస్తుండేప్పుడు కేరళ,తమిళనాడు, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ అలాగే ఉత్తరభారతదేశంలో ఉత్తరప్రదేశ్,బీహార్,ఢిల్లీ-ఇలా ఏ ప్రదేశానికి వెళ్ళినా గురూజీకిగాని లేక బాలాసాహెబ్‌జీకిగాని వారికి కావలసిన వ్యవస్థ సంగతి పూర్తిచేశాక ఇక ఆ ఊరిలో స్వయంసేవకుల ఇళ్ళకు బయలుదేరేవారు. గురూజీతోను, బాలాసాహెబ్‌జీతోనూ కలిసి ఆబాజీ దేశం మొత్తం 50 సార్లు అయినా పర్యటించి ఉంటారు. ఈ పర్యటనలలో వేలాది స్థానాలు దర్శించి ఉంటారు. వీరు సందర్శించిన

ప్రతిచోట ఇలా గృహసంపర్కం చేశారు. అందుచేతనే యావత్ భారతదేశంలో కొన్ని వేలకుటుంబాలతో వారికి సన్నిహితమైన పరిచయాలు ఏర్పడ్డాయి. ఆబాజీ స్వయంగా ప్రసంగించవలసిన సందర్భంలో తప్ప వేదికపైన ఆశీనులై ఉండేందుకు ఇష్టపడేవారు కాదు. స్వయంసేవకుల కుటుంబాలతో పరిచయం పెంచుకోవడంపట్లనే శ్రద్ధవహించేవారు.

భారతదేశంలో ఏ ఊరికి వెళ్ళినా అక్కడ సంఘ దృష్ట్యా ముఖ్యమైన కుటుంబాల టెలిఫోన్ నంబర్లన్నీ ఆబాజీ దగ్గర ఉంటాయి. ఆయా వ్యక్తులపేర్లు, ఆ కుటుంబాల వివరాలు అన్నీ వారివద్ద ఉంటాయి. పూజ్య గురూజీకి ఇన్ని వేలకుటుంబాలతో సాన్నిహిత్యం ఏర్పడటానికి ఆబాజీ వారికి అందజేసే సమాచారం కూడా ఒక కారణం అనేది సత్యం

## భోలాశంకరుడు

ఆబాజీ ఎప్పుడూ హృదయం విప్పి మాట్లాడుతుండేవారు. వారి ముఖంలో చెక్కుచెదరని మందహాసం దర్శనమిచ్చేది. 1961లో ఇండోర్ సుఖనివాస్‌లో విభాగ్ ప్రచారకుల 15రోజుల వర్గ జరుగుతోంది. ఆ వర్గలో పూజ్యగురూజీ, భయ్యాజీదాణి, అప్పాజీజోషి, యాదవరావ్‌జీ, ఏకనాథ్‌జీ, వంటి ప్రముఖులు పాల్గొన్నారు. దీనదయాళ్‌జీ ఒక గణలో ఉన్నారు. అటల్‌బిహారీజీ పూర్ణగణవేషం ధరించి శిబిరంలో రక్షక్‌గా ఉన్నారు. సరిగ్గా హోలీ రోజున శిబిరం ప్రారంభం అయింది. ఉత్తరభారతదేశంలో హోలీ రోజున రంగులతో ఆడతారు. ఆ రోజు ప్రచారకుల బైఠక్ పూర్తి కాగానే రంగులు చల్లుకోవడం ప్రారంభం అయింది. ఒకరి వంటిమీద మరొకరు బాల్చీలతో పోస్తున్నారా అన్నంతగా రంగులతో ముంచెత్తుతున్నారు.

ఆరోజు స్నానానికి వెళ్ళిన జనం నదిలో రంగు నీళ్ళతో స్నానం చేస్తున్నట్లుగానే ఉంది. ఇలా తన్మయత్వంతో హోలీ ఆడుతుండగా 'అయ్యో నేను స్నానం చేసేశాను, రంగుపోయకండి, రంగుపోయకండి' అని ఒకాయన అరుస్తున్నారు. స్నానం లేదు, ఏమిలేదు... పట్టుకోండి.... రంగుపూయ మండి' అంటూ మిగతా వాళ్ళు పెద్దగా కేకలు పెడుతున్నారు. అలా అరుస్తున్న వారందరిలో పెద్ద గళం ఆబాజీది. ఈ ఆనందోత్సవం గురూజీ సమక్షంలోనే జరిగింది.

ఆబాజీ ఎక్కడికి వెళ్ళినప్పటికి అక్కడి వాతావరణంతో సమరసతానుభూతి పొందేవారు. సంఘ శిక్షావర్గలో కార్యక్రమాల పట్టిక చాలా ఎక్కువగా ఉంటుంది. తెల్లవారుఝామున లేచిన దగ్గరినుండి ఒక కార్యక్రమం తర్వాత మరొకటి ఉరుకులు పరుగులుగా సాగుతుంటాయి. మధ్యాహ్నం భోజనానంతరం కొద్దిగా విశ్రాంతి లభిస్తుంది. అప్పుడు కార్యకర్తలంతా కాస్త విశ్రమించాలని కోరుకుంటారు. కాని ఆబాజీ గనుక శిబిరంలో ఉంటే మాత్రం ఆ విశ్రాంతి సమయంలో కూడ కార్యకర్తలు ఆయన చుట్టూ చేరి బాతాఖానీలో తల్లీనమై పోతుంటారు. నిద్ర, ఆహారం, దప్పిక జ్ఞాపకానికి రావు. ఆబాజీలో ఆకర్షణ అది

ఒకసారి అఖిలభారతీయ బైఠక్‌లు జరుగుతున్నాయి. ఆబాజీ కూడా ఆ బైఠక్‌లో ఉన్నారు. ఆబాజీ ఎడమచేయి మెడకు [illegible] కట్టబడి ఉంది. 'ఆబా చేతికి ఏమైంది' అని అంతా ప్రశ్నించారు. '[illegible] ఏంలేదు, మన రాజాభావ్ పాతుర్‌కర్‌తో సరదాగా కుస్తీ పడుతుండగా [illegible] దెబ్బ తగిలింది. ఇదేముంది ఊరికే నయమైపోతుంది' అన్నారు. [illegible] రాజాభావ్‌గారు దృఢకాయుడు. ఆయనతో కుస్తీకి [illegible] అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

## సంపర్కమే సంఘకార్యపు ఆయువుపట్టు

నాగపూర్‌లో ఉన్న సందర్భాలలో గురూజీ కూడా సంఘ కార్యకర్తల ఇళ్ళలో భోజనం చేస్తుండేవారు. ఫలానా స్వయంసేవకుని ఇంట్లో రేపు భోజనానికి వెళ్దాం అని గురూజీ చెపితే ఆబాజీ ఇక ఆ ఏర్పాట్లలో నిమగ్నమైపోయేవారు. ప్రభాత్ శాఖ అయ్యాక నేరుగా ఆ కార్యకర్త ఇంటికి బయలుదేరేవారు. సాధారణంగా నాగపూర్‌లో ఆబాజీకి పరిచయంలేని కార్యకర్త ఇల్లు లేదు. గురూజీ భోజనానికి వస్తున్న సమాచారం అందజేసి వారికి ఏ పదార్థాలు చేసిపెట్టాలో తెలియజెప్పేవారు. మళ్ళీ భోజనసమయానికి ఓగంటన్నర ముందుగానే వచ్చి ఆ కార్యకర్త అమ్మగారితోనో లేక సోదరితోనో, శ్రీమతి తోనో పదార్థాల వివరాలు అవీ తెలుసుకొనేవారు. వడ్డన విషయంలో కూడ తీసుకోవలసిన జాగ్రత్తలు అన్నీ వివరంగా చెప్పి ఎక్కడా ఏ పొరపాటు జరగకుండా అన్నీ దగ్గరుండి చూచే వారు. ఆబాజీ నిజంగా గురూజీ ఆంతరంగికులే. ప్రతి చిన్న విషయంలోను వారు ఎంతో ఎక్కువ శ్రద్ధ కనపరచి ఏమరుపాటుకు, పొరపాటుకు తావులేని విధంగా చూచుకొనేవారు.

ఎంతదూరప్రయాణం చేసివచ్చినా నాగపూర్ కార్యాలయంలో ప్రాతఃకాలంలోనే నిద్రలేచి స్నానాదికాలు పూర్తి చేసుకొని ఇక అక్కడి నుండి బయటపడటం ఆబాజీ అలవాటు. ఎన్నో గృహాలను సందర్శించేవారు. ఆయన ఏ ఇంటికి వచ్చినా చిన్న, పెద్ద అన్న తేడా లేకుండా కుటుంబ సభ్యులందరికి ఆనందమే. తమ ఆప్త బంధువు వచ్చారన్న భావనే వారి మదిలో మెదిలేది. పిల్లలకు ఏదైనా అనారోగ్యం కల్గినా, మరేదైనా కష్టమున్నా సంకోచం లేకుండా వారికి చెప్పుకొనేవారు. వారు యం.బి.బి.యస్ చదివిన డాక్టరే అయినా చాలాసందర్భాలలో చిట్కా వైద్యం చెపుతుండేవారు.

## ్వంత విషయాలు చెప్పే అలవాటు లేదు

ఆబాజీ వద్ద కూర్చుంటే కార్యకర్తలకు సమయం తెలిసేది కాదు. ిం, గంటలు అలా దొర్లిపోతుండేవి. ఆయనతో మాట్లాడుతుంటే ఏదో ఒక క్రొత్త ప్రేరణ లభించేది. మళ్లీ నూతనోత్తేజం లభించినట్లయ్యేది. అయితేవారు స్వంతవిషయాలు చెప్పడానికి అంతగా ఇష్టపడేవారు కాదు. గొప్పలు చెప్పుకోవడం అసలే సరిపడదు. ఫలానా పని నిర్వహించడంలో ఎంతెంత కష్టపడింది, మరోచోట ఎంత గొప్పగా వ్యవహరించిందీ చెప్పుకొని సంతోషించేవారు చాలామంది ఉంటారు. కాని ఆబాజీ అసలు ఆ విషయాలు ప్రస్తావన చేసేవారు కాదు. ఒకసారి, 'మీరు గురూజీతోపాటు కాశ్మీర్ రాజును కలిశారు కదా. అప్పుడు ఏమి మాట్లాడారు' అని ఒక కార్యకర్త అడిగితే దానికి సమాధానంగా, 'నేను గురూజీతోపాటు కాశ్మీర్‌కు వెళ్ళిన మాట నిజం. కాని కాశ్మీర్ రాజు, గురూజీ ఒక గదిలో కూర్చుని చర్చించుకొన్నారు. ఆ సంభాషణ వారిద్దరి మధ్య జరిగింది. నేనెలా వింటాను' అన్నారు. అలాంటి సమాధానమే గురూజీ, సర్దార్ పటేల్ సంభాషించుకొన్న సందర్భాలను పురస్కరించుకొని అడిగినప్పుడూ చెప్పారు.

అయితే శ్రీగురూజీ, నెహ్రూగారిని కలిసినప్పుడు విశేషం ఒకటి చెప్పారు. నెహ్రూగారు ఎప్పుడు ఖచ్చితంగా సమయపాలన చేసేవారు. ఇంటర్వ్యూ ఫలానా సమయానికి అంటే ఖచ్చితంగా ఆ సమయానికి అక్కడ ఉండేవారు. సంభాషణలు పూర్తి అయ్యాక కారు వరకు వచ్చి ఎక్కించి వెనక్కు తిరిగేవారు. ఆ మర్యాద చాలా ఖచ్చితంగా పాటించేవారు. సంఘ భావాలతో ఏకీభవించేవారు కాదు. కాని మర్యాద పాటించడంలో

సన్నివేశాలకు సాక్షీభూతంగా ఉండే అదృష్టం పొందిన వ్యక్తి అయిఉండి కూడా ఆ విషయాలను ఆబాజీ ఎన్నడూ ప్రస్తావించలేదు. ఇంతకు మించిన ఆత్మసంయమనం మరేముంటుంది. సాధారణంగా ఏదైనా ఒక గొప్ప విశేషం అనుభవంలోకి వస్తే దానిని పదిమందికి చెప్పి తద్వారా తన ప్రత్యేకతను చాటుకోవాలనే తహతహ ఉండటం మానవనైజం. అంతేకాదు వినేవారు కూడా ఆ గొప్పదనంలోపాలు పంచుకొంటున్న అనుభూతి పొందాలని 'ఇది నీకు కాబట్టి చెపుతున్నాను, మరెవరితోనూ అనకు'అని కూడా కొసమెరుపు జోడించి ఊరించడం చూస్తుంటాము. కాని ఎన్నో విషయాలు తెలిసుండి కూడా మరొకరికి ఆ విషయం వెల్లడించాలనే కోరిక కూడా మనస్సులోకి రానీయకుండా ఉండటం అంటే ఎంతటి ఆత్మసంయమనం కావాలి.

ఒక సందర్భంలో ఎంతో కాలంగా ప్రచారక్‌గా పనిచేసిన ఒకాయన ఆబాజీతో,''మీరు గురూజీకి తోడుగా ఎన్నో పర్యాయాలు దేశపర్యటన చేశారు. గురూజీతోపాటు ఉన్న కారణంగా ఎన్నో మహత్తరమైన విషయాలు మీ దృష్టిలోకి వచ్చి ఉంటాయి. వాస్తవానికి గురూజీని గూర్చి వ్రాయాలంటే మీకంటె విషయపరిజ్ఞానం ఎక్కువగా ఉన్న వ్యక్తి మరొకరుండరు. మీకు చక్కగా వ్రాయగల శక్తి కూడా భగవంతుడు ప్రసాదించాడు. మరి మీరు ఎందుకు వ్రాయరు''అని అడిగారు.

ఆబాజీ ఆయనకు సమాధానం. చెపుతూ,'గురూజీని గూర్చి నేనేమి వ్రాయగలను.రామాయణం అంతా రామ చంద్రప్రభువు చరిత్రయే. కాని ఆ చరిత్రను వాల్మీకి వ్రాశాడు. సదా రాముని చరణసన్నిధినున్న మహద్భక్తుడు హనుమంతుడు వ్రాయలేదు''అన్నారు. దీనినిబట్టి సర్‌సంఘచాలక్‌గారి పట్ల ఆబాజీకిగల భక్తి,శ్రద్ధలెంతటివో

మనకు బోధ పడుతుంది. నీడవలె ఉన్న మాటవాస్తవమే,కాని నీడకు తనదైన ఒక వ్యక్తిత్వం ఉండదుకదా అన్న తాదాత్మ్య భావనను ఆబాజీ వ్యక్తీకరించారు.

## ఆదర్శప్రచారక్

సంఘస్థాపకులు డాక్టర్జీ సంఘకార్యం వికాసం చెందుతున్న కొద్దీ 'ఇంతింతై వటుడింతై'అన్న రీతిలో పెరిగి తన విశ్వరూపాన్ని ప్రదర్శిస్తుందన్నారు. అలాగే ఇప్పుడు సంఘకార్యకర్తలు సామాజిక ప్రయోజనం దృష్టిలో పెట్టుకొని అనేక రంగాలకు వ్యాపించారు. ఎన్నో సంస్థలు ప్రారంభించారు. వివిధమైన ఈ సామాజిక కార్యాల మధ్య,సంస్థల మధ్య సమన్వయం సాధించడం ఓ పెద్దపని. గురూజీతో కలిసి సాగించిన తమ పర్యటనల సందర్భంలో సంఘ కార్యకర్తలు స్థాపించిన వివిధ సంస్థలలోని ప్రముఖులను ఆబాజీ కలుసుకోవడం జరిగింది. కాబట్టి దేశ వ్యాప్తంగా విస్తృతమైన పరిచయాలు ఏర్పడ్డాయి. ఈ సంపర్కం, పరిచయాలు పురస్కరించికొని వారు ఎన్నో సమస్యలకు పరిష్కారమార్గం సూచించేవారు. దీనినే ఆంగ్లంలో 'లూబ్రికేటింగ్ ఆపరేషన్'అంటారు. వివిధ సంస్థలలోని కార్యకర్తలతో ఆబాజీకి అతి సన్నిహితమైన సంబంధాలుండేవి. సంపర్కం ద్వారానూ,లేఖల ద్వారాను సయితం ఆయన పరిచయాలను దృఢతరం చేసుకొనేవారు. చివరి రోజులలో ఆయనకు అఖిలభారతీయ ప్రచారక్ ప్రముఖ్ బాధ్యత ఒప్పగించారు. ఆ బాధ్యత స్వీకరించాక ప్రచారకులలో చక్కటి సంస్కారాలు స్థిరపడేట్లు చూడటం ముఖ్యమైన పనే అయినప్పటికి దానికి తోడు గ్రాహక్ పంచాయత్(వినిమయదారుల సంఘం),సహకార భారతి(సహకార

రంగానికి సంబంధించి) బాధ్యత కూడా అప్పచెప్పబడింది. ఇదిగాక రాష్ట్రసేవికా సమితి ఇంకా ఇతర మహిళా సంస్థల మధ్య పరస్పర అవగాహన పెంపొందించే కార్యం కూడా అప్పగించబడింది. ఈ సంస్థలన్నింటి మధ్య సమన్వయ,సహకారాలు పెంపొందించడంలో ఆబాజీకి విభిన్న సంస్థలలోని ప్రముఖులతోగల సన్నిహిత సంబంధాలు బాగా తోడ్పడ్డాయి. ఈ విషయం సంఘం పైన చివరిసారి(మూడవసారి)విధించిన నిషేధకాలంలో బాగా ఋజువైంది. వారి గుణగణాలు, కార్యదక్షత లోతుగా తరచిచూచినప్పుడు వారొక వ్యక్తికాదని, మూర్తీభవించిన ఆదర్శమని తోచకమానదు. ఆయనను ఒకసారి తలచుకొంటేచాలు-ఆదర్శకార్యకర్త ఎలాఉండాలి, ఆదర్శ ప్రచారక్ ఎలా ఉండాలి,ఆదర్శ స్వయంసేవక్ ఎలా ఉండాలి అనేది బోధపడుతుంది.

## వైద్యసేవలు

మొదటినుండి కూడా ఆబాజీకి డాక్టర్ వృత్తి అంటే డబ్బు సంపాదించడంకాదని, సమాజసేవకై వినియోగపడటమే డాక్టరు లక్ష్యమై ఉండాలని దృఢమైన భావన ఉండేది. తన సహాధ్యాయులకు, తన సంపర్కంలోకి వచ్చిన డాక్టర్లకు ఇదే విషయం చెపుతుండేవారు ఆయన. ఆయుర్వేద వైద్యవిధానం అలోపతివైద్యవిధానం-ఈ రెండింటి అనుసంధానం జరగాలని కోరుకొంటుండేవారు. అందుకే నాగపూర్‌లో సంచార చికిత్సవాహనం(ఆంబులెన్స్)కొన్న సందర్భంలో అక్కడి డాక్టర్లు ఆ వాహనానికి 'అనుసంధాన వాహనం' అని పేరు పెట్టారు.

దేశవ్యాప్తంగా ఆబాజీ జరిపిన పర్యటనలలో అనేకమంది డాక్టర్లతో సన్నిహిత సంబంధాలు ఏర్పరుచుకొన్నారు. వారు స్వయంగా డాక్టరే అయినప్పటికి ఆయన ఎన్నడూ వైద్యం ప్రాక్టీసు చేయలేదు. కాని వారి

సంపర్కంలోకి వచ్చిన డాక్టర్ల సేవలు సంఘ స్వయంసేవకులకు ఉపయోగపడేట్లు చూసేవారు. సంఘ స్వయంసేవకులలో ఎవరైనా సరే రోగపీడితులై బాధపడుతూ వారి సలహా అడిగితే వారికి సరియైన మార్గదర్శనం చేసి ఆ వ్యాధి నివారణలో నిపుణుడైన డాక్టరుకు లేఖ వ్రాసి ఇచ్చి మరీ పంపించేవారు. వారి లేఖ అందుకొన్న డాక్టరు రోగికి ఎంతో ఆదరణతో చికిత్సచేసి పంపేవారు

డాక్టరుగా ఒక్కరే ప్రాక్టీసు చేసి రోగులకు మేలు చేయడం కంటే అనేక మంది డాక్టర్ల చేత వైద్యం చేయించే కార్యం సమర్థవంతంగా నిర్వహించారు. వారి సంపర్క ప్రభావం అంతటి మహత్తరమైనది!

## వాత్సల్యమూర్తి ఆబాజీ

పుణె జిల్లాకు చెందిన కార్యకర్త ఒకరు ముంబాయి వెళ్ళడానికి గాను కుటుంబ సమేతంగా పుణె వచ్చారు. ఆయన వద్ద స్థానిక డాక్టరు ఒకరు ముంబాయిలోని టాటా హాస్పిటల్‌లో చేరడానికి వ్రాసి ఇచ్చిన చీటీ ఒకటి ఉంది. కాని కేవలం ఆ చీటీ సహాయంతో టాటా హాస్పిటల్‌లో వైద్య సదుపాయం లభించడమనేది సాధ్యమయ్యే పనికాదు. అయితే అదృష్టవశాత్తు ఈ కార్యకర్త పుణె వచ్చిన సందర్భంలో ఆబాజీ అక్కడే ఉన్నారు. స్థానిక డాక్టరు వ్రాసిచ్చిన ఆ చీటీ చూసారు. పరిస్థితి అర్థం అయింది. ఆయన వెంటనే ఒక కాగితం తీసుకొని ముంబాయిలోగల డా.ఫడ్కేగార్కి ఒక ఉత్తరం వ్రాశారు. అంతేగాదు, ఫోనులో ఆయనతో స్వయంగా మాట్లాడి, ఈ కార్యకర్తతో ''ముంబాయి వెళ్ళగానే డా. ఫడ్కేగారి ఆస్పత్రికి వెళ్ళు''అని చెప్పారు. ఆయన ఆబాజీ చెప్పినట్లుగానే స్థానిక డాక్టరు వ్రాసిచ్చిన చీటీ,రోగనిర్ణయ పత్రం,ఆబాజీ వ్రాసిచ్చిన లేఖ

మూడూ తీసుకొని ముంబాయిలో డా.ఫడ్కేగారిని కలుసుకొన్నారు. ఫడ్కేగారి హాస్పిటల్ సిబ్బంది ఎంతో శ్రద్ధ తీసుకొని టాటా హాస్పిటల్‌లో ఈ కార్యకర్త పని సులభంగా అయ్యేందుకు ఏర్పాటు చేశారు. ఆ కార్యకర్త భార్యకు కేన్సర్ వ్యాధి ప్రథమదశలో ఉన్నట్లు డాక్టర్లు రోగ నిర్ధారణ చేశారు. రోగ నివారణకు కావలసిన మందులు వ్రాసి ఇచ్చి పుణె పంపించారు. స్థానిక డాక్టరు, పుణెలో ఉన్న డాక్టర్లు వ్రాసిన ప్రిస్క్రిప్షన్ ఆధారంగా వైద్యం చేసి ఆ కార్యకర్త భార్యకు పూర్తిగా స్వస్థత చేకూరేట్లు చూశారు. సమయానికి డా.థట్టే శ్రద్ధ తీసుకొని డా. ఫడ్కే గారికి లేఖ వ్రాసి ఉండకపోతే ఈ కార్యకర్త భార్యకు టాటా హాస్పిటల్‌లో చికిత్సకు అవకాశం దొరికేసరికి ఎంత కాలం పట్టేదో! ఆ లోపల క్యాన్సర్ వ్యాధి ఎంత ముదిరిపోయేదో! ఆబాజీ మరణవార్త విన్న తర్వాత ఆ కార్యకర్త,''డా.థట్టేగారు వ్రాసిచ్చిన లేఖ నాడు ఎంతగానో ఉపయోగపడింది. నా భార్య ప్రాణాలు కాపాడటానికి తోడ్పడింది. నా భార్య ప్రాణాలు కాపాడిన ఆ మహానుభావుడు ఇప్పుడు ప్రాణాలు విడిచాడని తెలుసుకొని ఎంతో దుఃఖిస్తున్నాను'' అంటూ కంటతడిపెట్టాడు.

తన సంపర్కంలోకి వచ్చిన ప్రతి ప్రాణికి వాత్సల్యాన్ని అందిచడమే కాదు ఎవరికి వారు ఈయన నావాడు అనుకొనే ఆత్మీయతను అందించారు ఆబాజీ.

1958లో. పూజ్య గురూజీతోపాటు ఆబాజీ వరంగల్లు పర్యటనకు వచ్చారు. వారితోపాటు ప్రాంతప్రచారక్ శ్రీ బాపూరావ్ మోఘే కూడా ఉన్నారు. సంఘ కార్యకర్త పులుసు గోపిరెడ్డిని గురూజీకి పరిచయం చేస్తూ, 'ఈయన మూడేళ్లుగా ఊపిరితిత్తుల వ్యాధితో బాధపడుతున్నాడు. విశాఖపట్నంలో కె.జి.హాస్పిటల్ డాక్టర్లు లంగ్ ఆపరేషన్ చేయాలని సలహా

కొంటె డాక్టరుగారు చాలా సంతృప్తిని వ్యక్తం చేస్తూ, 'నీ ఆరోగ్యం ఇప్పుడు పూర్తిగా కుదుట పడింది. అయినా కొంత కాలంపాటు మందులు వాడుతుండు' అని చెప్పారు. ఆ తర్వాత ఆబాజీని కలిసినప్పుడు గోపిరెడ్డి ఈ విషయం తెలియజేస్తే ఆయన ఎంతో సంతోషించారు.

ఇలాంటి ఉదంతాలు ఎన్నో ఉన్నాయి. ఆబాజీ స్వయంగా డాక్టర్ అయినప్పటికి తమ స్వంత ఆస్పత్రిని ఎక్కడా తెరవలేదు. అయితే యావద్భారత దేశంలోను వైద్య సేవలందించే సంస్థలెన్నింటికో మార్గదర్శనం చేశారు. నేషనల్ మెడికల్ ఆర్గనైజేషన్‌వంటి సంస్థ ఆవిర్భావానికి ఎంతగానో తోడ్పడ్డారు.

## ఆబాజీ ఉత్తరాలు

ఆబాజీ అసంఖ్యాకంగా ఉత్తరాలు వ్రాస్తుండేవారు. రోజూ 10,12 ఉత్తరాలు వ్రాసేవారు. అంటే నెలకు 360, సంవత్సరానికైతే 3600 పైగా వ్రాయడం జరిగేది. గురూజీ చాలా ఉత్తరాలు వ్రాసేవారని, మహాత్మా గాంధీ గారు కూడా చాలా వ్రాసే వారని చెపుతారు. ఆబాజీ ఆ కోవకు చెందుతారు. బాలాసాహెబ్‌జీకిగాని, రజ్జూభయ్యాజీకి గాని ఉత్తరాలు చాలా తక్కువ వ్రాసే అలవాటుంది. అన్ని ఉత్తరాలు వ్రాయడంలో అంతరార్థం ఏమిటో కూడా ఆబాజీ చెప్పేవారు. టైపుచేసినదో, ప్రింటు చేసినదో ఉత్తరం పంపిస్తే చేతితో వ్రాసిన ఉత్తరం ద్వారా అందిన ఆత్మీయత అందదు అనేవారు.

డాక్టర్జీ జీవించియున్న రోజులలోనే పూర్తి సమయకార్యకర్తగా పనిచేసిన జ్యేష్ఠ కార్యకర్త శ్రీ కాళిదాస్‌గారు ఒకసారి ప్రమాదం జరిగి గాయపడ్డారు. ఆ విషయం ఎవరి ద్వారానో ఆబాజీకి తెలిసింది. వారు

అప్పుడు గురూజీతోపాటు బెంగాల్ పర్యటనలో ఉన్నారు. ఎంతో పని వత్తిడిలో ఉండి కూడా వార్త తెలిసిన వెంటనే కలకత్తా నుండే కాళిదాస్‌గార్కి ఉత్తరం వ్రాశారు. ఆతర్వాత నాగపూర్ వచ్చి కలుసుకొన్నారు కూడా కాళిదాస్‌గారు ఆబాజీ స్వంత సోదరులవలెనే ఉండేవారు. ఈయన వారిని 'అరే ఆబా!'అని ప్రేమగా పిలిచేవారు.

అలాగే ఆబాజీ దేశంలో ఎక్కడ పర్యటిస్తున్నా సరే నాగపూర్‌కు మాత్రం ప్రతి నెల 1వ తేదీన కోయంబత్తూర్ నుండి ఒకటి,కొచ్చిన్ నుండి ఇంకొకటి ఉత్తరాలు తప్పక వస్తుండేవి. ఒక నెలరోజుల తర్వాతనైనా సరే నాగపూర్ కార్యాలయానికి చేరగానే ఆబాజీ ఈ రెండు ఉత్తరాలకు సమాధానం వ్రాసేవారు. ''నా కూతుళ్ళ దగ్గరి నుండి వచ్చిన ఉత్తరాలు ఇవి'' అని చెప్పేవారు.

## ప్రకృతి ప్రకోపించినా మారని ప్రవృత్తి

ఈశాన్య భారత రాష్ట్రాలలో ప్రచారక్‌గా పనిచేసిన శ్రీ సుధాకర్ దేశపాండే ఒక ఆసక్తికరమైన విషయం చెప్పారు-

'1950లో అస్సాంలో పెద్ద భూకంపం సంభవించింది. అప్పుడు నేను దిబ్రూగఢ్‌లో ఉన్నాను. దేశవిభజనను జ్ఞప్తికి తెస్తున్నదా అన్నట్లుగా ఆ భూకంపం సరిగ్గా 15 ఆగస్టునాడే సంభవించింది. మేము అస్సాం చేరి అప్పటికి కొద్దిరోజులే అయింది. అప్పటిదాకా భూకంపం అంటే ఎలా ఉంటుందో నాకు అసలు తెలియనే తెలియదు. షుమారు రాత్రి 7.30ని. సమయంలో అకస్మాత్తుగా కరెంటు పోయింది. ఆకాశాన కారు మబ్బులు క్రమ్ముకున్నాయి. కరెంటుతీగల నుండి ఒక విధమైన హోరు ధ్వనించింది. ఆపైన ఆకస్మికంగా భూమి కంపించడం మొదలైంది. నాగస్వరం విన్న

నాగుపాము కదలిన రీతిలో భూమి కదలడం మొదలైంది. ఆ కదలిక వలన ఒకానొక హోరు జనించి భయకంపితులుగా చేసింది. షుమారు 12 నిమిషాలపాటు ఇది అనుభవించాం. అనేకమంది తమ గృహాలలోంచి బయటికి వచ్చి రోడ్లపైన నిలబడ్డారు.

ఆ పన్నెండు నిమిషాల కరాళ నృత్యంతో భూమాత చేసిన భీభత్సం వివరాలు ఆ మర్నాడు తెలిశాయి  అంతకు ముందు, నదీ ప్రవాహం లేని చోట క్రొత్తగా ప్రవాహాలు ఏర్పడ్డాయి, ప్రజలు చాలా మంది భయభీతులై పోయి వృక్షాలపైకెక్కి తలదాచుకొన్నారు. రైలు పట్టాలు స్థానభ్రంశం చెంది చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. మైళ్ళ కొద్ది ప్రాంతాలు నీటి ప్రవాహంతోను, బురదతోను నిండి పోయాయి. ఎవరికి వారు తమ ప్రాణాలు కాపాడు కోవడంలో నిమగ్నమైన కారణంగా ఒకరి గోడు ఒకరు వినిపించుకొనే స్థితిలో లేరు.

ఆ పరిస్థితిలో పూజ్య శ్రీ గురూజీ భూకంపబాధితుల సహాయార్థం పరుగు పరుగున అక్కడికి చేరుకొన్నారు.

1947లో దేశవిభజన కారణంగా నిర్వాసితులైన పీఢిత ప్రజల సహాయార్థమై "వాస్తుహార సహాయతా సమితి" స్థాపింపబడి పని చేస్తూ వచ్చింది. ఆ సమయంలో ఏకనాథ్‌జీ రానడే పూర్వాంచల్ ప్రదేశ్ ప్రచారక్‌గా కార్యభారం నిర్వహించేవారు. వారి ప్రోత్సాహంతోనే 'వాస్తుహార సహాయతానిధి' సమకూర్చుకోవడం జరిగింది. ఈ సమితికి అనుబంధంగానే 'భూకంప పీడిత సహాయతా సమితి' పని చేయనారంభించింది. యావద్భారత దేశం నుండి బట్టలు, పాత్రలు, దుప్పట్లు కుప్పలు కుప్పలుగా ఈ పీడితుల సహాయార్థం వచ్చిపడ్డాయి.

వాటిని పీడితులకు అందించే ప్రయత్నంలో కార్యకర్తలంతా ఎంతో హడావిడిగా ఉన్నారు. అంతటి పని వత్తిడిలో ఉండి కూడా గురూజీతోపాటు అక్కడికి వచ్చిన ఆబాజీ నన్ను ప్రక్కకు పిలిచి,'ఢిల్లీలో మీవాళ్ళు ఎవరైనా ఉన్నారా?' అని అడిగారు. 'మా పిన్నిగారి అమ్మాయి కుసుమ్ వాళ్ళు అక్కడే ఉంటున్నారు' అని చెప్పాను. అది వినగానే ఆయన జేబులో నుంచి ఒక ఉత్తరం తీసి ఇచ్చి 'ఇదిగో మీ సోదరి కుసుమ్ ఇచ్చి పంపిన ఉత్తరం. మళ్ళీ వెంటనే జవాబు వ్రాయి' అంటూ అందించారు. అలా అందజేస్తూ,'నేను ఢిల్లీలో ఒక కార్యక్రమంలో పాల్గొనేందుకు వెళ్ళాను. నా చుట్టూ జనం మూగి ఉన్నారు. వెనకనుంచి ఆబా! ఆబా అంటూ అరుస్తున్న స్త్రీ కంఠం వినిపించింది. తీరా వెనక్కు తిరిగి చూస్తే ఆ పిలుస్తున్నది కుసుమే.. నీ యోగక్షేమాలు విచారిస్తూ ఈ ఉత్తరం నా చేతికిచ్చి నీకు అందజేయమని చెప్పింది' అంటూ సమాచారం అంతా వివరంగా చెప్పారు. దేశవ్యాప్తంగా కొన్ని వేలమంది కార్యకర్తలతోను వారి బంధుగణంతోను ఆబాజీకి ఇలాంటి పరిచయాలున్నాయి. ఒట్టి పరిచయాలే కాదు, వారి అడ్రసులు భద్రపరచి నిరంతరం వారితో సంపర్కం పెట్టుకొనేవారు. అది సంఘటనా కార్యానికి ఎంతగానో ఉపకరించేది.

## క్షణికమైన కోపం

ఆబాజీకి కోపం వచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయి. సంఘకార్యనిర్వహణలో కార్యకర్తలలో అలసత్వంగాని, మరేదైనా లోపంగాని గమనించినప్పుడు వారికి కోపం వచ్చేది. కాని అది ఓ క్షణ కాలం మాత్రమే ఉండేది. ఒకసారి గురూజీ బట్టలు ఒకకార్యకర్త వద్ద ఉండి పోయాయి. గురూజీ ఆ సాయంకాలమే పర్యటనకై బయలుదేరి వెళ్లవలసి ఉంది.

కాబట్టి ఆబాజీ ఆ కార్యకర్తకు, ఆ ఉదయమే కబురంపించి సాయంకాలం నేరుగా రైలు స్టేషనుకే ఆ బట్టలు తెచ్చి అందించమన్నారు. కాని ఆ కార్యకర్త మరిచిపోయాడు. ప్రయాణంలో తగినన్ని దుస్తులు లేని కారణంగా గురూజీకి కొంత అసౌకర్యం కల్గింది. సహజంగానే ఆబాజీకి కోపం వచ్చింది. వెంటనే ఆ కార్యకర్తకు ఒక ఉత్తరం వ్రాశారు. ఆ ఉత్తరంలో-''నీవు చేసిన పొరపాటు ఒకానొక సందర్భంలో సమర్థ రామదాసు అన్న మాటలు గుర్తుకు తెచ్చింది అంటూ రామదాస స్వామి మందలించిన తీరు ఉటంకించారు.

ఆ ఉత్తరం చూచుకొన్న కార్యకర్త ఇక ఆబాజీ ఎదురుపడ్డప్పుడు తనకు జరగబోయే సత్కారం ఎలా ఉంటుందో ఊహించికొని కంపితడైపోయాడు.అయినా గుండె దిటవు చేసుకొని పర్యటన నుండి ఆబాజీ తిరిగి వచ్చిన రోజున వారిని రిసీవ్ చేసుకొనేందుకు రైల్వే స్టేషన్‌కు వెళ్ళాడు. ఈయనను చూడటంతోనే,'అరే నీవే వచ్చావా స్టేషన్‌కు అంటూ ఆలింగనం చేసుకొన్నారు. ఎన్ని మాటలు పడవలసివస్తుందో అన్న భయంతో బితుకు బితుకు మనుకొంటూ స్టేషన్‌కు వచ్చిన మనిషి ఆబాజీ ఆప్యాయత చూచి విస్తుపోయాడు. పొరపాటును ఎత్తి చూపడానికి, సరిదిద్దడానికి కోపంలో ఉత్తరం వ్రాశారుగాని ఆ మరుక్షణంలోనే ఆబాజీ ఆ సంగతి మర్చిపోయారు. తెల్లటి వస్త్రంపైన పరిశుభ్రమైన నీరు పడితే ఆ తడి వలన మచ్చఏర్పడుతుంది. కాని రెండు క్షణాలకు ఆ తడి ఆరిపోగానే మచ్చమాయమైపోతుంది. ఆబాజీ ఆగ్రహం కూడా ఇలాంటిదే.

## ప్రదర్శనకు పెట్టని ప్రతిభ

ఆబాజీలో నిక్షిప్తంగా ఉన్న గుణ విశేషాలు కొన్ని వారి మరణానంతరం వెలుగులోకి వచ్చాయి. వారు చనిపోయాక వారి సామాను వెతుకుతూంటే

మూడు,నాల్గు కాపీ పుస్తకాలు బయటబడ్డాయి. ఆ పుస్తకాలలో నీలంరంగు పెన్సిలుతో వేసిన చిత్రాలు ఎన్నో కనిపించాయి. ఎంతో అందంగా చిత్రించబడిన చిత్రాలు అవి! కాస్త విశ్రామం దొరికిన సందర్భంలో అలా చిత్రాలు గీచి ఆనందానుభూతిని పొందేవారు ఆబాజీ. కాని ఆ చిత్రాల సంగతి ఎన్నడూ ఎవరితోనూ ప్రస్తావన చేసి ఎరుగరు.

అలాగే వారికి చక్కటి రచనా శక్తి కూడా ఉంది. గురూజీతో పాటు,బాలాసాహెబ్‌జీతో పాటు జరిపిన పర్యటనల విశేషాలు కొన్ని వారు తమ డైరీలో నిక్షిప్తం చేశారు. ఆ తర్వాత ఆ అంశాలన్నీ పుస్తకరూపంలో ప్రకటించడం జరిగింది. అలాంటివి మరి కొన్ని రచనలు కూడా వారు చేశారు. అవి సమాజానికి ఎంతగానో ఉపయోగపడే రచనలు.

1993లో ఒకసారి పర్యటనలో ఉండగా జంషెడ్‌పూర్‌లో ఆబాజీ ఏక్సిడెంటుకు గురి అయ్యారు. ఫ్రాక్చర్ అయితే డాక్టర్లు కట్టుకట్టి విశ్రాంతి తీసుకోమన్నారు. అందుచేత నాగపూర్ వచ్చి విశ్రాంతి తీసుకోవడం జరిగింది. ఆ సమయంలో గురూజీతోపాటు వారు జరిపిన పర్యటనల సందర్భంలోని స్మృతులు గ్రంథస్తం చేయాలనుకొని వ్రాయడం ప్రారంభించారు. ముంబాయికి చెందిన ప్రముఖ రచయిత జి.వి.గోఖలె కూడా ఆబాజీని ప్రోత్సహించారు. 'ఆథెంటిక్ మెమోరీస్' అనే శీర్షికన ఒక పుస్తకం ప్రచురిస్తే బాగుంటుంది కాబట్టి వ్రాయమన్నారు. కొన్నిరోజులు ఈ రచనా వ్యాసంగం సాగింది కాని ఆరోగ్యం కుదుటపడగానే పర్యటనలు ప్రారంభించారు. అంతటితో ఆ పుస్తకం ఆగిపోయింది. 'ఆబాజీ! ఆ పుస్తకం పూర్తి చేయండి' అని అడిగితే,'ఇక ఇప్పుడు తీరికెక్కడ ఉంది' అనేవారు.

ఇందిరాగాంధీ హయాంలో పంజాబులో ఉగ్రవాద చర్యలకు సంబంధించి ఆబాజీ ఒక చక్కని రిపోర్టు తయారుచేసి పంపించారు. అంత వరకు వెలుగు చూడని విషయాలెన్నింటినో ఆబాజీ ఆ రిపోర్టు ద్వారా తెలియపరిచారు. అధికార వర్గాలు కూడా ఆ రిపోర్టు ఎంతో ఆలోచనాత్మకమైనదని మెచ్చుకొన్నారు. ఆబాజీలోగల పరిశీలనాత్మక దృష్టికి సమకాలీన చరిత్రను అవగాహన చేసుకోగల శక్తికి ఆ రిపోర్టు ప్రబల నిదర్శనం.

## అవసరమైన విద్యలన్నీ తెలుసు

సాక్షాత్తు సర్‌సంఘచాలక్‌గారి ఆంతరంగిక కార్యదర్శి అంటే స్వయంసేవకులందరికి ఆదర్శంగా ఉండాలి. ఇది ఆబాజీకి బాగా తెలుసు. ఎప్పుడు ఏ అవసరం వస్తుందో తెలియదు. కాబట్టి సాధ్యమైనంతవరకు ఎలాంటి పని అయినా చేయగల సామర్థ్యం సమకూర్చుకొని ఉండాలి. ఆ ఉద్దేశ్యంతోనే కావచ్చు! ఆబాజీ కారు డ్రైవింగ్ కూడా నేర్చేసుకొన్నారు. ఎప్పుడు నేర్చుకొన్నారో ఎవరికీ తెలియదు. 1965లో ఒకసారి రాయపూర్ నుండి వెంటనే నాగపూర్‌కు వెళ్ళాల్సిన అవసరం పడింది. కార్యకర్తలకు కారు లభ్యమైందిగాని అది నడిపే డ్రైవరు లభ్యంకాలేదు. ఎవరో ఒకతను దొరికాడుగాని అతడు డ్రైవింగ్‌లో అనుభవంలేనివాడు. కార్యకర్తలు ఏమిచేయాలో తోచక తచ్చాడతున్నారు. ఇంతలో ఆబాజీ కారు ఎక్కి డ్రైవరు సీటులో కూర్చున్నారు. ఆయన ప్రక్కన గురూజీ కూడా ఆశీనులయ్యారు. ఆబాజీ ఎంతో అనుభవజ్ఞుడైన డ్రైవర్‌లా కారును సురక్షితంగా రాయపూర్ నుండి నాగపూర్‌కు నడుపుకొచ్చారు.

## ధ్యేయంపట్ల పట్టుసడలిందా?

ఆబాజీ నేడు సంఘ కార్యకర్తలలో ధ్యేయంపట్ల పట్టు తగ్గుతున్నదేమో అనిపించే ఉదంతాలు చూచి బాధపడేవారు. జల్గాంలో ఒకసారి మాట్లాడుతూ సమాజంలో జరుగుతున్న అన్యాయాలు, దుస్సంఘటనలు చూచినప్పుడు స్వయంసేవకులలో రావలసిన ప్రతిస్పందన రావడంలేదన్నారు. మంచి వాళ్ళు రాజకీయరంగంలో ప్రవేశిచడంలేదు. ఆకారణంగా చెడ్డవాళ్ళు ఆ రంగంలో జొరబడి సమాజానికి చేటుతెస్తున్నారు. ఈ పరిస్థితి మారాలి అన్నారు ఆబాజీ. దాని అర్థం పరిస్థితి పూర్తిగా నిరాశాజనకంగా ఉందని కాదు. కాని చాలా అసంతృప్తిగా ఉన్న మాట నిజం అన్నారు. ఇంత కాలంగా మనం సంఘంలో పని చేస్తున్నది ఈ జరుగుతున్నదంతా ప్రేక్షకుల్లా చూస్తూ ఊరకుండటానికా? అన్నారు ఆవేదనతో. పట్టుదలలో దిగజారుడు, రాజీతత్వం కనిపిస్తోంది. తాత్త్విక చింతనలో పతనంలేదు. కాని ఈ క్రొత్తతరానికి స్ఫూర్తినిచ్చి స్పందన కలగజేసే రీతిలో కార్యక్రమాల పునర్వ్యవస్తీకరణ జరగవలసిన అవసరం ఎంతగానో ఉంది అనేవారు ఆబాజీ.

## ప్రేమమయ జీవి ఆబాజీ

ఎంతోకాలంగా ఆబాజీ సంపర్కంలో ఉన్న వ్యక్తులు కొందరు ఇప్పుడు గొప్పగొప్ప బాధ్యతలు వహించి పనిచేస్తున్నారు. ఎంత గొప్పబాధ్యతలో ఉన్నప్పటికి అలనాడు ఆబాజీ నుండి పొందిన ప్రేమ ఎన్నడూ విస్మరించలేరు. అంతగొప్పవారు కూడా ఆబాజీ దగ్గరకు వస్తే అమాయక బాలురే అయిపోతారు. ఢిల్లీలో చికిత్సపొందుతూ

కొంతకాలం ఆబాజీ కార్యాలయంలోనే ఉన్నారు. ఆ సమయంలో ముంబాయి నుండి ఆబాజీని పరామర్శించడానికి జయవంత్ బెహన్ మెహతా వచ్చి వారి మంచంపైన కూర్చున్నారు. అదే సమయంలో ఇప్పుడు బిజెపిలో బాగా ప్రసిద్ధిచెందిన నేత శ్రీ నరేంద్ర మోడీ కూడ అక్కడికి వచ్చారు. ఆబాజీ అనారోగ్య స్థితిలో అలా మంచం మీద ఉండటం చూసిన శ్రీమోడి తన ఆవేదన ఆపుకోలేక పసిపిల్లవాడిలా భోరున ఏడ్చేశారు. ఆబాజీ సంపర్కంలోనికి వచ్చిన వారికి ఆయన పట్లగల ప్రేమాభిమానాలు ఎంత లోతైనవో ఈ సంఘటన తెలియచేస్తుంది.

## భావుకులు ఆబాజీ

ఆబాజీ చివరిరోజులలో వైద్య చికిత్సపొందుతూ శయ్యపై ఉన్న రోజుల్లో సంఘ కార్యకర్తలు వారిని పరామర్శించడానికి వెళితే ఆయన ఆరోగ్యం సంగతి ప్రక్కనపెట్టి ఆ ఆగంతకుల అరోగ్యాన్ని గూర్చి వాకబు చేసేవారు. అలా వచ్చిన కార్యకర్త కుటుంబంలోని సభ్యులందరిని గూర్చి అడిగేవారు.

ఒక్కోసారి ఆయన భావావేశంలో కంటతడి పెట్టేవారు. 'ఆబాజీ! అన్నీ తెలిసిన మీరు ఇంత దుఃఖిస్తున్నారెందుకు?' అని ఎవరైనా అడిగితే- 'నేను నా అనారోగ్యాన్ని గూర్చి బాధపడటం లేదు. నేను చేయవలసిన పని ఎంతో అసంపూర్ణంగా మిగిలిపోయింది. ఆవిషయం తెలిసి కూడా నేనేమీ చేయలేని పరిస్థితిలో ఉన్నానే అన్న బాధ నన్నుపట్టి పీడిస్తోంది' అనేవారు. అంతటి అస్వస్థతతో బాధపడుతూ కూడ ఇంకా సమాజానికి సేవచేయలేకపోతున్నానే అన్న బాధ! ఎంతటి ఉదాత్తమైన భావోద్వేగం అది!

## మహోన్నత వ్యక్తిత్వం

పూజ్య గురూజీ సర్‌సంఘచాలక్ బాధ్యత స్వీకరించిన తొలిదినాలలో కొద్దిరోజులపాటు నాగపూర్‌కు చెందిన రాజాభావ్‌జోషి వారితోపాటు పర్యటిస్తూండేవారు. ఆ తర్వాత 1945 నుండి ఆబాజీయే గురూజీతోపాటు వారికి సహాయకులుగా పర్యటిస్తూవచ్చారు.

పూజ్యగురూజీ ఆబాజీని ఎంతగానో ఆదరించేవారు. దేశంలో ఎక్కడ సంఘశిక్షావర్గ జరిగినా గురూజీ తప్పక దర్శించేవారు. వారితోపాటు ఆబాజీ కూడా ఉండేవారు. శిక్షావర్గలలో గురూజీ విచ్చేసినప్పుడు పనిలోపనిగా ప్రాంత బైఠక్‌లు కూడా జరుగుతుండేవి. ఆ సమయంలో క్రొత్తగా వచ్చిన వారిని పరిచయం చేయడం ఆనవాయితీగా ఉండేది. నాగపూర్‌లో సంఘశిక్షావర్గ సమయంలో జరిగే ఈ బైఠక్‌లలో గురూజీ స్వయంగా పరిచయ కార్యక్రమం తీసుకొనేవారు. ఒకసారి సంఘపెద్దలను పరిచయం చేస్తూ,'ఇప్పుడు మహమాన్వితుడైన ఒక వ్యక్తిని మీకు పరిచయం చేస్తాను. ఆయనే డా. వాసుదేవ కేశవ్ థట్టే. వీరు ఎల్లప్పుడూ నాతో కలిసి పర్యటన చేస్తుంటారు' అంటూ పరిచయం చేశారు. నిస్సందేహంగా ఆబాజీది మహోన్నతమైన వ్యక్తిత్వమే!

సంఘశిక్షావర్గలో ఆబాజీ కూడ బౌద్ధిక్‌వర్గ తీసుకొనేవారు. వారి అభిమాన విషయం 'రామభక్త హనుమాన్'. హనుమంతుడు ఆబాజీ ఆరాధ్యదైవం. హనుమంతునికి రాముని స్మరణతప్ప మరొకటి ఉండేది కాదు. ప్రతి వస్తువులోనూ రాముడినే చూచేవాడు. హనుమాన్ భక్తుడైన ఆబాజీ హనుమంతుని గుణం పుణికి పుచ్చుకొన్నారు. సతతం సర్‌సంఘచాలక్‌గారి ధ్యాస తప్ప మరొకటి ఉండేది కాదు. నిరంతరం తన కర్తవ్యంపైననే దృష్టినిలిపి ఉంచేవారు.

దేశంలో ఏ ప్రాంతంలోనైనా ప్రచారక్‌లు ఒకచోట కూర్చుని పిచ్చాపాటి మాట్లాడుకొనేప్పుడు నాగపూర్ ప్రస్తావన తప్పకుండా వస్తుంది. నాగపూర్ ప్రస్తావన వచ్చిందంటే అందులో ఆబాజీ ఉన్నట్లే! ఆబాజీ అంటే ప్రచారకులకు ప్రాణం. వారితో మాట్లాడటం అంటే ఏదో బలపర్థకటానిక్ పుచ్చుకొన్నట్లు భావించేవారు. ఆబాజీని గూర్చి మాట్లాడుకొనేప్పుడు, 'ఆబాజీ ఎంత అదృష్టవంతులో! నిరంతరం గురూజీతో కలిసి దేశం అంతా పర్యటించే భాగ్యం వారికి సమకూడింది' అని ప్రస్తుతించేవారు.

## పూర్వజన్మ సుకృతం

మానవ జన్మ పరమేశ్వరుని కటాక్షం చేత లభించే మహాభాగ్యం అంటారు పెద్దలు. అందుకే 'మనుష్యత్వం ముముక్షత్వం మహాపురుష్య సంశ్రయః' అని చెప్పారు. అందులోను మనుష్యజన్మ ప్రాప్తించడమేగాక మహా పురుషుల సాంగత్యం లభించడమనేది పూర్వజన్మ సుకృతమే. ఆ విధంగా చూచినప్పుడు ఆబాజీ పరమభాగ్యశాలి అనడంలో సందేహం లేదు. పరమపూజనీయ శ్రీగురూజీ వంటి యుగపురుషుని సాన్నిధ్యం కొన్ని దశాబ్దాలపాటు వారికి లభించిందంటే అది నిజంగా వారి పూర్వజన్మసుకృతమే. 1945 నుంచి గురూజీ పరమపదించే పర్యంతం ఆబాజీ వారి ఆంతరంగికుడుగా ఉన్నారు.

## సాధకునికి విశ్రాంతి లేదు

1995 ఆగస్టు 31 తేదీన ఆబాజీ పక్షవాతానికి గురిఅయ్యారు. సంఘంలో వారితో పాటు పనిచేస్తున్న జ్యేష్ఠ కార్యకర్తలు కొద్దిరోజులపాటు విశ్రాంతి తీసుకోవలసిందని వారికి సలహా ఇచ్చారు. వారు తమ సహజ

ఛోరణిలో 'బఘు'(ఛూర్ద్దాం) అంటూ ఆ సలహాను ప్రక్కన పెట్టారు. ఆ రోజు సాయంత్రమే వారి డైరీలో ఈ క్రింది వాక్యాలు వ్రాసుకొని ఉంటారు? బహుశా ఆ డైరీలో చివరిగా నమోదైన మాటలు ఇవే అయి ఉంటాయి?

''ఎవడైతే ఉత్తుంగ ధవళశైల శిఖరాగ్ర సాదృశమైన ఆదర్శం ఒక్కటే ధ్యేయంగా పెట్టుకొని సర్వస్వార్పణ బుద్ధితో కృషిసాగిస్తాడో అట్టివానికి విశ్రాంతి అనేది లేదు. అలాంటివాడిని నిదానంగా లాలించి బుజ్జగించి తన ఒడిలోనికి చేర్చుకొని శయనింపజేసే శక్తి ఒక్క 'మృత్యువు'కే ఉంది''.

## చివరి ఘడియలు

1995 నవంబరు 24 నుండి అకస్మాత్తుగా వారి ఆరోగ్యం క్షీణించడం మొదలైంది. 25వ తేదీన దత్తోపంత్‌జీ ఆయనను చూచేందుకు వచ్చారు. డా.కేల్కర్,డా.షిలేదార్‌లతో ఆబాజీ ఆరోగ్యం విషయమై చర్చించారు. 'ఆబాజీ,జీవించాలనే పట్టుదల వదిలేసినట్లు కన్పిస్తోంది' అన్నారు ఠేంగ్డీజీ. 'ఆబాజీ మళ్ళీ మామూలు మనిషి అయ్యేందుకు మేము చేయవలసిందంతా చేస్తున్నాం. అయినా ఆశించిన ఫలితం కన్పించడం లేదు' అన్నారు డాక్టర్లు. ఒక విధమైన నిరాశ అలముకొంది.నవంబర్ 26వ తేదీన సంఘ సర్‌సంఘచాలక్ పూజ్య బాలాసాహెబ్ దేవరస్ 81వ జన్మ దినోత్సవం కన్నుల పండువుగా జరిపేందుకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఆ ఉత్సవం నిరంతరాయంగా జరగడానికి ఎదురుచూస్తున్నారా అన్నట్లుండింది ఆబాజీ పరిస్థితి. అది వారి అంతిమ కోర్కె అయిఉండవచ్చు. ఆ ఉత్సవం నవంబర్ 26న ముగిసింది. 27వ తేదీన ఆబాజీ ఇహలోకం విడిచిపెట్టారు.

# పథనిర్దేశనం

## ఆబాజీ చౌరవ

ఈ రోజుల్లో వివాహసమయాలలో పెళ్ళి కొడుకు పాశ్చాత్య పద్ధతిలో దుస్తులు ధరించడం ఫ్యాషన్ అయిపోయింది. కనీసం పెళ్ళిరోజున కూడా సంప్రదాయబద్ధమైన దుస్తులు ధరించకుండా ఇలా పాశ్చాత్యదుస్తులు ధరించడం గురూజీకి నచ్చదు. అందుచేత చాలా సందర్భాలలో వివాహ కార్యాలకు రావడానికి గురూజీ ఇచ్చగించరు. కాని ఎంతో బలవంతపెట్టగా ఒకసారి ఓ వివాహానికి వారు హాజరైనారు. పెళ్ళి కొడుకు పైనుంచి క్రింది దాకా పాశ్చాత్యదుస్తులు ధరించి ఉన్నాడు. ముహూర్తం అయిపోయింది. ఆతర్వాత జరగాల్సిన పూజాదికాలు కూడా పూర్తి అయ్యాయి. పీటలమీదనుంచి పెళ్ళి కొడుకు లేవగానే డా.థట్టే సంజ్ఞచేసి అతడిని తన దగ్గరకు పిలిచి ఆ ప్రక్కనే ఉన్న గదిలోకి తీసుకెళ్ళారు. ఎలాగైతేనేం ఒక ధోవతి సంపాదించారు. పెళ్ళికొడుకుకు ధోతి కట్టుకోవడం చేతగాకపోతే డా.థట్టే స్వయంగా అతడికి కట్టారు. ఇది పూర్తి అయ్యే సరికి కాస్త సమయం పట్టింది. అలా సంప్రదాయబద్ధమైన దుస్తులలో పెళ్ళికొడుకును గదినుండి బయటికి తెచ్చారు. పెళ్ళికొడుకు ఎక్కడికి పోయాడు, ఎక్కడికి పోయాడు అని వెతుక్కుంటున్న వాళ్ల మనసు ఊరట చెందింది. పెళ్ళి పందిరిలో అంతా తాంబూలాలు వగైరా పుచ్చుకొనే హడావిడిలో ఉన్నారు. పెళ్ళికి ఆహ్వానంపంపిన పెద్దమనిషి పూజ్య గురూజీ పెళ్ళిపందిరిలో ఉన్నదీ, లేనిదీ, పట్టించికొనే స్థితిలో లేడు. అంతా హడావిడిగా ఉంది. ఇంతలో గురూజీ, మా. బాబారావ్ భిడే అక్కడ నుండి బయటపడ్డారు. అసలు ఈ విషయం ఎవరూ గమనించను కూడా లేదు. డా.థట్టే పెళ్ళికొడుకును వెంటబెట్టుకొని పందిరి అంతా

కలయతిరిగారు. అప్పటికే గురూజీ అక్కడినుండి వెళ్ళిపోయారన్న సంగతి గ్రహించారు. వరుడిని ఆశీర్వదించకుండానే గురూజీ వెళ్ళిపోవడం, సంగతి అక్కడ ఉన్న పెద్ద మనుషులు ఎవరూ గ్రహించకపోవడం శ్రీ ఆబాజీ కి బాధ కల్గించింది. అయినా వారు ఆ విషయం అంతటితో వదిలిపెట్ట లేదు. పూలదండలతో సహా వధూవరులనిద్దరినీ వెంటబెట్టుకొని గురూజీ నివాసానికి తీసుకెళ్ళారు. వెంట వచ్చిన పెద్దలతో పాటు అంతా అక్కడ కలిసి చాయ్ పాన్ పూర్తి చేశారు. గురూజీ నవవధూవరులను ఆశీర్వదించి పంపారు. వ్యవహారం చాలా చిన్నదే. కాని పద్ధతి ప్రకారం జరగడానికి డా.థట్టే తీసుకొన్న శ్రద్ధ ఎంతటిదో మనకు బోధపడుతుంది.

## ప్రతిచిన్న విషయంలోనూ శ్రద్ధ

పూజ్య గురూజీతోపాటు పర్యటన చేస్తున్న ఆబాజీకి 'రైలు పెట్టే సొంత ఇల్లు' అన్న రీతిగా ఉండేది. దక్షిణ భారతదేశం వైపు ప్రయాణం సాగించేప్పుడు లేక దక్షిణ భారతం నుండి ముంబాయికి తిరుగు ప్రయాణమప్పుడు పుణె స్టేషన్‌లో పూజ్య గురూజీకి చాయ్, డా.థట్టేకి రాత్రి భోజనం అందించబడేది. ఎప్పటిలాగే ఒకసారి శ్రీ బాబాసాహెబ్ దీక్షిత్‌గారి ఇంటినుండి టిఫిన్, పళ్ళెం, చెంచాలు, ప్రయాణంలో చదువుకొనేందుకు కొన్ని పత్రికలు ఆబాజీకి అందించబడ్డాయి. సోలాపూర్ చేరిన వెంటనే ఆబాజీ సాహిత్యంతోపాటు, పళ్ళెం వగైరా శ్రీ రాజా భావ్ పట్వర్ధన్‌గారికి ఇచ్చి అవి వెంటనే పుణెలో శ్రీ దీక్షిత్‌గార్కి అందించవలసినదిగా చెప్పారు. ఆయన సూచించిన ప్రకారం ఈ సాహిత్యం వగైరా దీక్షిత్‌గారి ఇంటికి చేరాయి. ఆతర్వాత కొద్ది రోజులకు ఆబాజీ శ్రీ దీక్షిత్‌గారి ఇంటికి వెళ్ళారు. అప్పుడు భాభీజీ, 'ఏమయ్యా! ఆ సాహిత్యం, పళ్ళెం వగైరా అంత వెంటనే పంపించేయాల్సిన అవసరం ఏమి వచ్చింది. ఇంట్లో పత్రికలు అవీ చాలా పడి ఉన్నాయి. వాటి అవసరం

అంతగా లేనేలేదు' అన్నారు. అప్పుడు ఆబాజీ,'ప్రయాణంలో సామాను భద్రంగా ఉంచుకోవడం చాలా కష్టమైన పని. అదీ దూరప్రయాణాలైతే చాలాచోట్ల ఫలహారాలు అందుతుంటాయి. ఆ పళ్ళేలు,టిఫిన్ బాక్సులు గుర్తుపెట్టుకొని వాపస్ పంపించకపోతే ఇబ్బందే. ఇవి ఇంటికి చేరేవరకు గృహిణి మనస్సు మనస్సులో ఉండదు. ఇవి సమయానికి ఇంటికి చేరకపోతే మళ్ళీ అతిధి మర్యాదల సంగతేమిటి? మాకే మళ్ళీ అవసరం పడవచ్చు. అప్పుడు మళ్ళీ మాకు భోజనం హుళక్కేగదా?' అని సమాధానం చెప్పగా ఆమె నవ్వు ఆపుకోలేకపోయారు. ఆప్యాయంగా అమెగారు అందించిన గరమ్ చాయ్ సేవించి సెలవుతీసుకొన్నారు.

## సేవ ఒక కళ

ఆబాజీ తమ పర్యటన సందర్భంలో పుణె పట్టణంలో ఉండటం తటస్థించినట్లయితే నివాసం ఎక్కడ ఏర్పాటు చేయబడ్డప్పటికీ రోజుకు ఒక్కసారైనా మా.వినాయక్‌రావ్ ఆప్టేజీ గృహంలో చాయ్ తప్పకుండా స్వీకరించేవారు. మా.కాకాలిమయ్‌జీ పుణె వచ్చినప్పుడల్లా మా. వినాయక్ రావ్‌జీ ఇంట్లోనే దిగేవారు.

ఒకసారి పిన్నిగారు ఇంట్లోలేని సమయంలో గురూజీ ముందుగా సమాచారం అందించకుండా వినాయకరావ్‌జీ ఇంటికి వచ్చారు. పిన్నిగారు ఆ చుట్టుప్రక్కలనే ఎవరింటికో వెళ్ళి ఉంటారు. ఆమెగారు ఇంట్లోలేరని తెలియగానే గురూజీ నేరుగా వంటశాలలోకే వెళ్ళారు. ''ఆబా,ఈవేళ పిన్నిగార్కి మనమే చాయ్ తయారుచేసి ఇద్దాం'' అన్నారు. ''ఆమె ఈ చుట్టుప్రక్కల ఎవరింటికో వెళ్ళి ఉంటుంది. వెళ్ళి చాలా సేపయింది. ఈపాటికి వస్తూనే ఉంటుంది''అని వినాయక్‌రావ్‌జీ అంటూనే ఉన్నారు. వారి మాటలు వినకుండా 'చాయ్ పొడి, పంచదార డబ్బా ఎక్కడున్నాయో వెతుకు' అని పురమాయించారు గురూజీ. ఇంతలోనే స్వయంగా గురూజీ

స్టౌ క్రిందికి దించి దానిని వెలిగించే ప్రయత్నంలో పడ్డారు. కాని అది సరిగ్గా వెలగడం లేదు. ఉన్నట్టుండి ఒక్కసారి భగ్గున మండింది. ఆబాజీ, వెంటనే ఆ స్టౌ పిన్ను సరిచేసి ఎలాగైతేనేం దాన్ని వెలిగించారు.

ఎలాగైనా సరే తమ చేతులమీదుగా తయారైన చాయ్‌ని పిన్నిగారిచేత తాగించాలనేది గురూజీ కోరిక. కాని ఎంత వెదికినా ఆబాజీకి దానికి కావలసిన పాలు మాత్రం దొరకలేదు. పాలకోసం వెతుకుతూ అయిదునిమిషాలు గడిపారు. ఇంతలో బయటినుండి తెప్పించబడిన పాలు రాగానే స్టౌ మీద వేడిచేయడానికి పెట్టారు. ఈ వ్యవహారం నడుస్తుండగా పిన్నిగారు మెట్లెక్కి పైకి వచ్చేశారు. నేరుగా వంటశాలలోకి వెళ్ళి చూస్తే అంతా ఆ హడావిడిలో కనిపించారు. 'మీరు ఉండండి. చాయ్ నేను కాచి ఇచ్చేస్తాను' అన్నారు పిన్నిగారు. కాని గురూజీ,'చాయ్ తయారైపోయింది. వడగట్టి నేనే మీకు అందిస్తాను కూర్చోండి' అన్నారు. ఇంక ఆమె ఏమి మాట్లాడుతారు! ఇదంతా గమనిస్తున్న ఆబాజీ మెల్లిగా ఆ వేడిచేసిన పాలు,చాయ్ మరుగుతున్న పాత్ర ఆమె ముందుకు జరిపారు. పిన్నిగారు వడపోసి చాయ్ సిద్ధంచేయగా గురూజీ అందరికీ కప్పులలో పోసి చాయ్ అందించారు. ఆబాజీతో పిన్నిగారు,'ఆబా! మాకు ఎందుకు ఇంత బాధ కల్గించారు?' అన్నారు. 'నేను మా అమ్మతో సమానమైన పిన్నిగార్కి ఒక్కసారైనా చాయ్ కాచి ఇవ్వగూడదా?' అని గురూజీ పలికిన వాక్యం ఆమెకు వినిపిస్తూ మెట్లుదిగి చక్కా వెళ్ళిపోయారు ఆబాజీ.

## యోగ్యమైన మార్గదర్శనం

1992లో పుణెలో వికాస్‌సాధక్ వాహిని(వి.సా.వా) కార్యకర్తలు ఒక సావనీర్(స్మరణిక) వెలువరించాలనుకొన్నారు. దానికి సంబంధించిన అవగాహన కల్గించేందుకు తమ సంస్థను పరిచయంచేస్తూ ఆబాజీకి ఒక ఉత్తరం వ్రాశారు. సహజంగానే ఆబాజీ వద్దనుండి ఆ ఉత్తరానికి వెంటనే జవాబు వచ్చింది. అంతేగాదు వారు తమ లేఖలో ఆ కార్యానికి సంబంధించి

చక్కగా మార్గదర్శనం కూడా చేశారు. అందులో వ్రాస్తూ-''వెనకనే వెన్నుదన్నుగా నిలిచి నిస్వార్థపూరిత సేవచేసే వ్యక్తుల మార్గదర్శనం ఎప్పుడూ అభిలషణీయమే. ఇలాంటివారు ఉత్సాహవంతంగా పనిచేస్తారు. వృథాగా కాలక్షేపం చేస్తున్నవారు కూడా ఇలాంటివారిని చూశాక వారిలోని అకర్మణ్యతను విడిచిపుచ్చి ఉత్సాహం తెచ్చుకొని కార్యరంగంలో దిగుతారు''.

''గ్రామంలోని ప్రజలంతా స్వయంగా పాల్గొని సామాజిక కార్యం నిర్వహించాలి. వికాస్ సాధక్ వాహిని అలాంటి వారికి ప్రేరణ నిస్తూపోవాలి. ఈ పద్ధతిలో కార్యనిర్వహణ జరగాలి. అంతేగాని 'వీళ్ళంతా మన పని చేయడానికే ఉన్నారు. మనం కాలు మీద కాలు వేసుకుకూర్చున్నా సరిపోతుంది.ఒక వేళ వాళ్ళు పని చేయకపోతే మాత్రం ఫిర్యాదు చేద్దాం' అనే ధోరణికి ఆస్కారం కలిగించరాదు. మీరు ఈ దృష్టితో పని చేస్తున్నందుకు నేను సంతోషిస్తున్నాను. వి.సా.వా పని తీరు చూశాక అందరిలోను ఆత్మ విశ్వాసం పాదుకొంటోందని నమ్ముతున్నాను. ఈ స్మరణిక ఆ ఆశయ పరిపూర్తికి తోడ్పడాలని పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను'' అని వ్రాశారు. మొక్కుబడిగా,వారు ఉత్తరం వ్రాసినప్పుడు మనం జవాబు వ్రాయకపోతే బాగుండదు అన్న ధోరణిలో ఆబాజీ ఎన్నడూ ఉత్తరాలు వ్రాయలేదు. సందేశాత్మకంగానో,ప్రేరణదాయకంగానో ఉండేవి వారి ఉత్తరాలు.

## సమయపాలన

సంఘంలో డాక్టర్జీ ఏర్పరచిన వరవడి కారణంగా సమయపాలనకు కార్యకర్తలు ఎంతో ప్రాముఖ్యం ఇస్తారు. ఆబాజీ కూడ వారి జీవితంలో సమయపాలన పట్ల ఎంతో పట్టుదలగా ఉండేవారు. ఇందుకు నిదర్శనంగా వారి జీవితంలో ఎన్నో ఉదాహరణలు చెప్పవచ్చు.

సంఘ ప్రచారక్‌గా చాలాకాలం పనిచేసి ఆ బాధ్యతనుంచి విరమించుకొన్నాక బిరాగ్‌పాచపూర్‌గారు నాగపూర్‌లో స్థిరపడ్డారు. అక్కడ ఆయన ఒక నూతన గృహం కట్టుకొన్నారు. జూలై 26నాడు గృహప్రవేశం జరుపుతున్నట్లుగా ఆబాజీకి తెలియపరిచారు. వారి కార్యక్రమంలో ఇది పొసగినట్లయితే వస్తారు లేకుంటే ఆ సాయంత్రానికో లేక మర్నాడో వచ్చి ఇల్లు చూచి వెళతారన్న ఆలోచనతోనే ఆబాజీకి సమాచారం అందించడం జరిగింది. ఆబాజీ పర్యటన పూర్తి చేసుకొని ఆ ఉదయానికల్లా నాగపూర్ చేరారు. వాస్తవానికి ఎంతో దూరప్రయాణం చేసి వచ్చాక అలిసిపోయిన కారణంగా విశ్రాంతి తీసుకొందాం అనిపించడం సహజం. కాని ఆబాజీ బిస్తరు కార్యాలయంలో పడేసి వెంటనే బయలుదేరి నూతనగృహప్రవేశానికి సరిగ్గా సమయానికి చేరుకొన్నారు.

## నయాపైసలతో సహా లెక్క వ్రాయాలి

ఒకసారి అకౌంటువ్రాయడంలో ఒకప్రచారక్ కొద్దిగా పొరపాటు చేశారు. అది చిన్న పొరపాటే. కాని ఆబాజీ ఆ ప్రచారక్‌కు ఉత్తరం వ్రాస్తూ ప్రజాధనంతో కూడిన వ్యవహారాలలో కార్యకర్తలు ఎంతో జాగ్రత్తగా వ్యవహరించాలి. యత్కించిత్ శంక కూడ ప్రజల మనస్సులలోకి రాకూడదు. సంఘ కార్యకర్తల వ్యవహారం ఈ రీతిగా ఉండాలి. మన మనస్సులలో ఎలాంటి దురాలోచన లేదుగదా అని సంతృప్తి చెందకూడదు. బయట ఉండి చూచేవారికి కూడా మనపట్ల అలాంటి విశ్వాసమే ఉండేట్లు వ్యవహరించాలి. ముఖ్యంగా అకౌంటు వ్రాయడంలో ఇది తు.చ తప్పక పాటించాలి అని వ్రాశారు.

## అస్సాం కార్యకర్తలకు మార్గదర్శనం

1983-84లో అస్సాంలో ముస్లించొరబాటుదారులకు వ్యతిరేకంగా పెద్దఎత్తున ఉద్యమంసాగింది. ఉద్యమ నిర్వాహకులైన అస్సాం గణపరిషత్

పలుకుబడి పెరిగింది. ఎన్నికలలో ఘన విజయం సాధించారు. ఈ ఉద్యమం బలపడటంలో సంఘ కార్యకర్తలు అస్సాం గణపరిషత్‌కు బాగా సహాయపడ్డారు. అందుచేత సహజంగానే ఏ.జి.పి ప్రభుత్వం రాగానే స్వయంసేవకులు చాలా సంతోషపడ్డారు. ఆ సందర్భంలో అస్సాంలో ప్రచారక్‌గా పనిచేస్తున్న బిరాగ్‌పాచ్‌పూర్‌గార్కి ఆబాజీ ఒక ఉత్తరం వ్రాశారు. 'ప్రభుత్వం రాగానే ఇక అంతా పూర్తి అయిపోయింది అనే భావన కార్యకర్తలలో చోటుచేసుకొంటుంది. పదవుల పోరాటం ప్రారంభమవుతుంది. స్వార్థచింతన పెరుగుతుంది. ఇలాంటప్పుడే సంఘ కార్యకర్తలు జాగ్రత్తగా ఉండాలి' అని వ్రాశారు. ఉత్తరాల ద్వారా వారు చక్కటి మార్గదర్శనం చేసేవారు.

అస్సాంలో బోడో ఉద్యమం బాగా పెచ్చరిల్లింది. ప్రారంభంలో బోడోలు చాలా సాధారణమైన చిన్న కోర్కెలు ప్రభుత్వం ముందు ఉంచారు. అవి జాతీయభావ విరుద్ధమైనవి కానేకావు. కాని శాంతియుతంగా కోర్కెలు ముందుపెట్టినప్పుడు వాటిని పరిష్కరించడం ప్రభుత్వాలకు అలవాటు లేకుండా పోయింది. ఉద్యమం పెచ్చరిల్లింది. అక్కడ విభిన్న వర్గాల మధ్య వైషమ్యాలు, హతమార్చుకోవడాలు, దహనకాండలు పెచ్చుమీరాయి. అక్కడి సమాచారం అంతా సేకరించి బోడో ఉద్యమ స్వరూప స్వభావాదులు అర్థంచేసుకొన్నాక స్వయంసేవకులనుద్దేశించి ఆబాజీ ఒక ఉత్తరం వ్రాశారు. అసలు సమస్య ముస్లిం చొరబాటుదారుల వల్ల ఏర్పడిందని, రిజర్వుఫారెస్టులు నరికివేయడం, స్వాధీనం చేసుకోవడం ఇత్యాది అకృత్యాలకు పాల్పడటం జరిగిందని, సత్యాన్ని ప్రజలందరికి తెలియజేసి వర్గవైషమ్యాలను దరిచేరనీయక అందరూ ముస్లిం చొరబాటుదారులకు వ్యతిరేకంగా సమైక్యపోరాటం కొనసాగించాలని వ్రాశారు.

## విశిష్టమైన సంయమనం

ఆబాజీ ఎంత పని వత్తిడిలో ఉన్నా ఎంతో ప్రసన్నంగా ఉన్నట్లు కనిపించేవారు. తనకు అయిష్టమైన పని జరిగినా వెంటనే తొందరపడి ఆగ్రహం చెందేవారు కాదు. అలా అని చూస్తూ ఊరకుండేవారు అనుకోకూడదు. సరిచేయడానికి తగు చర్య తప్పక తీసుకొనేవారు. కాని సమయం తీసుకొని సరియైన తరుణంలో సరిచేసే ప్రయత్నం చేసేవారు.

సంఘ కార్యకర్తలందరికి ఆబాజీతో బాగా చనువు ఉండేది. తమ కష్టసుఖాలు ఏవైనా ఆయనతో చెప్పుకోవడానికి సంకోచించేవారు కాదు. స్వయంసేవకులతో వారికిగల సంపర్కం అలా ఉండెది.

ఒకసారి దిలీప్ సెనాడ్ అనే జ్యేష్ఠ కార్యకర్త వాళ్ళ పాపను స్కూల్లో చేర్పించాల్సివచ్చింది. నాగపూర్‌లోని న్యూ ఇంగ్లీషు స్కూలు సంఘ పరిచయంలోని వారే నడుపుతున్నారు. ఆ స్కూల్లో అడ్మిషన్ కావాలి. ఆబాజీ పరిచయ పత్రం వ్రాసి ఇచ్చారు. వారు చీటీ వ్రాసి ఇచ్చాక అడ్మిషన్ విషయంలో ఇక అనుమానం ఏముంది? అయినా ఆ కమిటీ అధ్యక్షుని వద్దకు, కార్యదర్శివద్దకు వెళ్ళి దిలీప్ సెనాడ్‌గారు కలిసి వచ్చారు. వాళ్ళుకూడా అడ్మిషన్ ఇవ్వడానికి సుముఖులే అన్నట్లు మాట్లాడారు. ఇంతాచేసి చివరికి మొండి చేయి చూపించారు. సెనాడ్‌కు చాలా కోపం వచ్చింది. అడ్మిషన్ ఇవ్వనందుకు కాదు. ఆబాజీ వ్రాసిచ్చిన చీటీ చూచి దాదాపు అంగీకారం కూడా తెలిపి చివరకు తిరస్కరించారే అన్న కోపం. ఆబాజీ చీటీకి కూడా విలువ ఇవ్వకపోతే వారిని ఏమి అనుకోవాలి? అందుచేత ఈయనకు బాగా కోపం వచ్చింది. ఆ కోపంలో ఆబాజీ దగ్గరకు వెళ్ళి,'మీరు చీటీ వ్రాసి ఇచ్చాక కూడా వారు తిరస్కరించారంటే నేను సహించలేకుండా ఉన్నాను. ఇది మిమ్మల్ని అగౌరవపరిచినట్లే. వారికి

ఘాటుగా ఒక ఉత్తరం వ్రాస్తాను. సంగతేమిటో తేల్చివేస్తాను' అంటూ ఆగ్రహం వ్యక్తం చేశారు. అప్పుడు ఆబాజీ ప్రశాంతంగా,'ఇప్పుడు ఏమిచేసినా ప్రయోజనం లేదు కదా? అడ్మిషన్ల సమయం అయిపోయింది. ఇప్పుడు మనం ప్రదర్శించే కోపం ఏవిధంగానూ మనకు మేలు చేయదు. ఒక్కోసారి మనం వేసుకొన్న లెక్కలు తప్పుతాయి. ఇది ప్రపంచం. కొన్ని సందర్భాలలో సహించి ఊరుకోవలసిందే'' అని సముదాయించారు. సంయమనంతో పని చేయడం వారికి అలవాటు. ఆతర్వాత స్కూలు మేనేజ్‌మెంటువారు తమ పొరపాటుకు చింతించారు.

ఏదైనా పొరపాటు జరిగితే వెంటనే ఆగ్రహం వెలిబుచ్చక అదను చూచి దానిని సరిదిద్దే ప్రయత్నం చేసేవారు ఆబాజీ.

1975నాటి ఎమర్జన్సీ కాకుండా నర్సింహారావుగారు విశ్వహిందువరిషత్ పైన నిషేధం విధించినప్పుడు ట్రిబ్యునల్ దానిని కొట్టిపారేసింది. అప్పుడే బాలాసాహెబ్‌జీ తమ పర్యటన ముగించుకొని విమానంలో నాగపూర్ వచ్చారు. విమానాశ్రయం వద్దవారిని స్వాగతించడానికి సంఘ కార్యకర్తలు వారితోపాటు కొందరు బిజెపి కార్యకర్తలు కూడా చేరారు. బిజెపి వారు తమ అలవాటు ప్రకారం రాజకీయ నాయకులు వచ్చినప్పుడు చేసే హంగామా అంతా చేశారు. నినాదాలు, కేకలు, కేరింతలు అన్నీ కొనసాగాయి, ఒకరినొకరు తోసుకోవడం, తొక్కిసలాట అన్నీ జరిగాయి. ఆ వాతావరణం చూసి జ్యేష్ఠ కార్యకర్తలు, సంఘ పెద్దలు చాలా బాధపడ్డారు. ఆబాజీ కూడా అవాక్కయిపోయి ఆ తమాషా చూస్తుండిపోయారు. ఈతరం వారికి ఇలాంటివి అక్కడక్కడ చూచే అనుభవం ఉందిగాని పాతతరం కార్యకర్తలకు ఇలాంటి ప్రదర్శనలు ఏవగింపు కలిగిస్తాయి. సంఘం అంటే క్రమశిక్షణకు మారుపేరు అనే విషయం పోలీసులకు బాగా తెలుసు. అందుచేత విమానాశ్రయం

వద్దపోలీసులు నామ మాత్ర బందోబస్తు మాత్రమే చేశారు. ఆ ప్రదర్శన చూచి వారు కూడా విస్తుపోయారు.

ఆ తర్వాత రెండురోజులు పోయాక జ్యేష్ఠకార్యకర్త ఒకరు ఆబాజీని కలిసి ఆ ప్రదర్శన సంగతి గుర్తు చేస్తే,'పరిస్థితి ఇలాగే కొనసాగితే మన స్వత్వం దెబ్బతింటుంది. ఇంత కాలంగా మనం సమయపాలనపట్ల, క్రమశిక్షణ పట్ల చూపుతూ వచ్చిన శ్రద్ధ కారణంగా స్వయంసేవకులలో ఒక ఒరవడి ఏర్పడింది. ఇలాంటి ప్రదర్శనల వల్ల అది దెబ్బతినే ప్రమాదం ఉంది' అంటూ తమ హృదయవేదన వ్యక్తం చేశారు. అయితే ఆనాడు విమానాశ్రయం వద్ద మాత్రం ఆ ప్రదర్శనను ఆపు చేసే ప్రయత్నం ఆబాజీ చేయలేదు. హితవు చెపితే వినిపించికొనే వాతావరణం కాదది. కాబట్టి సంయమనం పాటించి ఊరకున్నారు. ఎంతో బాధ కల్గినా తమాయించుకొన్నారు. ఆతర్వాత సందర్భం చూచుకొని చెప్పవలసిన వారితో చెప్పవలసిన రీతిలో చెప్పారు.

# స్మృత్యంజలి

## 'ఆత్మీయత ప్రతిరూపం

('పాథేయకణ్' 1995 డిశంబర్ సంచికలో డా.వాసుదేవ్ కేశవ్ ఉపాఖ్య ఆబాజీకి అక్షరరూపంలో సమర్పించిన శ్రద్ధాంజలి)

కొద్దిరోజుల క్రితం సంగతి. 'పాంచజన్య','ఆర్గనైజర్' వారపత్రికలలో ఆబాజీ స్వదస్తూరితో వారి సందేశం ప్రచురితమైంది. ఆబాజీ పక్షవాతంతో బాధపడుతున్నారన్న విషయం తెలిసి దేశ వ్యాప్తంగా ఉన్న వారి శ్రేయోభిలాషులెందరో ఉత్తరాలు వ్రాశారు. అలా వ్రాసిన వ్యక్తివ్యక్తికి సమాధానం వ్రాయలేని స్థితి కాబట్టి వారందరికి ఈ పత్రికల ద్వారా తమ కృతజ్ఞత తెలియజేస్తూ తమ ఆరోగ్యం కుదుటపడుతోందని

తెలిపారు. కుడిచేతితో వ్రాయలేని స్థితిలో ఎడమచేతితోనే వారి సందేశం వ్రాసి పంపించారు.

వారు ఇంత త్వరగా మన మధ్య నుండి కనుమరుగవుతారని అప్పుడు ఎవరు అనుకొన్నారు? 27వ తేదీన వారు మరణించారన్న వార్త విన్నప్పుడు విశ్వసించలేకపోయాను. ఎల్లప్పుడు మందహాసం తొణికిసలాడే ఆ ముఖారవిందం ఇకచూడలేమన్న ఆలోచన భరించశక్యంగాకుండా ఉంది.

రాష్ట్రీయస్వయంసేవక సంఘ పాతకార్యకర్తలందరికీ ఇది బాగా గుర్తు. గురూజీ ఎప్పుడు పర్యటనకు వచ్చినా నీడలా వారిని అంటిపెట్టుకొని ఉండేవారు అబాజీ. ఎన్నో సంవత్సరాలపాటు ఆవిధంగా ఉన్న కారణంగా వారు గురూజీ ప్రతిరూపమే అన్నట్లుండేది. ఫిబ్రవరి, 1945లో డా. వాసుదేవ కేశవ థట్టే గురూజీకి తోడుగా చేరారు. అంతకు పూర్వం 1938లో ముంబయ్‌లో మెడికల్ కాలేజీలో చదువుకొనే రోజుల్లోనే అబాజీ సంఘంలో చేరారు. 1940లో ప్రధమ వర్ష ఓ.టి.సి(సంఘశిక్షావర్గ)చేయడానికి వెళ్ళినప్పుడే సంఘస్థాపకులు డాక్టర్జీతోను, గురూజీతోను సంపర్కం ఏర్పడింది. సర్‌సంఘచాలక్ బాధ్యత స్వీకరించాక గురూజీ ముంబయ్‌కి ఎప్పుడు వెళ్ళినా అబాజీ గృహాన్ని తప్పక దర్శించేవారు.

యువకుడైన డా.థట్టే 1944లో ద్వితీయవర్ష సంఘశిక్షణార్థం వెళ్ళారు. అప్పుడే తమ భావిజీవితానికి సంబంధించిన నిర్ణయం జరిగిపోయింది. అవివాహితుడుగా ఉండిపోయి తమ సంపూర్ణజీవితం దేశకార్యంలో వినియోగించాలని నిర్ణయించుకొన్నారు. శిక్షావర్గ పూర్తికాగానే నాగపూర్‌లో వైద్యశాల ప్రారంభిస్తానని ఇంట్లో చెప్పి వచ్చేశారు. సుప్రసిద్ధ వైద్యుడైన ఒక డాక్టరుతో కలిసి బహు కొద్ది రోజులు మాత్రమే

ప్రాక్టీసు చేస్తూ సొంతంగా బోర్డు కూడా పెట్టుకొన్నారుగాని అది అతికొద్ది రోజులు మాత్రమే. ఆ తర్వాత డా. హెడ్గెవార్, పూజ్య గురూజీ చూపిన బాటలో పయనం ప్రారంభించారు. ఒక సంవత్సరంపాటు బెంగాల్‌లో ప్రచారక్‌గా పనిచేశాక 1945 ప్రారంభంలోనే గురూజీకి సహాయకుడుగా చేరిపోయారు. గురూజీతోపాటు దేశవ్యాప్తంగా పర్యటనలు సాగిస్తూ వారి లాగానే 'రైలు పెట్టె'నే తమ ఇల్లుగా చేసుకొన్నారు.

అఖండంగా కొనసాగిన ఈ పర్యటనల సందర్భంలో దేశవ్యాప్తంగా అనేకమంది స్వయంసేవకులకు ఆత్మీయులైనారు. గురూజీ దివంగతులైనాక పూజ్య బాలాసాహెబ్‌జీతోపాటు కొన్ని సంవత్సరాలు ఉన్నారు. 1987లో ఆబాజీ అఖిల భారతీయ ప్రచారక్ ప్రముఖ్‌గా సంఘ అఖిలభారత కార్యకారిణి సదస్యులైనారు. ఈ బాధ్యతలో రెండేళ్ళక్రితం జయపూర్‌కు వచ్చారు. తమ మూడురోజుల పర్యటనలో కార్యాలయంలో ఉండక ఒక కార్యకర్త గృహంలోనే బస చేశారు. ఆ సందర్భంలో వారితో గడిపిన కొద్ది సమయంలో గురూజీకి సంబంధించిన మధుర స్మృతులు కొన్ని నెమరువేసుకోవడం జరిగింది.

వారితో కూర్చుని సంభాషిస్తున్నప్పుడు ప్రపంచంలోనే ఒక మహాశక్తివంతమైన సంఘటనకు ముఖ్యాధికారులలో ఒకరైన వారితో మాట్లాడుతున్నానన్న భావనే రాలేదు. సహజ సిద్ధంగా వారిలో నిండియున్న ఆత్మీయతా భావం కారణంగా నేను మా దగ్గరి బంధువులలో ఒకరితో మాట్లాడుతున్నట్లుగానే అనిపించింది. అది వారిలోగల ప్రత్యేకత అనండి లేదా సంఘలో గల ప్రత్యేకతే అది అనుకోండి- ఒక అతి సామాన్యుడైన స్వయంసేవకునికి సహితం అత్యున్నతాధికారియైన సర్‌సంఘచాలక్ గారితో స్వేచ్ఛగా మాట్లాడే అవకాశం ఉంది. మేమిద్దరం దాదాపు ఓ గంటసేపు గురూజీ స్మృతులనే అమృతధారలో తడుస్తూ

గడిపాం. ఇంతకు పూర్వం ఎప్పుడూ గురూజీని గూర్చి విననటువంటి విశేషాలెన్నో వారు చెప్పారు. ఎంతో ఇదిగా అడిగితే తమ సొంత విషయాలు కొన్నిచెప్పారు.

ఇప్పుడు ఇక వారితో మాట్లాడే అవకాశం జారిపోయింది. ఆబాజీ మరణంతో సంఘంలో పనిచేసిన మొదటితరం ఆదర్శ స్వయంసేవకులలో మరొకరిని కోల్పోయినట్లయింది. వారి సంపూర్ణ జీవనం కర్మయోగానికి ఒక జీవంతమైన ఉదాహరణ. 'ఆదర్శ స్వయంసేవక్' ప్రతిరూపం ఆయన. ఆత్మీయత ప్రాణం పోసుకొని ఈ ధరాతలంపై మానవరూపంలో అవతరించిందా అన్నట్లు గడిచింది వారి జీవనం.

(డాక్టర్ సంజయ్‌కేల్కర్ యం.డి పూర్తి చేశాక చాలా సంవత్సరాలు సేవావ్రతిగా విశ్వహిందూపరిషత్ నిర్వహించిన వైద్యసేవా విభాగ్‌లో పని చేశారు.గొప్పవైద్యులు. నేషనల్ మెడికల్ ఆర్గనైజేషన్ స్థాపనకు ముఖ్యకారకులు. చివరిరోజులలో ఆబాజీకి ఎంతో భక్తి,శ్రద్ధలతో వైద్యంచేసిన డాక్టరు. ఆబాజీని గూర్చి వారి భావాలు తెలుసుకొందాం)

మా స్వస్థలం నాగపూర్ కావడంచేతను,మానాన్నగారు సంఘ స్వయంసేవక్ అయిన కారణంగాను సంఘ పెద్దలందరూ తరుచుగా మా ఇంటికి వస్తుండేవారు. మేము అప్పుడు చిన్న పిల్లలం. ఆప్టేజీ,మోరోపంత్ పింగ్లీ,బాలాసాహెబ్‌జీ,గురూజీ మొదలైన పెద్దలంతా మమ్మల్ని దగ్గరికి తీసుకొనేవారు. గురూజీతోపాటు అప్పుడప్పుడు ఆబాజీ కూడా వస్తుండేవారు. కాని మేము అంతగా పట్టించుకొనేవాళ్ళంకాదు. వారిపట్ల అంత ఆసక్తి కనపరచేవాళ్ళంకాదు. కాని మేము పెరిగి పెద్దవాళ్ళం అవుతున్న కొద్దీ వారికి బాగా సన్నిహితం అయ్యాం. ప్రపంచాన్ని బాగా చూచిన వ్యక్తి. వారి మాటతీరు,వారు పలకరించేవిధానం, వారు అనేక విషయాలపై ప్రశ్నలు వేసేతీరు, వారి మందహాసం- అన్నీ గమనించినప్పుడు

క్రమశిక్షణగల సంఘ కార్యకర్త అంటే ఇలా ఉండాలని, ఆయన ఒక నమూనా అనిపించేది. మనిషి ఏ సందర్భాలలో ఎలా మెలగాలి అనేది ఆయనను చూచి నేర్చుకోవాలి. 1975-80 మధ్య గడిచిన అయిదు సంవత్సరాలలో ఆయనకు బాగా దగ్గరయ్యాను. ఆయన ఏమాట మాట్లాడినా సందర్భశుద్ధి, స్పష్టత కొట్టవచ్చినట్లు కన్పించేది. ఎంతటి క్లిష్టమైన పరిస్థితిలోనైనా తీవ్రమైన స్వరం,పరుషమైన శబ్దజాలం ఉపయోగించేవారుకాదు. అనవసరమైన విషయాలలో జోక్యం చేసుకోకుండా ప్రక్కకు తప్పుకోవడం కూడా వారికి బాగా తెలుసు.

1975లో యం.డి పూర్తి చేస్తున్న రోజుల్లో సంఘానికి బాగా దగ్గరయ్యాను. ముంబాయిలోను మెడికల్ కాలేజి కార్యాలయానికి సమీపంలోనే ఉంది. నేను తరచుగా కార్యాలయానికి వెళుతుండేవాడిని. ఈకాలంలోనే పూజ్యబాలాసాహెబ్‌జీతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. యం.డి అయిపోయాక ప్రచారక్‌గా వెళ్ళాలనే కోర్కె ఉండేది. కాని 1981 తర్వాత విశ్వహిందూపరిషత్ నిర్వహించే వైద్యసేవా కార్యంలో పనిచేయమన్నారు. విశ్వహిందూ పరిషత్ వైద్యశాలలో పని చేయడానికి వెళ్ళే ముందు బాలాసాహెబ్‌జీని కలిశాను. ఈ కార్యంలో తోడ్పడగలి వ్యక్తుల పేర్లు ఎన్నో చెప్పారు. అంత మందిని గుర్తుంచుకోవడం అంటే సామాన్యమైన విషయంకాదు.

1981-87 మధ్య కాలంలో బాలాసాహెబ్‌జీతో ఎక్కువ కలుస్తుండేవాడిని. ఆ రోజుల్లోనే బాలాసాహెబ్‌జీ మీద ఆరు వ్యాసాలు కూడా వ్రాశాను. ఈ వ్యాసాలలో కూడా అనేక విషయాలపైన కాస్త దురుసుగానే వ్యాఖ్యానాలు చేశాను.

1987 ఫిబ్రవరి మాసంలో నేను, ఇంకా ఒకరిద్దరు డాక్టర్లు బాలాసాహెబ్‌జీని కలిసి మన సంఘ సంపర్కంలో ఉండే సేవా ప్రవృత్తిగల

డాక్టర్లందరితో కలిసి ఒక కాన్ఫరెన్స్ పెట్టాలనే విషయం చర్చించాము. దీనిలో డాక్టర్లు, సంఘ ప్రముఖులు కలిసి చర్చించాలని, ఇప్పుడు సేవ పేరుతో జరుగుతున్న మతాంతరీకరణ వగైరా దుష్కార్యాలకు అడ్డుకట్టవేసేందుకు తీసుకోవలసిన చర్యలేమిటో కూలంకషంగా చర్చించాలని ప్రతిపాదించాను. చాలాకాలంగా ఇలాంటి కాన్ఫరెన్సు పెట్టేందుకు ప్రయత్నిస్తున్నా ఏదో ఒక అడ్డం రావటంతో అది కుదరడంలేదు అని కూడా బాలాసాహెబ్‌జీకి వివరించాను. ఇరవై నిమిషాలు మేము చెప్పినదంతా విన్నాక బాలాసాహెబ్‌జీ మమ్మల్ని ఆబాజీ దగ్గరకు తీసుకెళ్ళారు. ఆ కాన్ఫరెన్సు నిర్వహణకు సంబంధించి మార్గదర్శనం చేయమని పురమాయించారు. బాలాసాహెబ్‌జీ దగ్గర నుండి సూచన వచ్చాక ఆబాజీ ఇక కార్య రంగంలో దిగారు.

ఆబాజీ తమ వద్ద దేశవ్యాప్తంగా అక్కడొకరు, ఇక్కడొకరుగా ఉన్న స్వయంసేవక డాక్టర్ల అడ్రసులు వ్రాసిపెట్టుకొన్నారు. కేవలం అడ్రసులు మాత్రమేకాదు వారితో చక్కటి సంపర్కం కలిగి ఉన్నారు. ఇంత మంది డాక్టర్లతో వ్యక్తిగతంగా సంపర్కం పెట్టుకోవడం అంటే అనితర సాధ్యమైన పని. కాన్ఫరెన్సు ఏర్పాటు చేసుకోవాలని నిర్ణయం జరిగింది. వీరందరికి ఉత్తరాలు వ్రాయమని ఆబాజీ నాకు పురమాయించారు. ఆ ఉత్తరం నమూనా ఒకటి నాకు ఇచ్చి దానిని జిరాక్స్ తీయించి అందరకీ పంపించమన్నారు. వారు రోజూ కొన్ని పేర్లు ఎంపిక చేసి,వారి అడ్రసులు నాకు పంపేవారు. నేను జిరాక్స్ తీసిన ఆ ఉత్తరాలు పోస్టులో పంపుతుండేవాడిని. ఆ ఉత్తరంలో సమాజంలో ఉన్న ఇతర డాక్టర్లకు సేవావ్రతి డాక్టర్లకుగల తేడా ఏమిటో వివరిస్తూ వీరు నిర్వహించవలసిన కార్యభారాన్ని విపులంగా తెలియజేయడం జరిగింది. పరస్పరం అభిప్రాయాల కలబోత ద్వారా మనం ఎంతైనా సాధించవచ్చునని,ఆ దిశలో ఈ కాన్ఫరెన్సు ఎంతో అవసరమని తెలియజేశారు.

1988లో జరిగిన ప్రతినిధుల సభలో కూడా ఈ విషయం ముచ్చటించడం జరిగింది. విభిన్నమైన గ్రూపులతో కలిసి మూడుసార్లు విషయం చర్చించడం జరిగింది. మా.శేషాద్రీజీతోపాటు కర్నాటక నుండి వచ్చిన ప్రతినిధులు కూడా ఈ ఆలోచనను బాగా మెచ్చుకొన్నారు. మనం సేవారంగంలో పైద్యసేవలు అందించడానికిగల కారణాలు దానికి సంబంధించిన వివరణలు, దాని ప్రయోజనాలు అన్నీ వివరించడం జరిగింది. నేషనల్ మెడికల్ ఆర్గనైజేషన్ పేరిట ఒక సంస్థను ఏర్పాటు చేయనున్నట్లు కూడా ప్రకటించడం జరిగింది. కొన్ని సందర్భాలలో నేను మాట్లాడుతున్నపుడు కాస్త దురుసుగానో,పరుషంగానో ఉన్నట్లు గమనిస్తే ఆబాజీ వెంటనే సరిదిద్దేవారు.

కాన్ఫరెన్సులో చదవవలసిన కీలక ప్రసంగాన్ని తయారుచేయ వలసిందని ఆబాజీని అభ్యర్థించడం జరిగింది. యన్.యం.ఓ పనితీరు, ఆశయాదర్శాలు ఇలా ఉండాలని పాయింట్సు వ్రాసి ఇచ్చాను. వారు దానికి రూపురేఖలు దిద్ది సకారాత్మక దిశా నిర్దేశకం చేస్తూ సుతిమెత్తటి భాషలో 50 పేజీల ప్రసంగం తయారు చేశారు. వైద్య వృత్తిలో పాటించవలసిన నైతిక విలువలు, సేవాభావ దృక్పథం విజయవంతంగా కొనసాగాలంటే ఆర్గనైజేషన్ అవసరం ఆ ప్రసంగంలో ప్రముఖంగా చోటు చేసుకొన్నాయి. సేవా ప్రకల్పాల యోజనలో భాగంగా వైద్యసేవలు అందించడానికిగాను సుశిక్షితులైన డాక్టర్ల సేవలు సద్వినియోగపరచుకొనే దిశలో 'నేషనల్ మెడికల్ ఆర్గనైజేషన్' కల్పన ఒక మైలు రాయివంటిది.

ఆ తర్వాత నేను ఆబాజీని నాగపూర్‌లోను, బొంబాయిలోను తరచుగా కలుస్తుండేవాడిని. నా భార్యకు కూడా ఆబాజీ పట్ల ఎంతో ఆప్యాయత ఉండేది. ఆమె అభిమతానికి తగ్గట్లుగా ఆబాజీ కూడా ఎంతో అనురాగంతో చిన్నచిన్న కానుకలు ఇచ్చేవారు. ఒకసారి ఈ దేశపు వైద్య సంస్కృతి తెలియపరచే ''స్ట్రాంగ్ మెడిసిన్'' అనే పుస్తకం కానుకగా ఇచ్చారు.

కాన్ఫరెన్సు ఏర్పాట్ల సందర్భంలోనైతేనేమి, ఆతర్వాత ఈ ప్రయోగాన్ని అమలు పరచడం విషయంలోనేమి నేను ఆబాజీతో షుమారు ఏడు సంవత్సరాలు అతి సన్నిహితంగా కలిసి పని చేశాను. ఏదైనా ఒక అంశం ప్రముఖంగా వెలికి తీసుకురావాలంటే అది ఆయన అనుకొన్న రీతిలో ప్రకటితమయ్యే వరకు సున్నితంగా చెపుతూ మార్పులు, చేర్పులు చేయిస్తుండేవారు. ఒకసారి మెడికల్ కాలేజీలలో కేపిటేషన్ ఫీజుకు సంబంధించి సవివరమైన రిపోర్టు ఒకటి తయారుచేయమన్నారు. నేను 50 పేజీల రిపోర్టు తయారు చేశాను. అది ఆబాజీ చదివారు. భాష విషయంలోను, వ్యక్తీకరణలోను దుందుడుకుపోకడలున్న ప్రతి చోట మళ్లీ మార్చి వ్రాయించారు. అలాగే ఒకసారి యన్. యం. ఒ తాత్విక చింతన, సంఘటన అవసరం, సేవావ్రతుల కర్తవ్యం ఇత్యాది విషయాలు విపులీకరిస్తూ ఒక పేపరు తయారుచేశాను. ఆ సందర్భంలోనే కమ్యూనిష్టులు, సోషలిష్టులు చేస్తున్న తప్పిదాలు బహిర్గతం చేస్తూ ఒక సుదీర్ఘమైన వ్యాసం వ్రాశాను. ఆబాజీ అది చదివాక తగు మార్పులు సూచిస్తూ ముందుగా దాన్ని సంక్షిప్తం చేయమన్నారు. అప్పుడే చదువరులకు ఆసక్తి కలుగుతుందని చెప్పారు. ఆయన చెప్పినట్లుగానే మళ్ళీదానిని తగ్గించి వ్రాశాను. వాస్తవానికి నాలో ఏ విషయంపైన అయినా వ్రాయగల శక్తియుక్తులున్నాయి, విషయపరిజ్ఞానం ఉంది, ఉడుకుతనం ఉంది, .బావావేశమూ ఉంది, అర్హతలూ ఉన్నాయి అలాంటి నేను వ్రాసిన దాన్ని తిరగ వ్రాయించడం అంటే అంత సులువైన పని కాదు. కాని ఆబాజీలోగల ఆకర్షణ ఏమిటోగాని ఆయన కోరుకొన్న విధంగా విషయవ్యక్తీకరణ వచ్చేంతవరకు మాచేత మార్చి వ్రాయించేవారు. ఆ చెప్పడంలో ఏ రకమైన అభిజాత్యంగాని, పెడసరపుధోరణిగాని ఉండేది కాదు. సంస్థ ప్రగతిని ప్రధానంగా చేసుకొని చెపుతున్నారన్నదే దానిలోని

ఆంతర్యం అని అందరం అర్థం చేసుకొనేవారం. వాస్తవానికి నా అంతట నేను వ్రాసిన విషయాలు లేవనే చెప్పవచ్చు. ఆయన చెప్పివ్రాయించినవే అన్నీను. యన్. యం.ఒ లోని డాక్టర్లందరితో వారికి సన్నిహిత సంబంధాలుండేవి. మాలో నిక్షిప్తమైయున్న శక్తియుక్తులను వెలికి తీసి,'నీవెంత పని చేయగలవో చూడు!'అని భుజం చరిచి ముందుకు నడిపించిగల సామర్థ్యం ఆబాజీలో పుష్కలంగా ఉంది. 1988,89,90-మూడు సంవత్సరాల పాటు మేమంతా అవిరళ కృషి చేసాము.

ఆ తర్వాత కారణాలు ఏవైనా కానీండి అంతర్గత విభేదాల వల్ల సంస్థ చితికిపోయింది. ఆబాజీ కూడా ఆరోగ్యకారణాలవల్లకాని,పని వత్తిడి వల్ల గాని దానిని నియంత్రించడంలో దృష్టి సారించలేకపోయారు. 1990 అక్టోబర్‌లో పరిస్థితి చేయిదాటిపోయింది. నేను మార్చి1991 నాటికి నాగపూర్ తిరిగి వచ్చేశాను. నా భార్య అంతకు ముందే వచ్చేసింది. ఆతర్వాత కూడా ఆబాజీ మా ఇంటికి తరచుగా వచ్చేవారు.

ఆబాజీని గూర్చి ఒక విషయం తప్పకుండా చెప్పాలి. అయన కేవలం యం.బి.బి.యస్ ప్యాసయిన డాక్టరు. అయన జీవితంలో వైద్యం చేసిన పేషంట్ ఒకే ఒకవ్యక్తి-సర్‌సంఘచాలక్. కాని అయన సలహామేరక వివిధ డాక్టర్ల దగ్గర వైద్యం చేయించుకొన్న పేషంట్లు మాత్రం అనేకుల ఉన్నారు. వారు వైద్యుడుగా కూడ అతి సూక్ష్మగ్రాహి. ఎంతో చక్కటి సలహాలిచ్చేవారు. వైద్యానికి సంబంధించి పాక్షికమైన దృష్టిగాక 'హోలిస్టిక్ విజన్' ఉండేది. ఆయన చదివినది యం.బి.బి.యస్ అయినప్పటికి అపారమైన వైద్య జ్ఞానం ఉండేది. ఈనాటి డాక్టర్లవలె కాదు. ఈనాడు సూపర్ స్పెషాలిటీస్ వచ్చాక ఎవరికీ సంపూర్ణ పరిజ్ఞానం లేకుండా పోతోంది. కార్డియాలజిస్ట్, న్యూరాలజిస్ట్, పిడియాట్రిస్ట్ ఉన్నారేగాని ఫిజిషియన్లు కరువవుతున్నారు. వనవాసీకళ్యాణాశ్రమ్ ప్రముఖులు శ్రీ

కేశవ్ కేల్కర్ తమాషాగా, 'భారతదేశంలో ఏ విషయం ప్రస్తావించినా అది హిందూయిజం మైనస్ ఇంకొకటీ అవుతుందిగాని మరొకటి కాదు. అలాగే వైద్య శాస్త్రంలో ప్రతిదీ 'ఫిజిషియన్ మైనస్ ఇంకొకటి' అవుతుందేగాని మరొకటికాదు. ఆబాజీ ఆ విధంగా చూచినప్పుడు మంచి ఫిజిషియన్.

చివరిరోజులలో ఆయనకు నేనే వైద్యం చేశాను. ఆయనకు ఊపరి పీల్చుకోవడం కష్టమైపోయింది. ఆధునిక వైద్యశాస్త్రంలో గుండె, కిడ్నీలు, లీవర్ దేనికైనా మంచి వైద్యం ఉందిగాని ఊపిరి తిత్తులు చెడిపోతే వాటిని మార్చివేసే అవకాశం లేది. డా. ధర్ కూడా రోజు వచ్చి చూచిపోయే వారు. నేను, ఇంకా ఇతర డాక్టర్లు సంప్రదించకొని వైద్యం చేస్తుడేవారం. ఆబాజీ కూడా తనకు జరుగుతున్న వైద్యాన్ని గూర్చిచర్చించేవారు. ఆయన వైద్యం వద్దనలేదుగాని అంత ఆసక్తి కూడా కనపరచినట్లు లేదు. అయ్యేదేదో అవుతుంది అన్న ధోరణిలోనే ఉండేవారు.

ఆ స్థితిలో బాలాసాహెబ్‌జీ ఆయనను కలుకుకోవాలని కోరారు. స్వయంగా వారి పరిస్థితి ఆందోళనకరంగా ఉంది. అంతకంటె తీవ్రంగా ఉన్న పరిస్థి ఆబాజీది. వారిద్దరి సహచర్యం ఇప్పటిదా? ఐదు దశాబ్దాలకు పైగా ఉన్న అనుబంధం. సాటి కార్యకర్తగా, స్నేహితుడిగా, ఆత్మీయుడిగా పెనవేసుకుపోయిన అనుబంధం అది. ఆ స్థితిలో వారిద్దరు కలిస్తే ఎలాంటి భావోద్వేగం చోటుచేసుకొంటుందో మనం ఊహించవచ్చు. డాక్టరుగా వారి కలయిక నాకు ఇష్టం లేదు. కాని కాదనే శక్తి కూడా లేదు. ఏమి ప్రమాదం ముంచుకొస్తుందో అన్న శంకతో అన్ని జాగ్రత్తలు తీసుకొని వారి కలయికకు అనుమతిచ్చాం. ఏ ప్రమాదం జరగలేదు. ఊపరి పీల్చుకొన్నాం. ఆబాజీని చూడటానికి శ్రీయుత అశోక్ సింఘాల్, మురళీమనోహర్ జోషి, దత్తోపంత్ ఠేంగ్డీ ఇంగా అనేక మంది ప్రముఖులు వచ్చేవారు. ఒక రోజు అటల్ బిహారీజీ వచ్చారు. వారు వచ్చాక మా

ఆస్పత్రిలో మొత్తం,'ఇంత సామాన్యంగా కనిపించే ఈ రోగి ఎంతటి మహాపురుషుడో' అనుకోనారంభించారు ఆబాజీని గూర్చి.

చివరిగా నా హృదయంలో ఉన్న మాట ఒకటి మీ ముందు పెట్టి ముగిస్తాను. నేనేగనుక 1945 నాటికే యంబిబియస్ ప్యాసయిండి సర్‌సంఘచాలక్‌గారికి సహాయకుడుగా ఉండవలసివస్తే హనుమంతుడు గనుక సర్వకాలసర్వావస్థలలో రామనామస్మరణలో గడిపిన విధంగా ఒకే ఒక వ్యక్తి సేవలో ముప్పై ఎనిమిది సంవత్సరాలు గడపడం సాధ్యమయ్యేదా! ఇరువై నాలుగు గంటలు సర్‌సంఘచాలక్ గారికి నీడలా వుండి మరోవిషయం ఏది ఆలోచించకుండా సొంత అస్తిత్వాన్ని మరచిపోయి మసలుకోవడం సాధ్యమయ్యేదా? దత్తోపంత్ ఠేంగ్డీగారు ఆబాజీకి శ్రద్ధాంజలి ఘటిస్తూ వారిని 'ఆత్మవిలోపి' అన్నారు. ఈ 'ఆత్మవిలోపి' స్థితిని పొందటానికి ఇసుమంతయైనా అహంకారానికి చోటివ్వక తనను తాను మర్చిపోవలసి ఉంటుంది. నాకైతే ఇది ఊహకందని విషయమే. ఒక వ్యక్తితనను తాను ఇంతగా తగ్గించకోగల్గడం అనేది విశ్వసించగల విషయమా అని విస్తుపోతుంటాను. ఇది ఆబాజీకే సాధ్యమైంది.

## ఆత్మవిలోపి ఆబాజీ

(1995 డిశంబర్ 6నాడు నాగపూర్ మహానగర్ సంఘశాఖ రేషంబాగ్‌లోని డా.హెడ్గెవార్ సభాభవనంలో ఏర్పాటుచేసిన సభలో డా.ఆబాజీ థట్టేకు శ్రద్ధాంజలి ఘటిస్తూ శ్రీ దత్తోపంత్ ఠేంగ్డీ చేసిన ప్రసంగంలోని భాగం)

గురూజీ తమ బైఠక్‌లలో తరచు సంఘ స్వయంసేవకులు 'ఆత్మవిలోపి'లు కావాలి అంటుండేవారు. 'ఆత్మవిలోపి' అనే శబ్దం అర్థం చేసుకోవడం కష్టమైన పని. ఈ శబ్దార్థాన్ని గ్రహించేట్లు

చేసేందుకు,గురూజీ తరచుగా అలెగ్జాండర్ పోప్ వ్రా సిన ఆంగ్ల కవితలోని పంక్తులు వినిపించేవారు. కవిత శీర్షిక 'ఓన్లీ టు సాలిట్యూడ్'. కవితలోని ఆఖరి పంక్తులు ఇలా సాగుతాయి."Thus let me live unseen unknown' అంటే నన్ను ఎవరూ చూడనట్లుగాను గుర్తించనట్లుగాను,నేను జీవించేట్లుచూడు. Thus unlamented let me die అంటే నా చావు ఎవరికీ దుఃఖం కల్గించకుడుగాక. Thus unlamented let me die still from the world and not a stone instil where I lie అంటే ఎవరికీ తెలియని రీతిలో నేను తెరమరుగుకావాలి, శాశ్వత నిద్రకులోనై ఈ చోట పాతి పెట్టబడ్డానన్న విషయం తెలిపే చిన్న రాతి ముక్కకూడా అక్కడ ఉంచబడకుండుగాక.

ఈ వాక్యాలు గురూజీ తరచు జ్ఞప్తికి తెచ్చేవారు. అందుకు తగినట్లుగానే గురూజీ తమ మృత్యుపత్రంలో 'నాకు ఎలాంటి స్మారకం నిర్మించరాదు' అని స్పష్టంగా వ్రాశారు. ఈ వాక్యాలను సరియైన విధంగా అర్ధంచేసుకొని, ధారణ చేసి, ఆచరణలో పెట్టిన ఆబాజీ శారీరకంగా మన మధ్య లేకున్నప్పటికి ఆదర్శ రూపంలో మన మధ్య ఉంటారు.వారి జీవితం ద్వారా మనను ప్రభావితం చేసిన గుణ సముచ్చయాన్ని నిరంతరం అనుకరించడమే వారికి నిజమైన శ్రద్ధాంజలి. వారిలో దర్శన మిచ్చిన ఆత్మలోపన ప్రవృత్తి మనలో కూడా నింపుకొందాం ఈనాడు మన చుట్టూ ఉన్న వాతావరణంలో ఇలాంటి ప్రవృత్తిని నింపుకోవడం అంటే కష్టతరమైన పనే. అయినప్పటికి పట్టుదలతో ప్రయత్నిద్దాం. ఆత్మవిలోపనం అనే శబ్దానికి అది సంక్షిప్తంగా గురూజీ 'నేను'లేదు అంతా 'నీవే' అని అర్ధం చెప్పారు. సూత్రప్రాయంగా పూజ్య గురూజీ అందించిన ఈ సందేశం 'మనస్సులో ఉంచుకొని ఆబాజీని అనుకరించే ప్రయత్నం చేద్దాం. అదే నిజమైన శ్రద్ధాంజలి.



ప.పూ. శ్రీ గురూజీతో శ్రీ ఆబాజీ



ప.పూ. బాలాసాహెబ్‌జీతో శ్రీ ఆబాజీ



ప.పూ. రజ్జూభయ్యాతో (శ్రీ) ఆబాజీ